# కథలు





ఓమ్

బ్రహ్మానంద తీర్థ పాదుకాభ్యామ్ నమో నమః.

సగుణ నిర్గుణైకత్వమ్ము సరణి తెలిసి
బ్రహ్మజీవైక్యమును జూపు ఘన విబుధులు
సచ్చిదానంద సద్గురు సంయమీంద్రు
పాదముల నంతు శ్రీపాద పదవి మదిని.



కథకుడు :

**కోట శ్రీరాములు.**



డాక్టరు: పుచ్చా వెంకటరామయ్యగారు.

నను హితునిగ తన వెంటనె
యునిచికొని సుదుల యొడుపుల నొసగిన పుచ్చా
ఘనయశు వేంకటరామయ
కును నీ కృతిగూర్చి యిడుదు గూరిమితోడన్.

— కథకుఁడు

## శ్రీ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ఎం. ఏ. గారి

# తొలి పలుకు



సారస్వతము అనేక విధాలుగా ఉండవచ్చు. నాటకం, నవల, ఖండకావ్యం, ప్రబంధం. కథ మొదలైన పద్ధతిగ చూచినా అనేకమే. ఇందులో ఏ ఒక విషయాన్ని తీసికొనిఅయినా మళ్ళీ అనేక విధాలుగా ఉండవచ్చు. ప్రస్తుతము ఇది కథల సంపుటి. ఈ కథలే చూడండి. కాశీమజిలీలవంటికథలు, పిల్లలు చెప్పుకునేటువంటి కథలు, దయ్యాల కథలు, పాములకథలు. వీటిని వదలిపెడితే సారస్వత రూపంగా ఉండేకథలే అనేక రకాలుగా ఉండవచ్చు. ఒట్టి కథా దృష్టితో వ్రాసేకథ ఒకటి. రసదృష్టితోవ్రాసే కథ ఒకటి, లోకాన్ని మరమ్మతు చేద్దామనివ్రాసే కథ ఒకటి. రాజకీయ దృష్టితో ఒక సిద్ధాంతాన్ని పెట్టుకునివ్రాసే కథ ఒకటి. మతాన్ని ప్రచారంచేద్దామని వ్రాసే కథ ఒకటి. సంఘాన్ని చిత్రిద్దామనివ్రాసే కథ ఒకటి. ఇట్లా ఇదీ అనేకవిధాలుగా ఉండవచ్చు. కాదు సంఘాన్ని చిత్రిద్దామనే కథే ఉంది. అదీ అనేకవిధాలుగా ఉండవచ్చు. సంఘం ఎట్లాఉండాలీ అనివ్రాసే కథ ఒకటి. సంఘంలోఉండే

దోషాలు చూపిద్దామని వ్రాసే కథ ఒకటి. ఈ దోషాలు చూపించడంలోగూడ మళ్ళీ దృష్టి భేదం ఉండవచ్చు. ఉన్న సంఘంలో ఈదోషం పరిహరిస్తేచాలు అన్నదృష్టితో ఒక కథ ఉంటుంది. ఆదోషం చూపించడం ఉన్నసంఘవ్యవస్థ పూర్తిగా పోవాలి - క్రొత్తమోస్తరు సంఘవ్యవస్థ రావాలి. అనే దృష్టితో వ్రాసే కథవేరు. అట్లా ఒక్క కథే కాదు. ఏ సారస్వత శాఖఅయినాసరే అనంతమైన వైవిధ్యంతో ప్రకాశిస్తోంది.

కథావస్తు విట్లా ఉంటే కథారచన బహువిధాలుగా ఉండవచ్చు. భాష బహువిధాలుగా ఉండవచ్చు. మనుష్య సృష్టి ఎంత పృథక్కో సారస్వత మంత పృథక్కు.

మనదేశంలో ఇప్పుడు కథాసారస్వత మెక్కువయింది. కథలు వ్రాసేవాళ్లు చాలామంది ఉన్నారు. చదివేవాళ్లు తక్కువమందేమో! వాడుక భాష ఒకటి ప్రబలింది. కనుక అందరూ యథేచ్ఛంగా తమ భావాలను చెప్పకోవచ్చు. అంత భాషాపాండిత్యం లేనివాడుకూడా ఏదో వ్రాయవచ్చు. అందుచేత అందులో ఏదీ లేదనటానికీ వీలుండదు. గోల్డుస్మిత్ (Gold Smith) వ్రాసినట్లు ఒక గ్రంథంలో ఏ ఒక్కతప్పైనా ఉండకుండా ఉండవచ్చు. చదవటానికి చప్పగా ఉండవచ్చు. మరొక్క గ్రంథంలో చాలా తప్పులు ఉండవచ్చు. చదవటానికి ఆకర్షకంగా ఉండవచ్చు. జీవశక్తి లీల అనంతం.

ఈ గ్రంథకర్త చదువుకున్నవాడే. ఇందులో భాష అచ్ఛంగా వాడుకభాష గాదు. కాదనటానికీ వీలు లేదు. శిష్ట వ్యవహారం అంటే తప్పలేదు. గ్రాంథికమార్గం మాత్రం గాదు.

ఈరోజుల్లో కొందరు వ్రాస్తే ఇంగ్లీషు భావాలకు,

వాక్యాలకి తర్జుమాలుగా ఉంటున్నవి. ఈ పుస్తకంమాత్రం అట్లాలేదు. కారణం ఈ గ్రంథకర్తకి అంత ఇంగ్లీషు పరిచయం లేదు. ఏ కొంతవచ్చినా దాని మీద అంత వ్యామోహం లేని వాడు.

ఈ కథల్లో నూటికి తొంభై మన సంఘంలోఉన్న అనేక దురలవాట్లను గూర్చి వ్రాసిన కథలు. అట్టే మాట్లాడితే ఏకుటుంబాలోనో ఒకకుటుంబంలో జరిగినకథలు. వాటినే పేర్లుమార్చి ఊళ్లుతప్పించి వ్రాయటం. ఎక్కువగా బ్రాహ్మణ కుటుంబాలలో ఉన్న పిచ్చి వేషాలను గురించి వ్రాయటం.

ఈయనికి కథారచనాశక్తి ఉందా లేదా! అని విచారిస్తే ఆ శక్తి అంటే ఏమిటి ? అను ప్రశ్న పుడుతుంది. హాగ్ గారి మొదట చెప్పినవాక్యం మొదట చక్కగా అర్థం కావాలి. ఆ వాక్యం అరువు తెచ్చుకున్నట్లుగా ఉండకూడదు. తరువాత విషయం తరువాత విషయం. అంశం తరువాత అంశం అను బంధంగాఉండాలి. శిల్పవిషయికంగా కథకు ఆద్యంతాలు బిగించడం. విషయం వదలిపెట్టి వేయుంటే, కథకు ముక్కూ ముఖం ఏర్పాడాలంటే అది ఒక అంశంతో మొదలు పెట్టాలి. ఆ అంశం క్రమంగా సాగి ఒకకొస తేలాలి. ఇది సామాన్యంగా ఏ కథకైనా ఉండవలసిన లక్షణమే కదా! ఇదికూడా లేని కథలు కొన్ని లేకపోలేదు. ఈ పుస్తకములో ఉన్న కథలకు మాత్రం ఆ దారిద్ర్యం లేదు. ఒక్కొక్కప్పుడు కథాద్యంతాంశాలు స్ఫూర్తికి వదలిపెడతాడు కథకుడు. మహా మేధావియైన కథకుడు అట్లా చేస్తే గొప్పగాఉంటుంది, బుద్ధి రసిస్తుంది. కాని ప్రతిచక్కంయూ చమత్కారంగా చేస్తే

పచ్చివక్కలు నమిలినట్లుంటుంది, కారాకూడా లేకుండా, ఈ కథలు అంత ఎత్తుపోవు. సామాన్యంగా సులభంగా పండితపామరైకవేద్యంగా ఉంటవి.

ఈ కథకుడు మన దేశంలో ఉన్న పూర్వగ్రంథాలు, సంప్రదాయాలు వాటియందు అభిమానంకలవాడు. ఇందులో ఒక కథ "దివికేగలేక బ్రతికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు" అని మొదలుపెట్టింది. ఈ మొదలుపెట్టడం పూర్వ కవులయందూ, కావ్యాలయందూ కల అభిమానాన్నే చెప్పటం లేదు. కథను ప్రారంభం చేయుటలో ఉన్న ఒడుపు గూడా తెలియచేస్తోంది.

ఈ పుస్తకంలో వర్జ్యదోషాలు వస్తవి- సత్యనారాయణ వ్రతాలు వస్తవి, కృష్ణా స్నానాలు వస్తవి, గంగాపతే గౌరీపతేలు వస్తవి. కోడళ్ళని బాధపెట్టడం, దుష్టుడైన భర్త, ఆడతోడు, ఒకక్షణానికి నోటికి చేతికి కలవటాన్ని గుణించి ఇబ్బందులు పడే సామాన్య సంసారాలు, వాళ్ళ విశ్వాసాలు, వాళ్ళ మూర్ఖత్వాలు, వాళ్ళ దురాచారాలు, వీటన్నిటితోపాటు ఆ సంసారాల్లో ఉన్న మాధుర్యం సాంప్రదాయాలను పట్టుకు వేళ్ళాడటం, ఒక విషయ మేమిటి? ఈ జిల్లా చుట్టుపట్లుండే సంఘమంతా సమృద్ధిగా ఉంటుంది.

ఇంత మాత్రముచేత సారస్వతికంగా వాక్యవిన్యాసం ఉండదనుకో కూడదు. "నీ ఔదార్యానికి లొంగిపోయా నన్నాడు శ్రీధరం" అనే వాక్యం 181 వ పేజీలో ఉంది. ఇది వాడుకభాష అంటామా? వాడుకలో ఇట్లా అంటామా?

అనము, భావం గ్రాంథికమే, ఇట్లా గ్రాంథికాలైన అనేక భావాలు వాడుక భాషా ప్రత్యయాలు పెట్టి వ్రాస్తూ వాడుక భాష అనుకుంటునే ఉన్నారు. ఈ దృష్టితో చూస్తే గ్రాంథిక భాష అంటే నాగరికభాష అన్నమాట. దుఃఖాలు అనుభవించడం లోకములో ఉందిగాని గ్రంథాలల్లో ఉండే వ్యక్తులు వాటిని అనుభవించడం వేరేపద్ధతిగా ఉంటుంది. "ఆసాయంత్రం ఆ స్మశానాల్లోకి వెళ్లి ఆ చితిచూసుకున్నా - మళ్లీ లలిత స్ఫురించింది. ఇంత బూడి తీసుకున్నా" ఇది 129 పేజిలో ఉంది. ఇట్లాంటి సంఘటనసామాన్యమానవ జీవితంలో సామాన్యంగా ఉంటుందా? సామాన్యం అని వాడాను, ఏక్కడో ఉండదని కాదు. గ్రంథంలో ఉండేదానికీ, లోకసామాన్యమైన దానికీ ఇదీ భేదము, గ్రంథములో ఉండేదీ లోకంలో ఉంటుంది. లోకంలో ఉంటుందంటే కొన్ని విశిష్టపరిస్థితుల్లో ఉంటుం దన్నమాట. గ్రంథంలో ఉండేవిశిష్టములైన పరిస్థితులన్నీ ఊహాచేత సంభావ్యాలుగా ఉంటవి. అంటే ఊహాయందు సంభావ్యతా సిద్ధిని పొందుతవి. మనస్సు రూపకాలంకారానికి మూలమైన పదార్థము, అంటే దాని ఆలోచన అంతా ఆరోపితమని అర్థము. అసలు ఆలోచనలోనే ఆరోపముంది. ఒకదాన్ని చూచి ఒకటి అనుకుంటాము. కార్య కారణ సంబంధములో కారణ పరంపరలో కొన్ని కారణాలను దాటవేస్తాం. మనస్సెప్పుడూ సాధ్యమైనదాన్ని యథార్థంగా భావిస్తుంది. లేకపోతే కావ్యాలకు జీవితం లేదు.

ఈగ్రంథకర్త ఇంతమాత్రమే గాదు. ఈయనకు ప్రకృతి వైద్యమంటే యిష్టం. ఆ యిష్టం పుస్తకం మొత్తమీద కనుపి

స్తునే ఉంటుంది. ప్రధానంగా మొదటి కథలో నేడుంది. "జీర్ణంజీర్ణం వాతాపి జీర్ణంలో."

ఈ కాలంలో పురాణకథలను అన్యథా వ్యాఖ్యానం చేయటం, లేకపోతే ఆధునికంగా వ్యాఖ్యానం చేయటం చాల మందిచేస్తున్నపని. ఈకథలోఅదిఉన్నది. ఇది 'కథ' అనటంకంటే 'నాటిక' అంటే బాగుంటుంది. ఇందులోవాతాపి ఏదో ఒక సిద్ధుని సంపాదించాడు. దానితోవాడిని చంపి వండినా మళ్లీ వాడి శరీరావయవాలు సరిగ్గా అంటుకుని రూపకంకట్టి మళ్లీ వాడవుతాడు. ఇది ఒక ప్రక్రియగా వ్రాయటం చాలా ఆధునికము.

ఈకథలల్లో ఈగ్రంథకర్త ప్రకృతివైద్యాభిమాని అని చెప్పానుగాదూ. ఈకథలు ప్రకృతి పత్రికలలో ప్రకటించబడినవే. ఇప్పుడు గ్రంథరూపమున ప్రకటింపబడినవి. ఈకథలకు పాఠకలోకం సమృద్ధిగాఉంది. ఉండంటే ఈకథలయందలి గుణబాహుళ్యం నిర్వివాదాంశం.

ఈయనపేరు కోట శ్రీరాములుగారు. సాధువు. వినయ వంతుడు. చక్కని భాషాజ్ఞానము కలవాడు. ఈ విషయం పుస్తకంచూస్తేనే తెలుస్తుంది కూడా.

ఈపుస్తకం చదివితే ఈ ప్రపంచకంలో ఈయనకెన్ని విషయాలు తెలుసో తెలుస్తుంది. ఎంత ఊహాశాలో గూడ తెలుస్తుంది. కథారచనలో ఎంత గడుసుగా చేస్తాడో గూడ తెలుస్తుంది. వాడుకభాష ఎంత చక్కగా వాడుతాడో తెలుస్తుంది.

ఇందులో 13 కథలు ఉన్నవి. చాలాకథలు అనేక భాగాలుగా వెళుతూఉంటుంది.

ఒకభావంరావచ్చు. దానికిరూపం ఇవ్వటం కష్టం. కవి యంటేవాడే. ఈయన ఏదోఉద్యోగం చేసుకుంటున్నాడు. ఆ ఉద్యోగం కాళ్లుచేతులు ఆడనిచ్చేదిగాదు. అదిచేస్తూ ఇల్లా వ్రాస్తున్నాడంటే ఆయన హృదయంలోనున్న సారస్వతాభిమానం పైకిపొంగివచ్చే సారస్వత ప్రక్రియ.

ఇంకొక విషయంగూడ చెపుతాను. ఈయనకు అచ్చంగా తెనుగుకవులంటే మాత్రం తెలియటంగాదు. సంస్కృత కవులంటేగూడా తెలుసు. వాళ్లంటే చాలాఅభిమానం. కాదంబరీ మొదలయిన గ్రంథాలలో ఉన్న అనేక విషయాలు గూడ చాలాచోట్ల పరామర్శించబడుతాయి.

ఈకథ యిట్లాఉంది. ఈకథ యిట్లాఉంది అని వ్రాయటం నిజంగా చదువుదామనుకున్న పాఠకుడికి రుచి చెడగొట్టడం. లేకపోతే మనరుచి వాడికి పట్టించడం. ఎవడికి వాడు చదువుకోవాలి. వాడి అర్థాలు వాడికి స్ఫురించాలి. వాడిఆనందం వాడు పొందాలి.

ఈయన వ్రాసిన కథలు ఈ సంపుటమేకాను. ఇంకో సంపుటమవుతాయి. ఈయన ఇంకా గ్రంథాలువ్రాసి... ఇంకా మంచివి వ్రాసి... న్యాయంపడితే యిలా అనకూడదు. అంటే యీ గ్రంథములో మంచి తక్కువగా ఉందన్న అర్థం వస్తుంది ..... అయినా ఎంత మంచి కన్నా అంతకంటే మంచి ఉండకూడదూ?... వ్రాసి దీర్ఘాయుష్మంతుడై సారస్వతంతో కలిపి దేశసేవచేస్తాడని విశ్వసిస్తూ విరమిస్తున్నా.

బెజవాడ
16-12-47

విశ్వనాధ సత్యనారాయణ ఎం. ఏ.

# ఆశీస్సు

ఉ. చక్కని కూర్పు యోగ్యతయు
సాహస మున్నతభావ మెంతయున్
మక్కువయైన పోకడలు
మాధురిమల్ నెలకొల్పు వార్తలన్
మిక్కిలియైన లోకముల
మేలిమి రీతులు నేర్చి యేర్చి పెం
పెక్కఁగ నీతులన్ దెలుప
నీకవి వ్రాసెను సత్కథావళుల్.

సీ. చిన్నతనమునుండి చెప్పిన చొప్పునఁ
జేయుచునుండెడి చిన్నవాఁడు
తన భావమేదియో యనునది యొకయింత
తెలియనీయని మేల్మితీరువాఁడు
శాంతమార్గమ్మునఁ జాల విజ్ఞానమ్ము
నేర్చి పెంపొనరించు నేర్పువాఁడు
తలవంచుకొనియును దనదారి పరమార్గ
మంతయుఁ దలపోయు నట్టివాఁడు
గోచిపెట్టినదాది నీకుఱ్ఱవాని
నేను గాంచుచునుంటి నింతైనలోప
మీతనికి లేదు నమ్మది నీతియుతము
కోట శ్రీరాము లనుకూలుఁ డరయఁ గరము.

ఉ. ఈతని పాలలోఁదరఁగలేనయి చూచుటచేసి యచ్చునం
"దీ తెలివేమియంచుమది నెంతయుమోదమునందినాను" మేల్

నీతియొకంట నొక్కటను నెవ్వగ సంస్కృతియొక్కచోట నం
తోతగి క్రొత్త క్రొత్తరుచితో నలరారుచు నున్న దద్దిరా!

చ. ఇది పఠనీయమౌట జనులెల్లరు నాయయివేళలందు స
మ్ముదమునఁ జూచుచుండుటయె ముఖ్యముచూచుటతో నె యాచరిం
పఁదగును. మిత్త్రబాంధవుల పద్ధతి మార్పఁగనౌను మంచి సం
పదయగు జ్ఞాన మెచ్చు. నవభాగ్యమునందుడు మీరలెల్లరున్.

సీ. కోట శ్రీరాములు కూరిమి మీఱంగ
నీ "పాల తరగలు" నిచ్చె మనకు
మదినుంచి చదివిన మనలోని లోపముల్
వెల్లడియౌను వివేకమునను
సంఘవృద్ధినిగోరి సాహసమైనను
నుండఁజ వేయు టానందమగును
నామమాత్రమె కాదు నేమమ్ము కల్మియై
సారంబు చవిచూచి సత్కథలను

గీ. మీఁగడను గ్రోలు కృష్ణుని మేల్మిఁగాంచి
"పాతగోంగూర పచ్చడి రీతి" వదలి
సంస్కరణమందు నూత్న విచారమొంది
వృద్ధిగాంచుట విద్యాభివృద్ధియగుట.

విద్వాన్ శతావధాని :
భమిడిపాటి అయ్యప్పశాస్త్రి
17—12—1947.

# ఉపోద్ఘాతము

శ్రీ కోట శ్రీరాములుగారు రచియించిన యీకథలసంపుటి యిదివరకు ప్రకృతి పత్రికలో విడివిడిగా ప్రచురింపబడెను. అప్పుడు పత్రికా పాఠకులు, ఈ కథలను మిక్కిలి ఆదరణతో చదువుచుండిరి. తర్వాత కూడా ఈ కథలను చదివించి, అందులో నాణ్యంగాఉండే కథలనే యీ సంపుటముగా కూర్చినాము. ఇందులోని కథ ఒక్కటికూడా, కేవల కల్పనాకథగాదు. ఈ కథలు చదివినపుడు కేవల కల్పనాకథ చదివినప్పటికంటె ఎక్కువ ఆనందం, కల్గుచున్నది.

అమెరికాలో నిజమైన కథలను ప్రచారం చేయుటకు "ట్రూత్ స్టోరీ" అను ఉత్తమతరగతి మాసపత్రికను బెర్నార్ మెక్‌పెడన్ అనే సుప్రసిద్ధ వ్యాయామవేత్త స్థాపించియున్నాడు. ఆకథల చదివినపుడు, మన భాషలోకూడా ఇట్టి మాసపత్రిక ఒకటిఉంటే బాగుంటుంది అని తోంచింది. ప్రకృతి ఉద్యమవ్యాప్తి వైద్యవ్యాప్తి చేసుకుంటూ, కొన్ని కథలను వ్రాయించి, ప్రకృతి పత్రికలో ప్రచురించాను. పాలసముద్రపు తరంగాలవలె, ఆనందములోను దుఃఖములోనూ కూడా; తల మునకలుగా ముంచివేసే, యిందలి కథలు లోకములోఉన్న దుఃఖకారణాలను, బాగుగా వెల్లడించి, జీవితములోని లోటులను శోధన చేసుకొనేందుకు ఉపయోగిస్తవి.

భాషా ప్రావీణ్యము లేకపోయినా, హృదయము కలవారు ఎంత మంచి కథలను వ్రాయగలరో, మనకీ కథలవలన తెలియుచున్నది.

మా ప్రకృతి గ్రంథములలో ప్రచురించుచున్న కథల సంపుటములలో నిది మొదటిది. ప్రతిబింబములు అనే రెండవ సంపుటము, త్వరలోనే వెలువడుతుంది. మా యితర గ్రంథములను ఆదరించినట్లే యీ కథల సంపుటాలను కూడా ఆంధ్రప్రజలు తప్పకుండా ఆదరిస్తారని మాకు నమ్మకమున్నది.

పుచ్చా వెంకట్రామయ్య
ప్రకృతి పత్రికా సంపాదకులు

# మనవి

కథలివిగావు చోద్యమవు గాథల కొన్నిటి నేర్చిపేర్చి, ఈ
విధముగ గూర్చినాడ. అది పేరుప్రతిష్ఠకు ప్రాకిగాదు వా
రధికులటంచు గాని మరి యన్యులటంచనికాదు గాని. ఏ
విధిని బ్రశాంత చిత్తములు వేగ్రిగునో? వ్రాయుటె నాయభీష్టమో?

కథకు కాళ్లుండవు. అనేకవిధాలుగా ప్రవహిస్తుంది. కథావస్తువును బుచ్చుకుని అనేకరీతులుగా లోకానుభవంతో జోడించనగును. అట్టి సారస్వతచర్చ నంతయు గురుతుల్యులైన కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ తొలిపలుకులో క్లుప్తముగ పరామర్శించియే యున్నారు. అది సారస్వతిక విషయము సర్వజనాదరణీయము. అట్టి విషయమును నిక విస్తరించుట నాకు తగనిపని. వారితోవ్రాత సదా స్మరణీయము.

నా విద్యాగురువులు విద్వాన్ శతావధాని శ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు నా యీ రచనను పరికించి వారికి గల సహజమగు శిష్యవాత్సల్యతనుజూపి కథావిషయిక గుణమునుజెప్పి కథలను ప్రశంసించుచు నన్ను ఆశీర్వదించి యున్నారు. అది నాకమోఘ ఫల దాయకము.

నా ప్రకృతివైద్య బోధకులు శ్రీ పుచ్చా వెంకట రామయ్యగారు. వారు నాచే కొన్ని గ్రంథములు చదివించి యును, స్వానుభవములను బోధించియును, రుజువుచూపించి యును, లోకవిషయములను బహుగా హృదిస్థితము గావించిరి. కృపణవైరాగ్యమున మోడువారిన నా హృదయమున విశ్వ ప్రేమవస్తువును జొనిపి చిగుర్పజేసిరి. ఆ చిగురుఫలమే ఈ

గాథలయొక్క-స్వరూపము. వారికి కృతజ్ఞతా సూచకముగా ఆ ఫల మందినాను.

నన్ను బహువిధముల ప్రోత్సహించి నారచనను ప్రజలకు చూపిన మహారాజశ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులవారికిని, శ్రీ ఏ. కె. మూర్తి ఎం. యస్. సి. గారికిని, - ట్రస్టువారికిని నా కృతజ్ఞాతాభి వందనములు.

నాజ్ఞానగురువులు శ్రీ శ్రీ శ్రీ పరమహంస, పరివ్రాజకాచార్య సచ్చిదానందేంద్ర సరస్వతి స్వామివారు ఈలోకచరితమందు నాకుగలదైన్యయుత ప్రేమభావములను చాటించి "అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయ స్థితః, ఈశ్వరో జీవకళయా ప్రవిష్టో భగవానితి. క్రీడారూప మఖిలంజగత్తని - సర్వం సాదాశ్రితత్వ మను సుజాత సరణిని నాయందు న్యాసముచేసి నాహృదయాంబుధిని నుయ్యాల లూగు నుప్పు కెరటములను విడిచి పాలతరగలుగ మార్చి లోకమును లోకవత్ లీలాకైవల్యముగ ప్రవచనముచేసి నన్ననుగ్రహించినారు. శ్రీవారి సేవాభాగ్యమునకు ఆబ్రహ్మావి దాశీర్వచనమునుదలంచి క్షీరసముద్రు నిరీతి పొంగుచున్నాను. ఈ గాథలలో వ్యక్తుల పరామర్శలును లేవు. "సర్వులు సచ్చి దానందమూర్తు" లను నాగురు సూక్తిననుసరించి సర్వులును సదాప్రులు గనుక సర్వము సమాధిరూపమైన "కర్తు - మకర్తు - మన్యథా కర్తు"మను మధురాధినాథు లను భావము హృద్గతముచేసి శ్రీ సద్గురు వందనములతో విరమించు చున్నాను.

సర్వజిత్తు }
కార్తికము }

కథకుఁడు
కోట శ్రీరాములు.

# 1. జీర్ణం-జీర్ణం-వాతాపి జీర్ణం

## ౧

[ ఇల్వలుడు వాతాపి రాక్షస సోదరులు-సురుచి అక్క-
దండకారణ్యములో గౌతమియొడ్డున నివాసం]

ఒ క నా టి ఉ ద య ం

సురుచి——ఓరేయ్ తమ్ముడూ...వాతాపీ !

వాతాపి—— ఆ!... అక్కా !

సురుచి—— ఏమిరా ! అట్లుంటివేమి! నీ తప్పుడు దోవలు మానవుగదా !

వాతా——ఒళ్లు తిరుగుచున్నదే.

సురుచి—— ఒళ్లు తిరుగుచున్నదేమో !

వాతాపి—— తల తిరుగుచున్నదే.

సురుచి—— (పరీక్షించి) పాపలు కదలుచున్నవిలే. పళ్ళకై చెట్టుకొమ్మలలో తిరుగునపుడు పుడకేదైనా గుచ్చుకు తగిలినదా? ఏమి?

వాతాపి—— లేదే-అక్కా ? (డోకు)

సురుచి—— మరల ఇప్పరసము త్రాగితివా ? తియ్యని ఇప్పపువ్వుకన్న ఆ ముదిరి పులిసిన ఇప్పరసము మధురమటోయీ ?

వాతాపి——అక్కా ! నీవు పురిపెడు త్రాగదవా ?

సురుచి—— గోదావరి నీటికన్న గుడియుని త్రాగమందువా ?

వాతాపి—— పోనీ, అసలిని త్రాగకపోయిన యమునా నీటియందు తిరుగు మత్స్యములనుకూడ తినవా ? నీటియందు సూర్యరశ్మితో కాగిన చిన్న మొగపు వలె మెరయుచూ నేత్రానంద మొనరించునే?

సురుచి——అవి కలవరపుంపలనంటె గుడిసెలా ?

వాతాపి——వానిని అగ్నియందు మ్రగ్గించినచో మరింత రుచి.

సురుచి—కాల్చినచో వగరెక్కునా ?

వాతాపి— వగరనుకొన్నచో ఇంత లవణమూ, మిరియముల పొడి చల్లుకొనకూడదూ ?

సురుచి—నాలుక మండదటరా ?

వాతాపి— నీరు త్రాగకూ ! మంటలారును.

సురుచి— గోక్షీరములు బహురుచికరమూ !

వాతాపి—క్షీరములకంటె గోవప మరెంతరుచే! అక్కా!

సురుచి—శివా! గోవపనుగూడా రుచించితివా, వాతాపి ?

వాతాపి— అంతేనా, సమూలముగనే భక్షించితినే ! ఎంతరుచే ?

సురుచి—అన్నగారికి నాల్గుపండ్లు నింటిలో పారవైచిపోయి వనమధ్యమున నేర్చుచున్న విద్య యిదియా ? చెప్పవూ ?

వాతాపి— అన్నగారికి వ్యాఘ్రాసనముకొఱకు ఎంత ప్రయత్నము చేయుచుంటిననుకొంటివి ?

సురుచి—లేళ్ళతోగూడా వ్యాఘ్రములనుగూడా వేటాడదలచితివా?

వాతాపి—లేడిని తిను వ్యాఘ్రపు మాంసముమరింత రుచ్యమే! అక్కా !

సురుచి—వ్యాఘ్రమాంసముకూడ రుచించిన నీకు తక్కిన జీవు లేమి లెక్కరా? తమ్ముడూ !

వాతాపి—అన్నగారు వచ్చువేళయినది. ఏవో రెండు ఫలములను పుడికి కొని వచ్చెదను. నా సంగతులు అన్నతో చెప్పకుమా !



[ఇల్వలుడు ప్రవేశము]

ఇల్వ:— చెల్లీ! సురుచీ! భగవన్నివేదనకు ఫలములు సిద్ధము చేయుము. గౌతమిలో మాధ్యాహ్నికము చేసికొనియే వచ్చితిని.

సురుచి:— అన్నియూ సిద్ధముచేసితిని.

ఇల్వ:— వాతాపి ఎక్కడ ?

సురుచి:— ఇప్పుడే వచ్చెదనని చెప్పి వెళ్లినాడు.

ఇల్వ:— ఈ ఈశ్వర నిర్మాల్యము తులసికోటలో పరిహరించి రమ్ము.

సురుచి:— పనసపేశముగాబోలు మాగి మంచి కమ్మని వాసన వేయుచున్నది.

ఇల్వ:— ఈశ్వర నివేదన యయినది. ఇద్దరమూ కలసి ఫలహారమును చేయుదము, నీవుకూడ రమ్ము.

సురుచి:— అరటికాడ కడ్డిం చెడినం. బాగుగ మగ్గినవి.

ఇల్వ:— ఇట్టి తియ్యని మధుర ఫలములను తినుచునూ ఏదియో గొణుగుచుండునేమే తమ్ముడు?

సురుచి:— అతనికీ యాహారములతో తృప్తిలేదట. క్రొత్త రుచుల మీదబడి పరిశోధించుచున్నాడు.

ఇల్వ:— ఏవవి? యీ ఫలములకన్న రుచ్యములా ఏమి?

సురుచి:— అతని యిప్పపానీయమును చూచితివిగాదూ?

ఇల్వ:— అబ్బ! ఆ యిప్పపువ్వనట్లు ముఱగబెట్టుకొని త్రాగునేమే! తమ్ముడు కట్టి పిచ్చివాడు.

సురుచి:— ఆ పిచ్చిలోనే గొప్ప శక్తి గలదట!

ఇల్వ:— ఏమా శక్తి! ఈశ్వరుని తన దారుణ తపస్సుచే సంతోషపెట్టి వరములు పొందగలుగునా?—పోనీ దేవతలనైన భయపెట్టగలుగునా?—తుదకు బక్క బడుగుల బవిరిగడ్డములు గుంజుటకైనా శక్తి పుట్టునా?

సురుచి:— చూచెదముగా, ఆశక్తిగూడ.

ఇల్వ:— నాతపస్సు పూర్తియగు లోపల అతనిశక్తి బయల్పడునా?

సురుచి:— తమ్ముడు ఇంద్రజాలము, తంత్రము అందు నిధి యగుచున్నాడు.

ఇల్వ:— అబ్బా. అసుర బాలకుల కవి ఒక లెక్కలోనివి కావు, కనీసము ఇంద్రాణినైన స్పృశించి రావలె.

సురుచి:— తమ్మునికి తప్పక మృతత్వము సిద్ధించునులే!

ఇల్వ:— శివా! అటుల అమంగళము పలికితివేమే చెల్లీ! ఈ సాయంకాలము తమ్ముని నన్నొకసారి చూడమనుము.

## 3

### [వాతాపి ప్రవేశము]

వాతాపి:— అక్కా! అక్కా!!

సురుచి:— ఇటు రమ్ము.

వాతాపి:— ఈ ఫలహారమేమో చెప్పగలవా?

సురుచి:— కాల్చిన చిలగడదుంపేమో!

వాతాపి:— కాదు.

సురుచి:— ఏదీ కొత్త రకపు వాసన వేయుచున్నది. మంచి రుచిగ నున్నదిరా! ఇది నీ వంటకమా.........

వాతాపి:— లేడికాలేయమును అగ్నితప్తము చేసి రుచులు కలిపి తయారు చేసిన అమృత మిది.

సురుచి:— ఏదీ మరొకటి తెచ్చియిమ్ము నీ వేపుడు రుచిని పరీక్షించెదను.

వాతాపి:— అన్నకుగూడ చూపింతువా?

సురుచి:— వీటికేమిలే - నీవేమో యఖండుడవు గాలేదని ఒక్క యోగమునైనా సిద్ధిని బొందితివి కావని అన్నగారు విచారపడుచున్నారు.

వాతా:— అటులనా! కామరూపమును బొందుటలోనూ - ఖండయోగములోనూ ప్రవీణతను సంపాదించితినని చెప్పుము. పరీక్షింపదలతురేని నాశరీరమును ముక్కలు ముక్కలుగ తరిగి నా బుర్రను పొడి పొడి క్రింద గొట్టి చివరకు నా పేరున పిలువుము. అంతేచాలు, ఆ ముక్కలను అతుకుకొని ఎప్పటి యట్లు శరీరమును చేర్చుకొనగలను.

సురుచి:— మంచిగట్టి వాడవైతివిలే! సరికాని ఆ అమృతపు ముద్ద నింకొకటి తెచ్చి యిత్తువా? లేదా?

వాతాపి:— అక్కా! ఆ కాలేయమును ఆగ్నేయమూత్రో నుడుకబెట్టి చవిని కలిపినచో మరింత రుచిగ నుండునేమో?

సురుచి:— తప్పక బాగుండగలదు. అట్లు చేసిన అన్నగారికి కూడ ఫలము అతో పెట్టుదము. కనుగొనగలడేమో చూతము.

వాతాపి:— మరికొన్ని మత్స్యములను గూడ తెచ్చెదను. తైలమున వేల్చి పెట్టుము - చెఱకురసమును కాచి బెల్లపుముద్ద తీసి యిచ్చెదమా? అన్న ఏమనునో చూతము.

సురుచి:— తమ్ముని సౌధమ్మునకు అచ్చెరు వొందును.

వాతాపి:— సరిగాని - అక్కా! ఇంతవఱకు నరమాంసము మాత్రము రుచిచూచి ఎరుగను. ఆ కోర్కె తీర్చుకొనవలెనే.

సురిచి:— అన్న వచ్చువేళకు అన్నియూ సిద్ధము చేయుదము. త్వరగ వెళ్లిరమ్ము.

## ౪

[ఇల్వలుడు ప్రవేశము]

ఇల్వ:— సురుచి! ఈ దినము వాతాపి యింటికే రాలేదా?

సురుచి:— రాకేమి? గౌతమునిలో ఆటలాడ బోయినాడువలె నున్నది. అలస్యమగునేమో! అన్నను ముందుగా ఫలహారమును పుచ్చుకొనుమని చెప్పిపోయినాడు.

ఇల్వ:— ఇంత పొద్దులు మీరిపోవుచున్నాడే!—సరే—నా సంధ్యావందనమైనది. వడ్డన చేయుము.

సురుచి:— వడ్డనయినది.

ఇల్వ:— ఏదో కమ్మనివాసన వేయుచున్నది. క్రొత్తరకపు పండ్లు నేను యినా తెచ్చినా ఏమి?........ఇది ఏదో దుంపయును కొంటిని. కారము ఉప్పు కలిపి తయారు చేసినట్లవలె నున్నది.

సురుచి:— వాతాపి తయారు చేసినాడు.

ఇల్వ:— ఈ గడ్డ లేమి?

సురుచి:— చెరకురసము ఎల్లప్పుడూ తెచ్చుట కష్టమని ఆ రసమువండి ఘనరూపమున నిలువచేసినాడు.

ఇల్వ:— పండ్లుకూడ పొగ మారిన వాసన వేయుచున్నవే.

సురుచి:— ఇంటిలోనే వండినాడు.

ఇల్వ:— ఏవి మరికొన్ని పెట్టుము బహురుచిగానున్నవి. నీవు తినవేమి! నీకు హితవుగ లేవా!

సురుచి:— తమ్మునికొఱకుంచుచుంటిని.

ఇల్వ:— ఇట్టి పదార్థము లింకా కొన్ని తయారు చేయుమనుము. నీ వాత-

నికి సాయపడుము...... (చప్పుడగుచున్నది వచ్చుచున్నాడేమో...
తమ్ముడూ! వాతాపీ ! !

వాతాపిః— అ! వచ్చుచున్నానుం

ఇల్వః— ఇంతవఱ కేమి చేయుచుంటివి? ఈదినమున నీకంటకనులు బహు రుచిగ నున్నవిరా! అక్కకు కూడ మిగిలినవో లేవో- మరికొన్ని తయారు చేయుముగా.

వాతాపిః— కొన్ని మృగములు తలచినపుడెల్ల దొరకునవిగావుం

ఇల్వః—అటులనా ! ఇక వృక్షజాతిని దాటి జంతుజాతినుండి ఆహారము తీయుచుంటివా! తరువాత మానవులనే పీక్కుతిందువు గాబోలు ... ఏమయిన నేమి, కంటకములు బహురుచికరములుగా నున్నవి ...... కొన్ని విషజంతువులు విషపూరితములు సుమా ? బాగుగ గమనించ వలెను. పద, పోయి పరుండుము.

## ౪

## [ వాతాపి ప్రవేశము ]

అక్కా ! అక్కా !! గౌతమిలో కొందరు బటువులు స్నానము చేయుచున్నారు. నే బోయి ద్వాదశి పారణకని భోక్తలుగ దీసుకొనివచ్చెదను. వారలకు ఈ ఫలములు ఈ కంటకములు పెట్టి చివరకు నా యీ దేహభాగములు కొన్నిటిని ముక్కలుగ తరిగి వండి వారలలో మంచి తేతవానికి తిన బెట్టుము. భోజనానంతరము ఊరక నాపేరుపెట్టి పిలువుము. అంతేచాలు, తరువాత జరుగునదిచూతువుగాని.

సురుచిః— తపస్వులను దీసికొనిరాకు సుమా ! శపించగలరు. ? ఊరక చచ్చిపోగలవు. వారసలే సత్వులు, సాధువులు.

వాతాపి— వారు బ్రతికియుండినగదా శపించునది. నీవు చాకచక్యముతో నుండవలయును సుమా ! లేకున్న వారనుమానించెదరు.

సురుచిః— నేను వాతాపి కక్కనోయీ !

## ౬

(గౌతమి యొడ్డున అనుష్ఠానములను ముగించుకొని వటువులందరూ స్వాధ్యాయప్రవచనములకు గురువులకడకు బోవుచుందురు. సోమరులైన వెనుక చిక్కిన యిద్దరు వటువులను వాతాపి దర్శించును.)

వాతాపి:— విద్యద్వరేణ్యులగు వటువులకు వీడు నమస్కరించుచున్నాడు.

౧ వటువు:— శీఘ్రమేవ ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు.

౨ వటు:— నీ వెవరవోయీ ?

౧ వ:— ఎందుకు వచ్చితివమ్మా ?

వాతాపి:— మాయక్క ఏకాదశీవ్రత మనుష్ఠించుచున్నది. ద్వాదశీపారణకు మిమ్ములను ప్రార్థించుటకు వచ్చితిని.

౧ వ— అసలు మీరెవరు?

వాతాపి— ఈ ప్రాంతవాసులము గాము. గౌతమియొడ్డున అన్నగారితో తపస్సు చేసికొనుటకు కొలదికాలముక్రిందట వచ్చినాము. అసాలముల లోనే మా కుటీరము.

౧ వ:— సరే! సాంబా! నేను పోయెదనుగానీ నీ వీసంగతి గురువుగారితో చెప్పుము.

౨ వ;— నీవు సంత చెప్పించుకొనవలయునుగదా! నే పారణకు పోయి వచ్చెదనులే.

వాతాపి:— స్వాములిద్దరూ దయచేయవచ్చును. రెండు ఘడియలలో ప్రాశనచేసి పల్లెకు బోవచ్చునులెండు.

౧ వ:— మంచిది పద. ఇంకేమయిన ఆలస్యమున్నదా ?

వాతాపి.— లేదుస్వామీ! అంతయూ సిద్ధమయినది.

౧ వ:—పోవుదము పదరా! గాయత్రి తరువాయి రాత్రికి పూర్తిచేసుకొనవచ్చును. పద.

(పారణ జరుగుచున్నది.)

౧ వ:— అమ్మా నీది అమృతహస్తమమ్మా! చచ్చిపోయిన, జిహ్వ లేచి వచ్చును.

సురుచి:— స్వాములు తృప్తిగా భోజనముచేయుడు. పేదవారము.

౨ వ:— అరే! ఏమిరుచిరా? యివిపండ్లు కాళే?

౧ వ:— షడ్రుచులు కలియబోసి చేసినదిరా! యిక ఈ జన్మలో భోజనం చేయలేం.

౨ వ:— అరరే! యివి ఏమి ముక్కలురా యింత రుచిగా నున్నవి-వహ్వా!

(నెమ్మదిగా) ఇది ఏమి యిందులో చచ్చిన చేపపిల్ల ఉన్నదేమిరా? యిటు చూడు. యిది మత్స్యమేనా?

౧ వ:— పొరపాటెవరికైనవచ్చును. ఒకవేళ గౌతమి జలముతో నచ్చి ఈ భక్ష్యములతో కలసినదేమో...విస్తరిస్త్రిందను తోసేయుము. తెలిసి నచో అయును కించపడగలరు.

(పైకి) అమ్మా! మీ తనయుడేడీ?

౨ వ:— ఏమిరా! భడవా! గుడ్లు వెళ్ళుకొచ్చునట్లు తినుటచే బుద్ధి తబ్బిబ్బు పడుచున్నదా? సంధించుచున్నదా! 'తమ్ముడు' బదులు 'తనయుడు' దనుచున్నావు?

౧ వ— క్షమింపుము తల్లీ! తమ్ముడేడీ?

సురుచి:— దొడ్లో యున్నాడు. పిలచెదను. తమ్ముడూ! వాతాపీ!! యిక రారా!!!

౧ వ— సాంబా! పొట్ట గబగబలాడుచున్నదేరా? చేతులతో పొడుచుచున్నట్లున్నది?

సురుచి:— ఒరే? వాతాపీ!!

౧ వ:— అమ్మో! నొప్పి. అతనిని పిలిచినప్పుడల్లా నా కడుపులో పొరలు పగులునంత నొప్పిగానున్నది. తల్లీ, యింక మేము పోయెదము. కొంచెము సేపాతని పిలువకుము.

సురుచి:— మంచిది. వెళ్లుచుంటిరా! అతనికి చెప్పిపోరా! ఒరేవాతాపీ!!

౧వ:— అయ్యో! సాంబా!! పొట్ట పగులుచున్నది. పడిపోవుచున్నాను. ఇక బ్రతుకలేను. అమ్మతో చెప్పు.

వాతాపి:— అక్కా! ఒడలంతయు రక్తమయినది. నదికి స్నానమునకు పోయెదను.

## జీర్ణం - జీర్ణం - వాతాపి జీర్ణం

సురుచి:— త్వరగ పోయిరమ్ము.

వాతాపి:— నే వచ్చి యితని హృదయము కాలేయము తీసి గోఘృతములో వేయించి ఆ సుగంధ ద్రవ్యములను కలిపి పాకము తయారు చేయుదును.

సురుచి:— (ఆ వండిన పదార్థమును తిని) ఇదెంత రుచిగనున్నదమ్మా! వీడి కడుపుడక, ఈ రుచులు వీడెటుల గ్రహించెనో - తమ్ముడా! బుద్ధిమంతుడవోయీ!
వటువులకు మనము నిత్యము సంతర్పణలు చేయుచూ తిరిగి వారిట్లు మన అను తృప్తులను చేయుచుండుటయు జరిగిన నెంత బ్రహ్మానందముగ నుండునోయీ.

[ఇల్వలుడు ప్రవేశము]

సురుచీ! ఇల్లంతయూ అప్పుడు కరుగబోసిన కమ్మని నేతివాసన వేయుచున్నదేమి?

సురుచి:— వాతాపి నరామృతమును తయారు చేసినాడు.

ఇల్వ:— ఏదీ? (కొంత తిని) ఎంత బాగున్నదే! వానికి తేకుండ చేసెద వేమో సుమా! ఎటుల వండినాడే?

సురుచి:— 'గౌతమికి పోయి' యిద్దరు వటులను ... చివరకీ పాకము తయారయినది.

ఇల్వ:— భేష్ బిడ్డా! నీ వేమో యనుకొంటిని- భూసురాంతకుడ వైతివా ...సంతోషము.

వాతాపి:— అన్నగారి ఆశీర్వచనబలమున అమృతము నే రుచి చూపగలను.

ఇల్వ:— తథాస్తు! నీకు మంగళ మగుగాక!

౨

[అగస్త్యాశ్రమము - ఋషి ఎదుట నొక ముసలి స్త్రీ ఏడ్చుచూ తనకుమారుని మరణమును గుఱించి చెప్పుచున్నది.]

స్త్రీ:— తండ్రీ! సాంబుడూ నా బిడ్డడూ కలసి గౌతమికి స్నానమునకు బోయిరట. ఎవడో దుర్మార్గుడు ద్వాదశీపారణకు ఇద్దరనూ తీసికొని పోయెనట. భోజనానంతరము నా బిడ్డడు విరుచుకు పడెనట! పొట్ట

రెండు భాగములై అందుండి ఎవడో బయటికి వచ్చెనట! సాంబుడు చూడలేక పరుగెత్తుకు వచ్చి నాకు చెప్పలేక ఏడ్చుచున్నాడు.

అగస్త్యులు:— సాంబా! సత్యమటరా?

సాంబుడు:— చిత్తము, స్వామీ!

అగ:— జిహ్వాచపలత్వమునకు లోనై పరుగెత్తువాని పని ఏ నాటికైనను అటులనే జరుగును.

శిష్యులు:— స్వామీ! వారెవరో మాయావులు, సమిధలకు పోవుచున్న మమ్ములను హింసింతురను భయమగుచున్నది.

అగ:— (దృష్టి సారించి) ఓహో! ఈ రాక్షసులు నరభక్షణకు తెంపరిడిరా! వీరి దుండగములు పెచ్చుపెరిగినచో ఈ మునిపల్లెలు నిలువవు. ఓరి వీరి రుచులు ఏటగలవా? కమ్మని పండ్లకంటె నరమాంసము మధురముయినదా? సరియే నేను పోయివచ్చెదను. తిరిగివచ్చువరకూ అగ్నిహోత్రములను రక్షించుచుండుడు. నే బోయి వచ్చెదను.

౨

రాత్రి సమయము - ఇల్వలుడు - వాతాపి - సురుచి యిష్టాగోష్ఠి సలుపుకొనుచూ ఆనందించుచున్నారు.

[అగస్త్యుల ప్రవేశము]

అగ:— నాయనా! ఈ కుటీరములో ఎవరు బాబూ! యీ రాత్రి పరుండుటకు చోటు చూపించెదరా? పెద్దవాడను.

వాతాపి:— అన్నా! ఆగుము. ఎవరో పిలుచు చున్నట్లున్నది.

ఇల్వలుడు:— శివుడు తన నివేదనకు పశువును తానే చూపుకొనుచున్నాడేమో?

సురుచి:— (చూచి) అబ్బే పసలేదు. పట్టున నోరికైనా సరిపోవునటుల లేదు.

అగ:— నాయనా! లోపల పరుండవా! శీతబాధ తప్పించదిరి. బుద్ధిమంతులు.

వాతా:— ఈ భక్ష్యములను భుజించి పరుండెదరా యీ రాత్రి!!

అగ:— నాయనా పెద్దవాడనైతిని. దేహము సడలిపోయినది. ఏకాశనము మాత్రమే చేయుచుంటిని. జిహ్వాచాపల్యమునకు వశమైన ప్రాణత్యాగ మగును.

వాతా:— పోనీ, యీ గంగాభాండమును త్రాగి పరుండుడు, పెద్దలు.

అగ:— సరియే, తెమ్ము నాయనా! యిటుల పెద్దలను పూజించి సత్య సంపన్నులరై వృద్ధిపొందుడు.

వాతా:— తాతగారూ! కొంత బలకరమగు ఆహారమును తిని దేహ పటుత్వము పొందుడు. శరీరమే తపస్సునకు ముఖ్యమే గదా?

అగ:— కేవల ఈశ్వర ప్రీతికొఱకైన కర్మకొఱకే దేహమని ఎరిగితివేని మోక్షమును బొందగలవు. అటు ఇంద్రియ విషయ దేవతారాధనమునకు దేహమును వదలితివా, చెడెదవు.

వాతా:— దేహము బలముగ నుండిన గదా దేవపూజ చేయగలుగునది?

అగ:— అంతకన్న బుద్ధిబలము ఎక్కువని ఎరుగుము. మధుపానముచే ఒడలు మత్తెక్కించుకొనుటకన్న ఈశ్వరచింతనామృత పానముచే ఒడలుమత్తెక్కించుకొనుట శ్రేయము.

ఇల్వ:— అయ్యా! వాడింకనూ ఉడుకు రక్తమువాడు లెండు. తమరు నిద్రింపుడు.

అగ:— మంచిది, బుద్ధిమంతుడవు నాయనా!

[తెల్లవారినది]

అగ:— నాయనలారా! యిక నేను పోయివత్తునా?

వాతా:— అయ్యో! తాతగారూ! దేవతార్చన చేసికొని పొండని మా ప్రార్థన. చాల దూరమువరకు మునిపల్లెలు లేవు.

అగ:— వలదు నాయనా! నన్ను ఇబ్బంది పెట్టి మీరు ఇబ్బందిపడకుడు.

ఇల్వ:— ఏదో కుర్రవాడు కోరుచున్నాడు. వలదనుచుండగ ప్రయాణము తగని పని గదా?

అగ:— అటులయిన నుండెదను. మీ ప్రయత్నమున మీరుండుడు.

[సురుచి ప్రవేశము]

అన్నా! తాతగారిని మడిగట్టుకొనుమనుము.

అగ:— మంచిదమ్మా! అనుష్ఠానమైనది. లేచుచున్నాను.
ఇల్వ:— తమ్ముడా! [నెమ్మదిగా ఈయన తపస్విలాగున్నాడు. ఈయనతో చెలగాటమాడకుము.
వాతా:— అన్నా! ఆ తపశ్శక్తి చూతును. ఇటువంటి వానిపసరే పట్టగలయుదును,
సురుచి:— భయపడకుమురా!
ఇల్వ:— సరియే మీయిష్టము.
వాతా:— త్వరగా నాదేహమును తరిగి వేయించుము. ముసలి త్వరపడుచున్నాడు.
అగ:— అమ్మా! యిక వడ్డించవచ్చును. నా యుపవిష్టములు తీరినవి.
ఇల్వ:— అయ్యా! ఫలము అంత పక్వములైనవి కావేమో? తినుటలేదు.
అగ:— లేకేమి నాయనా! తేనినైననూ సరియే హుంతమున చేయుటకు నాజీర్ణగుహాయందు జఠర అగ్నిరూపమున శతసహస్ర జిహ్వాలతో వైశ్వానరుడు ప్రజ్వలించుచున్నాడు నీయిష్టమువచ్చినదానిని అందులో వేయుము.
సురు:— ఈ భక్ష్యములనుగూడ పుచ్చుకొనుడు, తాతగారూ!
అగ:— ఇల్వలా! పుచ్చుకొమ్మందునా?
ఇల్వ:— ఆ! ఆ!! పుచ్చు......
సురుచి:— అయ్యో! పుచ్చుకొనుడు తాతగారూ!
అగ:— మంచిది. వైశ్వానరార్పణమస్తు, మరచితిని...తమ్ముడేడీ!
సురుచి:— తోటలో ఉన్నాడు. పిలచెదను. తమ్ముడూ వాతాపీ!
అగ:— జీర్ణం - జీర్ణం.
ఇల్వ:— అయ్యో! తమ్ముడా! వాతాపీ!!
అగ:— జీర్ణం - జీర్ణం.
వాతా:— అయ్యో! యితని పొట్టలోపడి మాడిపోవుచున్నానే అక్కా! అక్కా! బయటికి లాగవే! అన్నా, రక్షింపవయ్యా!!
అగ:— ఇల్వలా! ఈ ఆర్తధ్వని ఎక్కడనుండీ...
ఇల్వ:— నాయనా! వాతాపీ!!
అగ:— జీర్ణం - జీర్ణం. వాతాపి జీర్ణం. మాల్గు ఆగిపోయినదే, తేన్పుకూడ వచ్చినది.

ఇల్వ:- అయ్యో, తమ్ముడా ! వాతాపీ ! !

అగ:- ఛీ! పాపాత్ములారా ! దైవచింతలేనంగక జిహ్వాతృప్తికై ప్రాణులాడెడి పాపులారా! తక్షణమే సూకరజన్ములై ఛండాలాది పురీషము భక్షించి దేహము నిలుపుకొనుడు.

నేను దురన్నభోక్తృత్వమున పొందిన పాపపరిహారమునకు దక్షిణమునకు పోయి తపస్సుచేసికొనబోయెదను. అంతవఱకు సర్వజనులు నీతిమంతులై సుఖముగ నుందురుగాక! ఈ ఆర్యభూమియందు మీరు నిస్సంతులై పోదురుగాక. పోవుచున్నాను. ఎట్టి దురన్నమైనను వాతాపి 'జీర్ణ' స్మరణతో జీర్ణమగును గాక.

---

# 2. మూడు దోవలు

## ౧

సుబ్బన్న పండితుడు క్రమాంతస్వాధ్యాయం, మీమాంసా శాస్త్రాధ్యయనం చేయగలిగాడు గాని కించిత్తయినా శనిశాస్త్రం చదవకపోతే మానె అనుభవజ్ఞులైన పెద్దలు చెప్పగానైనా వినొచ్చుగా. ఇక గాకపోతే "మలమాంసమయం దేహ" మనే పాఠం మాత్రం తెలుసు ఆ మీమాంసకుడికి. కొడుక్కు తండ్రిపేరు పెట్టుకోకుండా హయగ్రీవుడని పేరు పెట్టుకోటంతోనే ఆయన ఆశాలోలత్వమంతా బయటపడింది. 8 వ సంవత్సరం వచ్చీ రావటంతోనే ఉపనయనంచేసి వేదం ప్రారంభించాడు కొడుక్కి. సంవత్సరం గడిచిందో లేదో పంచకావ్యాలు ప్రారంభించాలన్నాడు. మరుసటి సంవత్సరం జాతకభాగం మొదలెట్టాలన్నాడు. ఏ పట్లానయినా సరే మన హయగ్రీవుడిని సార్థకనామధేయుడిగా చేయాలని శిష్యులతో చెప్పేవాడు. ఆ ముక్కుపచ్చలారని బుడతడిని ఒక్క ఘడియసేపైనా తోటి కుర్రవాళ్ళతో చెడుగుడు చెంగున గంతులెయ్యటానికైనా సెలవిచ్చేవాడు కాడు. పోనీ రాత్రిపూటైనా విశ్రాంతిచ్చేవాడా అంటే రామరామ. పక్కలో పడుకోబెట్టుకొని ఏదో వల్లిస్తునే ఉండేవాడు.

ఆరిపోయే దీపానికి కళాకాంతులు హెచ్చయినట్లు ఆ కుర్రవాడి చరిత్ర చాటింది. చెప్పింది తడవుగా తిరిగి తప్పచెప్పేవాడు. 14 వ ఏట గద్వాల సభలో కూర్చున్నవాడు కూర్చున్నట్టు వంద పనసలు పరీక్షయిచ్చి వార్షిక ప్రపట్టా పుట్టించి బహుమానం పొందాడు. అంత సభలో ముద్దు పలుకులతో సంధ్యావందన భాష్యప్రవచనం చేశాడు హయగ్రీవుడు. పండితులు మెచ్చారు. పామరులు ముగ్ధులైపోయారు. ఆ కుర్రవాడిని వెంటపెట్టుకొని సత్కారాలుపొంది యింటికి తిరిగొచ్చాడు సుబ్బన్న పండితుడు.

కుర్రవాడి కుశాగ్రబుద్ధికి మెచ్చుకుని ఒక గొప్ప పండితుడు "హయగ్రీవుడిని నావెంట పంపితే తర్క-వ్యాకరణాల్లో నిధినిచేసి పంపుతా. ఏమంటా" వన్నాడు సుబ్బన్న పండితుడిని.

ఊళ్లోవున్న స్వాములవారు సుబ్బన్నపండితుడిని పిలిచి 'కుర్రవాడి వయస్సేమిటి ? దానికి మించిన విద్యేమిటి ? నీ కేమన్నా మతి పోతోందా? వాడు నానాటికీ క్షీణించిపోతున్న సంగతే గుర్తించలేకపోతున్నావే ? నీయంత పండితుడు కాకపోడులే. మన ఆశ్రమంలోకి పంపితే అక్కడ గాలికి తిరుగుతూ నాకొచ్చిన నాలుగుముక్కలూ చదువుకుంటాడు. వయస్సేమి మీదపడిందని వాడికా విధి విరామంలేకుండా నూరిపొయ్యటం ? నా మాట వింటే సరి. లేకపోతే అఘోరిస్తావని చీవాట్లు పెట్టాడు.

సుబ్బన్న భార్య "మన హయగ్రీవుడు అన్నం సరిగ్గా తినక నలతగావుండి చిక్కి శల్యమవుతున్నాడు." "ఏదైనా జలానికి మందిప్పించండంటూ" ప్రారంభించింది,

హయగ్రీవుడికి రెండురోజులు గొంతువాచి హీనస్వరం పడింది. అప్పటికీ పంతులుగారు హయగ్రీవాన్ని విడిచిపెట్టక కొత్తపాఠం నోటితో చెప్పించక శిష్యులు వల్లెవేస్తుంటే కూర్చుని వింటూ యుండేటట్టు ఏర్పాటు చేశాడు. కొడుకు రుగ్మతను గమనించలేదు తండ్రి. తండ్రిమూర్ఖత్వాన్ని అడ్డుకట్టలేదు తల్లి. ఇవ్విధంగా నడుస్తోంది సంసారం.

## ౨

దశరథరామ దీక్షితులకు తండ్రంటే బహుభక్తి. తండ్రి శతవృద్ధు. ఇవాళ్లో రేపో అనేట్టుగా ఉన్నాడు. ఆయన ప్రాణం హరీ అనేలోగా తన

కొడుకు సర్వేశ్వరానికీ, కూతురు అన్నపూర్ణకూ వివాహాలుచేసి తండ్రి యొక్క ఆమోఘాశీర్వచనం పొందాలని నిశ్చయించాడు దీక్షితులు. అప్పుడే ఆ 14 ఏళ్ళ కొడుక్కీ, ఆ 9 ఏళ్ళ పిల్లకీ, వివాహం తొందరేమి టని స్నేహితులు దుయ్యబట్టారు దీక్షితుల్ని.

తల ఆడించుకుంటూ ఆ ముసలితండ్రి "నాయనా! కన్యాదానఫలం నాకంట పడనీ — ఇంకా బ్రతికినంతకాలం బ్రతుకబోయినానా? ఇంకా శుభకార్యాలు చూడబోయినానా? అది పుణ్యవంతురాలు గాబట్టి నాకంటె ముందుగా వెళ్ళిపోయిం"దని కంటతడిపెట్టాడు.

"నాన్నా! నే నంత అవివేకిననుకున్నావా? నేను శుభకార్యం చేయవచ్చేటప్పటికి అమ్మ లేనేలేకపోయింది. ఇంకా నీకళ్ళ ఎదుటనైనా యీ కార్యాలు చేయకపోతే నా బ్రతుకెందుకని ధైర్యమిచ్చాడు దీక్షితులు. తండ్రి మనశ్శాంతి పొందాడు.

దీక్షితులు ఎకాయెకిని సుబ్బన్న పండితుడితో వియ్యమొందటానికి వెళ్ళాడు. "చదువు పూర్తి అయితేనేగాని హయగ్రీవునకు వివాహం తలపెట్ట"నన్నాడు సుబ్బన్న. "అప్పుడే చెయ్యాలని నాకూ జరూరు లేదుగాని ఆ ముసలాయన కళ్ళ ఎదుట కన్యాదానం చేయాలని సంకల్పం. తక్కిన సంబంధాల మాటెందుకుగాని మీ కయితే 100 కట్నం లాంఛనాలూ యిచ్చి పిల్లకొక ఎకరం యీయదలచుకున్నా. అమీ, తుమీ, వెంటనే చెప్పెయ్య" లన్నాడు, దీక్షితులు. మన కింత కట్నం లాంఛనాలూ యింకా ఎవ్వ రిచ్చేవారని వెంటనే తథాస్తన్నాడు పండితుడు. "కుర్రవాడి జబ్బుమాట తొందరా? వివాహం తొందరా? అంతకంతకు ఆలోచన లేక పోతూందేమిటంది సుబ్బన్న భార్య.

పండితుడు ఉగ్రుడై "వాదక పెత్తనం చెయ్యబోకు. నోరు మూసుకుని పడి వుండు. నాకంటె నీకెక్కువ తెలుసునా? అన్నీ నాకు తెలుసు. మందు మాటకూడా విచారిస్తున్నా. ఇప్పుడు కాదంటే యింత కట్నమిచ్చే యిటు వంటి సంబంధం రావచ్చిందా? ముద్దొచ్చినప్పుడే చంక కెక్కాలి. జబ్బు జబ్బంటావు. జబ్బు ఎప్పుడూ కూరొచ్చిందా? ఇంకా నోరెత్త కన్నాడు.

దీక్షితులు, తేదీయ లగ్నం బాగుందన్నాడు. సుబ్బన్న ఆ లగ్నానికి తానూ సిద్ధమన్నాడు. పెళ్ళి అట్టహాసాలు జరుగుతున్నై.

ఆ ఫిర్కా రెవిన్యూ యినస్పెక్టరుగారు తన కూతురు వివాహ సంబంధానికి తిరుగుతూ దీక్షితులుగారింటి కొచ్చాడు. దీక్షితులుగారి ఆస్తి పాస్తులు చూచుకొని "మీ సర్వేశ్వరానికి వెయ్యినూటపదార్లు కట్నమిచ్చి మాలలిక నిష్ఠా వివాహం చేసుకొం"డన్నాడు.

దీక్షితులుగారి తండ్రి బహుసంతోషముతో తథాస్తన్నాడు. దీక్షితులు తన పిల్లల వివాహాలు తండ్రి కళ్ళెదుట చేయగలుగుతున్నందుకు ధన్యుడనయినా ననుకున్నాడు.

తనయ లగ్నానికి జన్మపూర్వ వివాహమైనది, తాత అనేకంగా ఆశీర్వదించాడు. నాకబలికి కూర్చోలేనంత జ్వరమొచ్చింది హాయగ్రీవుడికి. మద్దోరణానికి రాలేకపోయినాడు. 16 వ సంవత్సరానికి 10 లంకణాలు. ఆఖరుకు పథ్యం పుచ్చుకొన్నాడు గాని యింకా నలతగానే యున్నాడు, హాయగ్రీవుడు.

దీక్షితులు మరుసటి నెలలో సర్వేశ్వరానికి ఇనస్పెక్టరు కూతుర్ని పెళ్ళి చేశాడు. ఆ సంతోషంలో తండ్రిని అగ్రపీఠంలో కూర్చోపెట్టుకొని కొడుకునీ కోడల్నీ ఒక వైపూ కూతుర్నీ అల్లుడినీ యింకోవయిపు కూర్చోపెట్టుకుని ఫొటో తీయించుకుని వాటిని బంధుగులందరికీ పంపాడు.

## 3

చినికి చినికి పెద్ద వానయింది. ఆ జ్వరం సంవత్సరం విడిపించిందీ హాయగ్రీవుడిని. కొడుకు చదువు జబ్బుమూలంగా నట్టేటిపోయిందని సుబ్బన్నకు దిగులుపుట్టింది. అప్పటికే శిష్యులు వల్లెవేసుకునే చోటునుంచి వదిలేవాడు కాడు కొడుకుని. "ఇప్పటికైనా హాయగ్రీవుడిని మన ఆశ్రమంలో విడిచి గాలీ – పండూ తిని బ్రతకనిస్తావా," అని సుబ్బన్నని స్వాములారడిగారు. ఒక వైద్యుడు సుబ్బన్నదగ్గరకు జాతకం చూపించుకునేందుకు వచ్చాడు. శిష్యులదగ్గిర కూర్చున్న హాయగ్రీవుడిని చూచి "పాపం ఆ కుర్రవాడికి ధాతుక్షయ మయింది. తల్లి దండ్రులను పిలిపించి చికిత్సచేయించండి, లేక పోతే ప్రమాదం కలుగుతుందని చెప్పాడు.

సుబ్బన్న వాడలిపోయాడు. గుండె తపతపా కొట్టుకుంది. "బాబూ! వాడు మనవాడే. శాస్త్ర చెయ్యిచూచి ఏవాధో నిర్ణయించ"మన్నాడు.

సుబ్బన్న పండితుడు. ఇది మేధక్షయ మని నామకరణంచేశాడు వైద్యుడు. హాయగ్రీవుడితల్లి బావురుమంది. స్వాములవారు "సుబ్బన్నా! నీ తెలివి దిబ్బలుగాను. ఇప్పటికైనా మన ఆశ్రమంలో వదలిపెట్టరా! అచెట్లూ చేమల్లో తిరిగి ఆకూ పళ్ళూ తిని ఆ పురుగుల్తోపాటు ఒక పురుగై బ్రతుకుతా"వన్నాడు. దీక్షితులుగారొచ్చి హాయగ్రీవుడిని రోగచికిత్సకు బయలు దేరదీశారు. వీరు ఘనవైద్యులనీ, వారు ఘనవైద్యులనీ, ప్రతివాళ్ళదగ్గరకూ తిరిగారు. గ్రహజపాలు చేయించారు, చివరకు తొట్టిస్నానంకూడా చేయించారు.

ఆ యూరి పెద్ద మాదిగవాడు సింహద్వారానికి ఎదురుగా కొత్తకుండలు ముందు పెట్టుకుకూర్చొని 'దొరసానిగారూ!' 'పాసిపోయినకూడు పదును కోస్తుందా ?' అంటున్నట్టూ; 'ఒరేయ్' అనాచికంగా అట్లా గడపముందు గూర్చుని అట్లా అంటావేరా?' అని ఆవిడ అంటున్నట్టు కలవచ్చి ఏడుస్తూ లేచింది, హాయగ్రీవుడి తల్లి.

౪

ఆరేళ్ళు గడిచింది.

అన్నపూర్ణ వైధవ్యదశ చూడలేక తాత మరణించాడు. దీక్షితులు ఊళ్ళో తిరిగొచ్చి వాకిట్లోంచి "అమ్మా!" అని పిలిచి ద్వారం ముందు రెండరుగులమధ్య రడ్డిగంవేసి ముక్కుమీద వ్రేలేసుకుని ఆలోచనా ముద్ర వేసి కొని కూర్చునేవాడు. "అమ్మా!" అని పిలిచేపిలుపు ఆయనలోని దుఃఖ సముద్రములోంచి బయలువెడలే బడబానలజ్వాల యని కొత్తవాళ్ళకే వ్యక్తమగు తుంది.

హఠాత్తుగా అన్నపూర్ణనిపిలచుకొని "అమ్మా! ఎట్లాగే" అని అసందిగ్ధంగా పలికేవాడు. "నీముందు గతి ఎట్లాగే" అని ఆయన కళవళపడే హృదయం లోంచి ఆయనకు తెలియకుండానే జారిపడే ఆమాటలు ఏమి అర్థమగుతవి? ఆచిన్నపిల్లకు. పాపం ఆపిల్ల "నాన్నా!, అమ్మా! ఎట్లాగే నంటావేమిటే?" అని ప్రశ్నిస్తుంది. దీక్షితులు గుడ్లనీళ్ళు గుడ్ల క్రుక్కుకుని అరటితోటలోకి వెళ్లి మందారచెట్టు క్రిందకూర్చుని కడుపు చెలువు చేసికొని ఏడ్చి ఏడ్చి నూతికిపోయి స్నానంచేసి తర్పణాలు వదలి రెండు మెతుకులు తిని మధ్య హాల్లోకొచ్చి పడుకునేవాడు.

ఈవిధంగా రెండుఏండ్లు గడుపుకుని ఒడ్డున బడ్డాడు దీక్షితులు.

౫

లలిత కాపురానికొచ్చింది. సర్వేశ్వరంలోని సరసత ఊడికింది. అన్నపూర్ణ అంతస్సులో ఆవేదన అధికమయింది. అత్తవారింటికొచ్చినా ఉద్యోగస్థుల పోకడ వదిలిందికాదు లలిత. పొద్దున్నే కాఫీ తాగేది. మొగుడిని తాగమనేది. సరదాగా సర్వేశ్వరం వారంరోజులు తాగాడుగాని తరువాత వెగటు పడి “10 గంటలకు భోంచేసేవాడికి నా కెందు కాఫీడిత. నే తాగనన్నాడు” “మా నాన్నగారు తాగుతారండీ - మీరుకూడా తాగండంది లలిత. “మీ నాన్న చుట్టకూడా తాగుతాడు. అదికూడా తాగమంటావు ఇకముందు, 7 గంటలకే ఏదో ఒకటి పొట్టలో వేయటం మా యింటా వంటా లేదన్నాడు” సర్వేశ్వరం.

కాపురానికొచ్చిన మొదట్లో “వదినగారూ! కాస్త కాఫీ కాచిపెట్టరూ!” అని అన్నపూర్ణకు పురమాయించేది లలిత. తరువాత తరువాత లేవటంతోనే కాఫీ కాయటం నిత్యవిధి అయిపోయింది అన్నపూర్ణకు. ఎట్లాయుంటుందో తాగిచూద్దామనుకునేది అన్నపూర్ణ. పల్లెటూరు విధవాళ్లు స్నానంచేస్తేగాని ఏమీ తినకూడదు గాబోలనని లలిత ఓదార్చేది. ఒక్కొక్కప్పుడు కాఫీ తగలబడ్డట్టు కాచావని లలిత అన్నపూర్ణని గదిమేది. ఉద్యోగస్థుల పిల్లకు ఎక్కడ మర్యాద సరిగ్గా జరపలేకపోతానోయని అన్నపూర్ణ భయపడేది. అన్నపూర్ణ వంట ఎంత బాగా చేసినా “మా వదిన ఎప్పుడూ వంటకే గాని నాజూకువంటకు పనికిరా”దని లలిత నిర్మొహమాటంగా అనేస్తుండేది. అన్నపూర్ణ చిన్నబోయేది.

“పొద్దున్నే కాఫీతో పొట్టనింపుకుని 10 గంటలకే మళ్లీ తినబోతే అపనారాల్లో ఏంకమ్మదనం కనిపిస్తుందని సర్వేశ్వరం లలితనన్నాడు. రేపూ మాపూ అన్నపూర్ణే వంటచేసి అన్నా వదినలకు ఏకపంక్తిలో వడ్డించి చివరకు తాను వంటరిగా తినేది. లలిత తను వచ్చిన కొత్తలో అన్నపూర్ణకు తోడుగా కూర్చునేదిగాని తరువాత తరువాత మొగుడుతో పాటు లేచి వెళ్లి తమలపాకులనీ, గదిసవరింపనీ, పక్కలు వేసుకోవాలనీ పనిపెట్టుకుని యింకా వంటింట్లోకే వచ్చేదికాదు. అన్నపూర్ణ, భోంచేసి వంటిల్లు సర్దుకుని బయటికొచ్చేది.

"నీ వది వండమందా మనుకున్నా, ఇది వండావా? కొన్ని పదార్థాలు వండేవిధమే నీకు తెలియదు. నేర్చుకుందామనే బుద్ధే లేదని" అన్నపూర్ణని ఝంబాడిస్తూంది లలిత.

"వదినా! నాకు చేతకాకపోతే నువ్వు చేసి చూపిస్తే నే చేస్తాగా. నన్ను మాటాడిపిస్తే నే నసలే చేయలే"నన్నది అన్నపూర్ణ. "నే చేస్తే నువ్వెం దుకూ" అంటూ దీర్ఘం తీస్తూ పడకగదిలోకి పోయింది లలిత.

"నువ్వెందుకూ" అంటే నేను వంటచేసి పెట్టేందుకేనా? వంటచేసే దాసినా అంటూ తర్కించుకుంటూ వంటింట్లోకి వెళ్లింది అన్నపూర్ణ.

సర్వేశ్వరం సాయంత్రాని కొస్తానని బెజవాడెళ్ళాడు. వంట్లో బద్ధకంగా వుండటం చేతనూ అన్నయ్య ఊళ్ళో లేడుగదా యని తెల్లవారకట్ట లేవటం పొద్దులు మాలింది అన్నపూర్ణ. తాను లేచేటప్పటికి కాఫీ కాలేదని లలిత చిరచిరలాడుతూ కుంపటి వెలిగించుకుని "ఛీ! వెధవ బ్రతుకు. ఒకరి మీద ఆధారపడితే యింతే. ఊరికే పడుకుంటే ఎట్లావస్తుందీ ముద్ద మింగటానికి? చచ్చినట్లు చాకిరీ చేసుకోవాలి" అని గొణగొణ మొదలుపెట్టింది. అన్నపూర్ణ మెదలకుండా లేచి మడికట్టుకొని వంటచేసి "వదినా! రావమ్మా! భోంచేద్దాం. నాకు వంట్లో బాగాలేద"దంది. "నా కాకలి కావటల్లా. నువ్వు తిని అక్కడ పడేయి. ఆకలయినప్పుడు లేచి పెట్టుకు తింటాలే" అని మూతి బిగించుకుంది. "నువ్వు తినకుండా నాకు తినబుద్ధి కావటల్లేదమ్మా! వచ్చి భోంచెయ్య"మని బ్రతిమాలుకుని లలితను తీసుకెళ్లింది అన్నపూర్ణ.

అన్నపూర్ణ వంటింట్లో వున్నప్పుడు వంటకత్తెగానూ, బయటిపనులు చేసేప్పుడు పనిమనిషి అనే భావాన్నే లలిత వృద్ధిపొందించుకుందిగాని తోటి ఆడపిల్ల, సంఘనిబంధనలచేత అట్టి ప్రారబ్ధం అనుభవిస్తూ తన పంచను పడియుందని గుర్తించుకోలేకపోయింది లలిత.

అంతవరకు భాగ్యభావాన్ని సర్వేశ్వరం తెలుసుకోలేక పోయాడు. ఏదో తర్కించుకోటంలో అన్నపూర్ణ, "వదినా! నువ్వే ఒక తల్లిగానూ — వాడే ఒక తండ్రిగానూ యుండి నన్ను కడుపులో పెట్టుకుని నాజీవితాన్ని తెల్పితవ్యాకపోతే నాకు దిక్కెవ్వరని ఏడుపు ప్రారంభించింది. గదిలోంచి సర్వేశ్వరం ఈ మాటలు వింటూ దొడ్లోకెళ్లి "అమ్మా! యిప్పుడేం

వచ్చిందే? ఎందుకు ఏడుస్తావని?" అన్నపూర్ణ నడిగాడు. లలిత చమత్కారంగా "మా అత్త గొడవలు మీకెందుకూ! ఏవో చెప్పుకుంటామని" అప్పటి విషయం చెప్పకుండా తప్పించింది. అన్నపూర్ణ "ఏమీ లేదని" చెప్పి వంటింట్లోకి వెళ్ళింది.

సర్వేశ్వరం తన చెల్లెలి దైన్యజీవితాన్ని తన మనసులో తలుచుకున్నాడు. ఓసారి ఎవరో మల్లెపూల మాల కట్టుకుంటుంటే చూచి "నాకు చిన్నప్పటినుంచీ మల్లెపూలంటే మహాప్రాణం. ఆ పాపిష్టి దేవుడికి నేనేం పాపం చేశానో? నాకు ఆపూలు దూరం చేశాడంది." సర్వేశ్వరానికామాట తుపాకి దెబ్బలాగ తగిలి "అమ్మా! నీ భగవంతుడు దయాస్వరూపుడు. ఆయన తప్పుగాదు. సంఘం నీకు చేసిన అపరాధమే"నని ఓదార్చాడు.

ఒక పర్యాయం తన మేనత్త కూతురుతో ఏదో తనజీవితం గొడవ చెపుతూ "ఈ పాడు అల్పాయుష్కుడే కనబడ్డాడు గాబోలు మానాయనకని" ఎదురుగా గోడకు తగిలించియున్న తమ కుటుంబపు ఫోటోను బొమ్మలు కనబడకుండా గోడవేపుకు తిప్పేసింది. సర్వేశ్వరానికాచేత అశనిపాతంలాగా తోచి దీనిజీవితాన్ని ఎట్లా వెళ్ళదీయటమా అని ఏడిచాడు.

లలిత "ఎవరిప్రారబ్ధం వారిదీ - ఎందుకుబొమ్మ తీసేస్తా"వని ఫోటో తిరగేసింది.

"ఔను నాచెల్లెలు పడే వ్యథ నాకు కనిపిస్తుంది గాని ఎక్కడినుంచో వచ్చిన నీకేం తెలుస్తుం"దన్నట్లు లలితవంక చూచాడు సర్వేశ్వరం. ఈ విధంగా నడుస్తోంది ఆ సంసారం.

## ౬

సర్వేశ్వరం పొలంనుంచి యింటికొచ్చేటప్పటికి స్మృహ తెలియకుండా పడియుంది అన్నపూర్ణ. "లలిత కంగారు పడుతూ వెంగుడికోసం కబురం పాలనుకుంటోంది. సర్వేశ్వరం వైద్యుడుని పిలిపించి అన్నపూర్ణని చూపించాడు." ఇది హిస్టీరియాఫిట్స్, తడిగుడ్డ మొఖంమీద కప్పండి, స్మృహ వస్తుందన్నాడు.

సర్వేశ్వరం హిస్టీరియా అనే పుస్తకం కొని ఆ వ్యాధిని గురించి చదివాడు. ఆ పిల్లకు ఎట్టి యుద్రేకం కలుగకుండా మాత్రం చేయగల ననుకొన్నాడు. ఒక పేజీలో లిండ్లహార్, యం. డి. యిట్లా వ్రాశాడనియుంది — ఇది ముఖ్యముగా విషయవాంఛ తీరనప్పుడుగానీ దుఃఖావర్తివినప్పుడుగానీ వచ్చు వ్యాధి. నరములయందు ఉద్రేకము పుట్టించి వివశత్వము వలన కొంత వరకూ స్మృతి లేకపోవును. ఈ వ్యాధి భర్తయొక్క బలమైన గాఢాలింగనముచేత తప్పక నయమయినట్లు పెక్కుచోట్ల బుజువు చేసితిని" — ఈ చికిత్సవలన ఆ జబ్బు నయమగునని తనకు నమ్మకము కలిగినది గాని అదెట్లు సంభవమగునని సర్వేశ్వరం చింతించాడు. తలయెత్తి చూచాడు. సంఘం కళ్ళురిమి భయపెట్టింది.

చెల్లెల్ని అట్టి దుర్భరవ్యాధికి ఆహుతిచేసి తానెట్లా సుఖింపగల ననుకున్నాడు. చెల్లెలితో చనువిచ్చి మాట్లాడాడు. లలితతో మనసులోవన్నీ చెప్పేస్తున్నాడు.

ముగ్గురూ కలిసి కూర్చుని భోంచెయ్యాలన్నాడు. హాల్లో మూడు మంచాలూ వరసాగ్గా వేసుకొని చక్కని ఖబుర్లు చెప్పుకుంటూ పడుకుందా అన్నాడు. ఇట్లా కొన్నిరోజులు జరిగినై. లలిత "నాకు హాల్లో నిద్రపట్టటల్లా, గదిలో కెళ్ళి పడుకుంటా" నంది. "సరే వెళ్ళు" అన్నాడు సర్వేశ్వరం. గదిలో ఊదువత్తులు వెలిగించింది, బట్టలకు సెంటు రాచింది, మల్లెపూలు విరియబోసింది. ఎంతో హంగామా చేసింది లలిత. సర్వేశ్వరం వేపుకు ఆ పరిమళ ప్రవాహం పారలేకపోయింది. "ఒకసారి గదిలోకి వస్తారా?" అని సర్వేశ్వరాన్ని పిలిచింది లలిత. సర్వేశ్వరం వచ్చాడు. "ఇట్లా కష్టపడటానికేనా మా నాన్న మీకిచ్చి పెళ్ళిచేసింది? గదిలో పడుకోండని" చెయ్యి పట్టుకుంది. "నా చెల్లె లట్లా వ్యసనపడుతుంటే అది చూస్తూ నేనెట్లా సుఖపడగలనో చెప్పు" మన్నాడు సర్వేశ్వరం. "అట్లా ఆవిడ దుఃఖపడటం ఆవిడ పురాకృత కర్మం. దానికేం చేస్తామంది" లలిత. "ఇట్లా యుండికూడా మనం కష్టపడాలిసిన పురాకృత ఖర్మ ముందేమో ఆలోచించ" మన్నాడు సర్వేశ్వరం. "మీరిట్లాగంటే నేనేం చెప్పనంది". "నువ్వట్లాగంటే నేనేం చెయ్యనన్నాడు". "నా కళ్ళెంత వేడెక్కిందో చూడం"డంది. "నా కడుపులో ఎంత కోతపడిందో చూడవా?" అన్నాడు.

ఏదో సంబంధంపెట్టి నాకూ ఆవిడకూ ముడిపెడతారేమంది" లలిత. "చెప్పనా! నువ్వూ ఆదీ స్త్రీలు గాబట్టి - సమాన వయస్కులు గాబట్టి - వదినా ఆడపడుచులు గాబట్టి, యీ సంబంధాలచేత మీ యిద్దరికీ ముడి కలిగిందని చెప్పి యిక నేను పడుకుంటా, తిరిగొచ్చేటప్పటికి కాళ్ళు నొప్పిగా యున్నవని" హాలులోకి వెళ్ళుతున్నాడు. పాపం అట్లాగయితే కాళ్ళు పిసుకుతానని లలిత కూడా హాల్లోకి వెళ్ళింది.

## ౭

చెల్లెలిని మామగారికి సుస్తీగా యుండటంచే చూట్టానికి తీసుకు వెళ్ళాడు సర్వేశ్వరం. కొడుకుని తలచుకుని కాప్సేవేడిచి కోడల్ని 10 రోజాలు ఇక్కడుంచి వెళ్ళుతున్నాడు సుబ్బన్న పండితుడు. సర్వేశ్వరం "అట్లాగే లెండి" అన్నాడు

సర్వేశ్వరం సాయంకాలం మఠం కేస్తుకు షికారెళ్ళాడు. స్వాములవారు సర్వేశ్వరాన్ని చూచి "ఎవరురా! నాయనా!" అని అడిగాడు. "నేను ఫలానా" అని చెప్పాడు సర్వేశ్వరం. స్వాములవారు మెట్లమీద కూర్చుని "నాయనా! హయగ్రీవం ఎంత తెలివిగలవాడురా; ఏక సంతగ్రాహిరా - వాడిచేత మఠంలో భాష్యప్రవచనం చేయిద్దామని ఎంత అనుకున్నారా! అటువంటి వ్యక్తి ఎందుకు బ్రతుకుతాడురా" అంటూ ఎన్నో విధాల వెంకలెట్టాడు.

"స్వామి! చనిపోయిన వాడిని గురించి విచారించి ఏమిలాభంగానీ బ్రతికి యున్న యతని భార్యను గురించి అహర్నిశాలూ ఏడ్చి ఏడ్చి నాతండ్రి చచ్చిపోయినాడు. ఆ ఏడుపిప్పుడు నావంతు పడింది. ఆ పిల్ల జీవితవిషయ మెట్లాగో నాకు తరుణోపాయం చెప్పరూ స్వామీ!" అని సర్వేశ్వరం కళ్లనీళ్ళు పెట్టాడు

స్వాములవారు దీర్ఘంగా ఆలోచించి "నాయనా! కొడుకు జీవితవిషయం సులువుగా పరిష్కరించగలిగిన సుబ్బన్న పండితుడికి కోడలి విషయ మెంతకష్టం! నీవు వెళ్ళి ఆచార్యపండితుణ్ణో ప్రార్థించు, ఏదోదోవ చూపుతాడులే" అని స్వాములవారు లోపలికి వెళ్ళిపోయినారు.

---

# 3. భాగ్యవంతుల పిల్ల

## ౧

చంద్రారెడ్డి రెనిమిదేండ్ల బుడతడై యుండగా తండ్రి పరలోకగతుడయాడు. తాత దైవబ్రాహ్మణ భక్తుడై వెంకటేశ్వరాలయం ప్రతిష్ఠించి వేదపాఠశాల నడపి తనకున్న భూసత్వంలో మూడువంతులు భగవదర్పణం చేశాడు. తండ్రికూడా తాతత్రోవను నడిచి మిగిలింది ఈశ్వర కైంకర్యం చేశాడు.

చంద్రారెడ్డికి మిగిలింది దోసెడు పొలం, పాత ఇల్లు, విధవతల్లి. ఆ తల్లి తన ప్రక్కలో పడుకోబెట్టుకొని రెడ్డికి భారతకథలూ, చరిత్రలూ చెప్పేది. ఆ కథలమధ్య తనకు తండ్రి చెప్పిన బాలరామాయణం శ్లోకాలూ శతకాల్లో పద్యాలూ చదివి యిల్లెగిరిపోయేట్లు సంగీతం తీసేవాడు. భర్తను కాస్సేపు జ్ఞప్తికి తెచ్చుకొని దుఃఖించి కొడుకుని చూచుకుని ఆనందించి నిద్రించేది రెడ్డితల్లి.

పున్నయ్యసిద్ధాంతి చంద్రారెడ్డి తాతతండ్రులకు అంతరంగిక స్నేహితుడు. ఆ కారణంచేత చంద్రారెడ్డికి తల్లి తరువాత సిద్ధాంతి తాతగా కనపించాడు. ఒక సుముహూర్తాన రెడ్డికి అక్షరాభ్యాసంచేసి బోర్డుస్కూల్లో ఒప్ప చెప్పాడు సిద్ధాంతిగారు. 5 సంవత్సరాల్లో చంద్రారెడ్డి బోర్డుస్కూల్లో నున్న 3 వ ఫారం ప్యాసయినాడు. మాస్టర్లు రెడ్డియందు మంచి ప్రేమభావం చూపిస్తూ "రెడ్డిని చదువులో ప్రోత్సహిస్తే చాలా వృద్ధిలోకి వస్తా"డని చెప్పేవాళ్లు.

ధనాభావంచేత రెడ్డితల్లి నిస్పృహత్వం సూచించింది. ఒకరోజు బోర్డుస్కూలు హెడ్‌మాస్టరుగారు చంద్రారెడ్డిని తనయింటికి పిలిపించుకుని "గోపాలపురం హైస్కూలు హెడ్మాస్టరు మా తమ్ముడు. నీకు కావలసిన ఏర్పాట్లుచేసి నీకు చాలా ఉపకారం, సహాయం చేస్తాడు. తప్పక వెళ్ళు. ఇదిగో ఉత్తరం వ్రాసి యిస్తున్నా"నన్నాడు.

సిద్ధాంతిగారు చంద్రారెడ్డిని వెంటబెట్టుకొని రెండు పనసపళ్లు, జతయజ్ఞోపవీతాలు తీసుకుని గోపాలపురంవెళ్లి హైస్కూలు హెడ్మాస్టరుగారిని దర్శించాడు. పనసపళ్లు బల్లమీద పెట్టి, యజ్ఞోపవీతాలు చేతిలో పెట్టి ఆశీర్వదించాడు.

# ౨

హెడ్మాష్టరుగారి పేరు సూర్యనారాయణరావుగారు. శిష్యులయొక్క తెలివితేటలు చూపుల్లోనే గ్రహించగల మనిషి. శిష్యుల్ని స్వంత బిడ్డల్లాగ చూచేవాడు. పంతులుగారు చంద్రారెడ్డి గుణగణాలు అన్నగారి ఉత్తరం ద్వారా తెలిసికొన్నాడు. సిద్ధాంతిగారిద్వారా అతని పుట్టుపూర్వోత్తరాలు విన్నాడు. "చంద్రారెడ్డిని తన శిష్యునిగా స్వీకరించి అతని బాధ్యతల్ని నామీద పెట్టుకున్నా. మీరు ఇక వెళ్ళిరండని సిద్ధాంతిగారిని పంపేశాడు. రెడ్డి వస్తుతహా సూక్ష్మబుద్ధిగల కుర్రవాడగుటచేతనూ ఊళ్లో మాష్టర్లు ఎక్కువ శ్రద్ధతీసుకుని విద్యాబుద్ధులు చెప్పటంచేతనూ క్లాసు మొత్తం మీదేమిటి స్కూలు మొత్తంమీదనే తెలివిగలవాడనీ నెమ్మదయినవాడనీ పేరుపడ్డాడు. పైగా హెడ్మాష్టరుగారి ప్రాపకంకూడాను. బంగారానికి పరిమళం అబ్బినట్లుంది.

రెడ్డికి భోజనభాజనాలన్నీ హాస్టల్లో జరిగిపోతున్నై. జీతం పుస్తకాల విషయంలో రెడ్డికేం ప్రశ్నసలేదు. తన అజమాయిషీ అంతా హెడ్మాష్టరుగారిదే. ఆ సంవత్సరం పెద్దపరీక్షల్లో రెడ్డికి అన్ని సబ్జక్టుల్లో నూటికి 80 మార్కులు పైగా వచ్చినై.

రెండో సంవత్సరం రెడ్డి ఆటల్లో మేటయిపోయినాడు. డిస్ట్రిక్టు స్పోర్ట్సు పందాలు ఆ సంవత్సరం గోపాలపురంలోనే జరిగినై. పందాలకు తన హైస్కూల్లోంచి వెళ్ళే ప్రతిజట్టుకూ తానే కెప్టెన్‌గా వెళ్లాడు. ప్రతి స్కూలువాళ్ళకీ చంద్రారెడ్డి టీమంటే హడలయిపోయింది.

పుచ్చకాయల వీరారెడ్డిగారు ఆయూరి నగర కాంగ్రెస్ అధ్యక్షుడు. మంచి పలుకుబడిదారు. లక్షరూపాయల ఆస్తిగలవాడు. హెడ్మాష్టరు సూర్యనారాయణరావు పంతులుగారికి ముఖ్యమయిన స్నేహితుడు. ఆ పందాలలో గెలిచినజట్లకీ బహుమానప్రదానం చేయుటానికి వీరారెడ్డిగారిని కమిటీవారు రాకోరారు.

ఫయినల్సు గెలుపుమీద వస్తేనేం, స్పెషలుగా వస్తేనేం చంద్రారెడ్డికి అన్ని ఆటలలో కలిపి డజనుకుపైగా కప్పులూ, ఇంకా మెడల్సులువచ్చినై. దాని

జిల్లా స్కూలుకీ హెడ్మాస్టరుగారికీ పేరు ప్రఖ్యాతులు వచ్చినై. చంద్రారెడ్డినిగురించి అందరూ ఎక్కువగా చెప్పుకున్నారు.

వీరారెడ్డిగారి కొడుకు నరసారెడ్డి చంద్రారెడ్డి డ్రామా జట్టులో వెంట రాడి కప్పులు బహుమానలు పొందాడు. తక్కిన యాటల్లోకూడా కీర్తి తీసుకొమ్మని నరసారెడ్డిని తండ్రి ప్రోత్సహించాడు. తన స్నేహితుడు చంద్రారెడ్డినిగురించి గొప్పగా చెప్పటం ప్రారంభించాడు నరసారెడ్డి. అటువంటివాడితో నేస్తం కట్టమని సలహాయిచ్చాడు వీరారెడ్డిగారు.

నరసారెడ్డి చెల్లెలు పద్మిని. అన్నతోపాటు 2-3 ఫారాలు హైస్కూలులో చదివింది. తెలుగు సారస్వతంమీద మంచి అభిమానాన్ని సాధించింది. “ఆపిల్ల తనకుతాను విద్య ఆపేవరకు చదివించ”మని సూర్యనారాయణరావుగారు వీరారెడ్డిగారికి సలహా యిచ్చారు. డిబేటులో ఏ అంశం మీదనయినా చక్కని తెలుగులో మాట్లాడగలిగేది పద్మిని.

తండ్రికివలె పద్మిని మంచి దేహసౌష్ఠవంగలపిల్ల. చాల పొడగరి. వయస్సుకు మించిన పిల్లగా కనబడుతుంది. నాల్గవ ఫారం ప్యాసవటంతోనే 5వ ఫారానికి కాస్టు గరల్సు హైస్కూలులో చేరింది పద్మిని.

ఆ స్కూలు యానివర్సరీ ఫిబ్రవరిలో జరిగింది. ఆ స్కూలు మొత్తం మీద తెలుగు వ్యాసరచనలోనూ, ఉపన్యాసంలోనూ, కొన్ని ఆటల్లోనూ పద్మినికి రెండుకప్పులు, భారత నారీమణుల చరిత్ర బహుమానం వచ్చినై.

## 3

అయ్యంగారు స్కూలుఫయినలు పరీక్ష అయినా అవటంతోనే తాలూకా బోర్డు ఆఫీసులో గుమాస్తాగా చేరాడు. కుర్రతనంలో ఊగడటం చేసినా పైన ‘అ’ అనేవాళ్ళు లేకపోవటం చేతనూ చెడుదోవల్లోకి నడవడం ప్రారంభించాడు.

అప్పుడప్పుడు స్కూల్లోకొచ్చి ఫుట్ బా లాడుతూ యుండటంచేత చంద్రారెడ్డికి అతనితో దోస్తీ కుదిరింది కాని అయ్యంగారి చెడునడతగురించి రెడ్డి యేమాత్రం తెలుసుకోలేకపోయాడు.

ఆదివారం పొద్దున అయ్యంగారు హాస్టలుకొచ్చి ఆటలవిషయం చెప్పుకుంటూ పెద్ద బజారువేపుకు రెడ్డిని తీసుకెళ్ళి కుమ్మరి సందులో ఉన్న డాబాలోకి తీసుకెళ్లాడు, సరాసరి పడకగదిలోకిపోయి పందిరిమంచంమీద పడుకున్నాడు అయ్యంగారు. ఇది యితని యిల్లయియుంటుందా యని అనుమానిస్తున్నాడు చంద్రారెడ్డి.

పావుగంటలో 18 ఏళ్ళ పిల్ల నొకదాన్ని గదిలోదింపి అయ్యంగారితో రెండు వేళాకోళాలాడి తప్పుకుంది ముసలిపెద్దమ్మ. ఆ పిల్ల అటువచ్చింది, గది యిటు ఘుమ్మంది.

ఆచారి సిగరెట్టు వెలిగించి ఈలపాట ప్రారంభించాడు. పిల్లతో వెకిలి మాటలు మొదలెట్టాడు. ఆపిల్ల హార్మోనీమీద సినిమాపాటలు ప్రారంభించింది. ఎప్పుడూ యిటువంటి సన్నివేశమెరుగని రెడ్డివిద్యార్థి కంపించిపోయినాడు. "నాకు తలనొప్పిగా ఉంది, నేను వెళుతున్నాన"ని లేచి వెళ్లిపోయినాడు.

తాను దుష్టసమాగానికి లోబడి సానిగడప తొక్కటం మహాపాపం చేశాననుకున్నాడు రెడ్డి. సూర్యనారాయణ పంతులుగారితో చేసిన అపరాధం చెప్పి క్షమాపణ అడిగాడు. ఇది నాబుద్ధికి తెలియకుండా జరిగిపోయిందని గోలపెట్టాడు. అయ్యంగారితో ఇక మాటకూడా మాట్లాడనన్నాడు. పంతులుగారు యథార్థవిషయాన్ని గ్రహించి యిక దుష్టస్నేహితులను విడనాడమని సలహా చెప్పాడు.

ఎంతమంచివాడయియుండినా రెడ్డిని ఇంకా కట్టుదిట్టాలో ఉంచాలనుకొన్నాడు పంతులుగారు. మరుసటిరోజు మధ్యాహ్నం వీరారెడ్డిగారిని పిలిపించుకుని అదుపులేనివాళ్ళ చెడునడతల్ని గురించి మాట్లాడి "చంద్రారెడ్డికి మన యింటిదగ్గర వసతిచూపించి మీ యజమాయిషీలో ఉంచుకోవా" అని పంతులుగారు కోరారు. "దానికేమి లెండి మన నరసారెడ్డితో పాటు చంద్రారెడ్డికూడా యుంటాడు. రేపే యతన్ని సామానుతో మన యింటికి పంపండి. ఏమీ యభ్యంతరం లే"దని వీరారెడ్డిగారు చెప్పి వెళ్ళిపోయినారు.

## ౪

వీరారెడ్డిగారి కుటుంబంలో నొకడైపోయినాడు చంద్రారెడ్డి. ముందు గదిలో నరసారెడ్డితో పాటు చదువుకుంటూ వెనక గదిలో పడుకుంటాడు. మొట్టమొదట్లో వీరారెడ్డిగారి యాడంగులు చంద్రారెడ్డిని అదోవిధంగా చూచేవాళ్లు గాని రానురాను అతని గుణగణాలూ తెలివితేటలు తెలిసికొని గౌరవించారు. పద్మినికి దిద్దిన పరీక్ష కాగితాలు ఇచ్చారు. తెలుగులో 67 మార్కులు వచ్చినై. అన్నగారికి ఆ కాగితాలు చూపించి "మీ మార్కులులో ఇంతకంటె ఫస్టుమార్కు-ఉంటుందా?" అని యడిగింది. "ఏవీ కాగితాలు" అని తీసికొని గదిలోకి వెళ్లి చూస్తున్నాడు. బహుశహా చంద్రారెడ్డి వచ్చిన తరువాత పద్మిని ఆగదిలోకి వెళ్లటం మొదటిసారి. నరసారెడ్డి పేపరంతా చదివి "మన చంద్రారెడ్డికి తెలుగులో 78 మార్కులు వచ్చినై. ఆ పేపరు చూస్తావుగా" నని అలమర తెరచాడు. పై అరలో చాలా కప్పులు సైజువారీగా పెట్టియున్నై. "అయితే ఈ కప్పులన్నీ చంద్రారెడ్డికి బహుమతిగా వచ్చినవే!" అని పద్మిని నెమ్మదిగా అడిగింది. "అందులో చివరని మూడూ నావి - మిగతావన్నీ యితనివే" నన్నాడు నరసారెడ్డి. "చెడుగుడు పందాలలోనూ స్పోర్ట్సులోనూ వచ్చినవే గాబోలు" అంది చెల్లెలు.— "కాదు తెనుగురచనలోనూ ఇంగ్లీషు డిబేటులో కూడా వచ్చినై." యన్నాడు అన్న.

పద్మిని ఆకప్పుల నొకటొకటిగా తీసి చూచింది. అద్దరు చేతిరుమాలలో వెండి - బంగారపు మెడల్సుకూడా చూచింది. గోడకు తగిలించియున్న భారతమాత ఆయిల్ పెయింటింగ్ బొమ్మ చూస్తోంది — "ఈ బొమ్మ చంద్రారెడ్డి వేసిందే నన్నాడు" నరసారెడ్డి. "అబ్బో! ఈయన యన్నిట్లోనూ ఉన్నాడులాగుందే" యని శ్లాఘించింది పద్మిని.

చంద్రారెడ్డి బలే తెలివిగలవాడనీ - బలం కలవాడనీ నెమ్మదయినవాడనీ నరసారెడ్డి చంద్రారెడ్డిని ప్రశంసించాడు, చెడుగుడు జట్లతోనూ - ఫుట్ బాలు జట్లతోను - హాకీ జట్లతోను - కూర్చున్న ఫోటోలన్నీ ఒకటొకటిగా చూస్తోంది. ఇంతలో పద్మినిని తల్లి లోపలనుంచి పిలిచింది.

సాయంకాలం అన్నా చెల్లెలూ మాట్లాడుకోటంలో చంద్రారెడ్డి ప్రశంస వచ్చింది. నరసారెడ్డి ఆటలవిషయం చెప్తూ చంద్రారెడ్డియున్న పార్టీ యింతవరకూ ఓడి ఎరగదనీ - తెలుగులో కవిత్వంకూడా భావయుక్తంగా వ్రాస్తాడనీ, అతనికి చాలా కొద్దిపొలం - పూరిల్లూ - ముసలితల్లీ తప్ప మరేమీ లేదనీ చెప్పాడు. అప్పుడప్పుడు పద్మిని చంద్రారెడ్డి గుణగణాలూ అతని ప్రజ్ఞలూ వినటానికి ఉత్సాహపడుతుండేది. అన్నచేత చెప్పించుకు వింటూ ఉండేది. ఇటువంటివాడు మనయింట్లో ఉంటే అతనితో దోస్తీ కలుగజేసుకోక పోవడం తెలివితక్కువ అనుకుంది.

పద్మిని అన్నగారితో చంద్రారెడ్డి ప్రశంస తెచ్చి "అన్నా ? ఆయనకు పెండ్లయిందా ?" అని యడిగింది, "ఇంకా కాలా. అతనికి మన మామయ్య కూతుర్నిచ్చి సంబంధం కలుపుకుంటే బాగుంటుంది, నాన్నతో చెబుదాం" అని నరసారెడ్డి అన్నాడు.

పద్మిని ముఖం చిట్లించుకుని "ఇంకా నయం - ఆ నల్లపిల్ల నెవరు చేసుకుంటారురా ! " అంటూ లోపలికి పోయింది.

౫

సెలవల్లో ఇంటికి వెళ్ళాడనే పేరేగాని చంద్రారెడ్డి పట్టున నాల్గురోజులు ఊళ్ళో ఉండలా. చెడుగుడు పందాలకనీ, ప్రాక్టీస్ గేములకనీ చుట్టుపట్ల వాళ్ళు తీసుకెళ్ళారు.

సెలవలు గిర్రున తిరిగొచ్చినై. స్కూలు తెరచారు. చంద్రారెడ్డి రావటం హెడ్ మాష్టరుగారికి కనపడి వీరారెడ్డిగారింటికొచ్చాడు. నరసారెడ్డి తన స్నేహితుడిని చూడటంతో కొండెక్కిపోయాడు. పద్మిని రెండు వెండి గ్లాసుల్లో కాఫీ తీసుకొచ్చి యిచ్చింది. -"అమ్మా"- మీరు కులాసా? -అని ప్రశ్నించాడు చంద్రారెడ్డి— "ఆ. కులాసా ! సెలవల్లో ప్రక్క యూరివరకూ వచ్చి యిక్కడకు వచ్చి స్నేహితుల్ని చూచి పోటానికి తీరిక లేకపోయింది గాబోలునని చురుక్కుమనేటట్లు మాట్లాడి యూరుకుంది పద్మిని. "ప్రయత్నించికూడా రాలేక పోయినా"నని మెల్లిగా చెప్పాడు రెడ్డి.

వీరారెడ్డిగారు చంద్రారెడ్డి యోగక్షేమా లడిగి "యివాళిక్కడ భోజనానికుండు" అన్నాడు. 'పొద్దుల్లో చెప్పొచ్చా' నన్నాడు చంద్రారెడ్డి. "చెపితేనేం" అన్నాడు నరసారెడ్డి. "మా యింట్లో భోంచెయ్యగూడదా" అంది పద్మిని. రెడ్డి చివరకు మౌనంతో అంగీకరించాడు.

ఆ రాత్రి పత్రికల్లో శ్రీనాథుడు అనే శీర్షిక క్రింద తాను పద్యరూపంగా వ్రాసిన రెడ్డిరాజుల శౌర్యం - సారస్వత సేవ - కవుల సత్కారం అనే వాంశాలు చక్కగా వీరారెడ్డిగారికి వినిపించాడు చంద్రారెడ్డి. "తాతల కాలాన్ని త్రివ్వి పోశాడు కుర్రవాడని" వీరారెడ్డిగారు మెచ్చాడు. నరసారెడ్డి "ఫేమ్ - ఫేమ్" అన్నాడు. నరసారెడ్డి తల్లి "కమ్మనిగొంతుక" అంది. పద్మిని వేళాకోళంగా "తాతలు అకవిని అనేక విధాలుగా సత్కరించారు- నాన్నగారు ఈ కవిని ఏవిధంగా సత్కరిస్తారో చూడాలంది. "బండికొయ్యవుతే నాకిద్దమ్మా" అన్నాడు చంద్రారెడ్డి. తండ్రీ కొడుకులు ఒకసారిగా నవ్వారు. పద్మిని లోలోపల నవ్వుతూ "పోనీ పల్లకీ ఎక్కిస్తే..........." అంటూ తండ్రివంక చూచింది.
ఓ! తప్పకుండా! యని ఉత్తరమిచ్చాడు నరసారెడ్డి.

౬

"వయసులో నున్న కుర్రవాడతడూ - ఈడొచ్చిన పిల్ల యిదీ - ఇట్లా కలిసి తిరగనివ్వటం పనికిరాదని" వీరారెడ్డిగారి భార్య మందలిస్తోంది— "అదేం! పద్మినిమాత్రం అంత అవివేకి యని నువ్వెందుకు భయపడాలి? కాకపోతే నువ్వు మందలించగూడదా?" యని భార్యకు సలహా యిస్తున్నాడు.
"ఇంకా నేనేం చెప్పనూ? నిన్న రాత్రి ఏదో పెళ్ళిమాటలు మాట్లాడుతూ- ఎందులో నైనాసరే చంద్రారెడ్డిని మించిన అల్లుడిని నాన్నగారు తీసుకు రాగలరటే? ధనం ప్రస్తుతం లేకపోయినా తరువాత సంపాదించుకో గలరని నాకు నమ్మకం ఉందనీ— ఇది నా నమ్మకమనీ పద్మిని తేల్చేసిందని— భార్య చెప్పింది.
"దాని కట్లాయుంటే మనమేం చెయ్యగలుగుతా" మని రెడ్డిగారన్నాడు. "అదేమిటండీ? అనుభవం లేని పిల్ల, అట్లా అంటే మీరు

హర్షించటమే? తెలివితేటలున్నా పట్టున పాతికెకరాలున్నా లేకపోతే కూర్చుతింటారండీ - తరువాత అఘోరించదూ! ఉద్యోగంచేసి యీయన యెంత యాస్తి సంపాదించనూ" యంది యావిడ — నిజమే! యిట్లాగని కష్టసుఖాలు చెప్పిచూడుమరీ - చిన్నపిల్లగాదూ మరీ" యన్నాడు రెడ్డిగారు.

చంద్రారెడ్డి నరసారెడ్డి బ్యాటుకు గెట్ అల్లుతూ కూర్చున్నారు. నరసారెడ్డి గెట్ సాఫీచేస్తూ "నీకు మా పిల్లల్లో ఎవరినన్నా పెళ్ళిచేసి మాతో బంధుత్వం కలుపుకోవాలనుంది మాకు. నీ యభిప్రాయం చెప్పు" అన్నాడు నరసారెడ్డి. చంద్రారెడ్డి కొంతసేపు ఆలోచించి "మీ యుద్దేశం బాగానే యుంది కానీ- "భాగ్యవంతులకూ పేదవారికీ వియ్యం పనికిరాదు" "వియ్యానికి కయ్యానికీ సమానతాయు యుండాలి," నా కుమిత్రో "అట్టి బాంధవ్యం ఇష్టం లేదని" ఊరుకున్నాడు. "నరసారెడ్డి మాట్లాడక" ఊరుకున్నాడు. "అయితే యెటువంటి బాంధవ్యం కోరుతావో చెప్పు" అంటూ పద్మిని గదిలోనికి వచ్చింది— "ఇప్పుడున్న సంబంధ మటువంటిదేనని తెలుపుకో కుండా చంద్రారెడ్డి సమాధానమిచ్చాడు" తెలతెలబోతూ "భాగ్యవంతులయిన అత్తవారు దొరకటం నీకిష్టంలేదా?" యంది. ఆ అమ్మాయి. — "ఎందుకొచ్చింది. ఆ యమ్మాయేమిటి నేను భాగ్యవంతులింటి పిల్లననుకోటం - నేను బీదవాడనై యుండటం ఇవి నాకిష్టంలేదు. గంతకు తగ్గ బొంత చేరుకోటం మంచిదన్నాడు" రెడ్డి.

ఉన్నవాడు ఉన్నవాడికే పెట్టుట ఏమిధర్మమో! నేను దాన్ని గర్హించి వ్యతిరేకిస్తానంది, పద్మిని. — "అంత నిర్మలమైన త్యాగబలం బుద్ధిబలం ఉంటే మంచిదేనన్నాడు" రెడ్డి. బ్యాటుపని పూర్తియయింది. అందరూ బయటికి వెళ్లారు.

గవర్నమెంటు పరీక్షలు పూర్తి కావచ్చినై. చంద్రారెడ్డి వారంరోజులలో వాళ్ళ ఊరెళ్ళిపోతాడు. నరసారెడ్డి చంద్రారెడ్డిని ఏటికట్టకు తీసుకెళ్ళి— "నాతో నీకు బంధుత్వం ఏర్పరచుకోవాలని ఉందా? లేదా! చెప్పుమ్మని" నొక్కి యడిగాడు. "మీకు నాయందు ప్రేమ యున్నమాట నిజమే కానీ మీ తలిదండ్రులు చూపే యలసభావం నా హృదయంలో కలతపెడుతోంది. వారికి ఇష్టం లేనిపని మీరెందుకు తలపెడుతున్నారో నాకర్థం కావటల్లేదన్నాడు" రెడ్డి. "నా సోదరి స్వతంత్రజీవితాన్ని

అరికట్టటానికి ఎవరికీ అధికారం ఉందన్నాడు?" నరసారెడ్డి. మాటా పలుకూ లేకుండా యిద్దరూ లేచారు.

రెండు రోజుల్లో పరీక్షలయిపోతవి. చంద్రారెడ్డి హాస్టలుకు భోజనానికి వెళ్ళబోతున్నాడు. పద్మిని గదిముందుకొచ్చి "రెడ్డిగారూ! పురుషుడొక్కడే స్వతంత్ర ప్రియుడా? స్త్రీకి కూడా హృదయముంది. తన యొక్క జీవితాన్ని గుర్తించి సుఖవంతం చేసుకోడానికి అధికారం ఉండనుకుంటా? అది న్యాయం కాదంటారా?" అని జేవురించిన కళ్లు విప్పి చూచింది.

"నీ యవమానికత్వం చూస్తే నాకు జాలేస్తోంది" అంటూ రెడ్డి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. చివరరోజు సామాను సర్దుకొని రెడ్డిగారితోనూ ఆయన భార్యతోనూ "సెలవు తీసుకుంటున్నా, మరచి పోకుండానన్నాడు" చంద్రారెడ్డి. నరసారెడ్డి చేతిగుడ్డతో కళ్ళొద్దుకుని "నీకు ఈ యూరితోనూ మాతోనూ సంబంధం తీరిపోతోందన్నాడు." పద్మిని సూర్యాస్తమయ సమయంలో వాడిపోయిన పద్మాన్ని పోలింది. చంద్రారెడ్డి "అట్లా ఎప్పటికీ కాదు. మన జీవితాంతం వరకూ ఈ సంబంధం తెగిపోదని నా నమ్మకం" అంటూ రెండు కప్పులూ భారతమాత బొమ్మ తీసి "నా జ్ఞాపకార్థం ఇవి మీరిద్దరూ తీసుకోండి" అన్నాడు.

"నరసారెడ్డి సరే యట్లాగయితే" నని తానూ చెల్లెలూ కలిసి తీయించుకున్న ఫోటో గదిలోంచి తీసుకొచ్చి "ఇది మా జ్ఞాపకార్థం నువ్వుంచుకోమ్మని" చేతులో పెట్టాడు. వీరారెడ్డి "ఈ యూరొచ్చినప్పుడల్లా కనపడి పోతూ యుండుమని" చంద్రారెడ్డిని సాగనంపాడు.

2

పద్మిని బయటికి రావటం మానింది. నరసారెడ్డి వక్కురు పడ్డాడు. గది బావురు మని పోయింది. ఇంట్లో ప్రతి విషయంలోనూ అసంతృప్తి పిలిస్తే పలుకుతోంది. ఒకరి మాటొకరికి కలియకుండా పోయింది. వీరారెడ్డి గారికిట్టి సంసారస్థితి చాలా ఆందోళన గలిగించి అశాంతి పెచ్చించింది.

కలతో సారాంశము విచారించుకునేందుకు తన బావమరదిని గోపాలరెడ్డి గారిని

నరసాపురంనుంచి పిలిపించుకున్నాడు వీరారెడ్డిగారు. మామని తనవైపు త్రిప్పుకోవాలని ప్రారంభించింది పద్మిని. చంద్రారెడ్డి మీద వ్యామోహం లోంచి పద్మినిని తప్పించాలని పట్టుపట్టింది తల్లి. చెల్లెలి స్వతంత్రానికెట్టి భంగం కలగకూడదని నరసారెడ్డి నిలచాడు.

గోపాలరెడ్డిగారు ప్రత్యక్షంగా చంద్రారెడ్డి తెలివితేటలూ, ఆటల్లో ప్రతిభ క్రిందటితఫా గోపాలపురం వచ్చినప్పుడు చూచియున్నాడు. ఉభయత్రా అనురాగం ఉండినట్లయితే పద్మినీ చంద్రారెడ్లకు వివాహసంబంధం ఏర్పరచి తీరాలని నిశ్చయించాడు.

“70 సెంట్లభూమి చిన్నపూరిల్లూ గల చంద్రారెడ్డికి చూస్తూచూస్తూ పిల్లనియ్యట మసంభవ మంది” తల్లి. “చేస్తే నాయిష్ట మెచ్చినట్లు చెయ్యండి. లేకపోతే నా వివాహము విషయమే తలపెట్టకండని” పద్మిని యంటుంది. “ఈ మాత్రి గోత్తి సందున ఎట్లాగంటాడు” వీరారెడ్డి.

గోపాలరెడ్డిగారు సరాసరి మధ్యాహ్నానికి చంద్రారెడ్డిగారి యింటికి చేరాడు. పొలానయున్న చంద్రారెడ్డిని కలుసుకునేందుకు వెళ్లాడు. చంద్రారెడ్డి మామిడిచెట్టు నానుకొని తనకు నరసారెడ్డి యిచ్చిన ఫోటో చూస్తూ ఏదో యాలోచించుకుంటూ కూర్చున్నాడు. గోపాలరెడ్డి ప్రక్కన నిలబడియున్న సంగతన్నా గమనించలేక పోయాడు.

“నాయనా! చంద్రారెడ్డీ! క్షేమంగా యున్నావా?” యని గోపాలరెడ్డి నెమ్మదిగా పలకరించాడు. ఆశ్చర్యాన్ని సూచించే ముఖంతో చంద్రారెడ్డి “మీరెప్పుడొచ్చారూ! అందరూ క్షేమమా!” అంటూ యని యడుగుతూ చేతిలో ఫోటోను ఉత్తరీయంలో దాచటానికి ప్రయత్నిస్తున్నాడు.

గోపాలరెడ్డి నవ్వుముఖంతో “అంతా కులాసాయేగానీ ఆ చేతులో బొమ్మేమిటో నేను చూడొచ్చునా!” అన్నాడు.

“ఫోటో చూడటానికేం లెండి. ఇది మన నరసారెడ్డి యిచ్చాడు. పాపం చాలా మంచివాళ్ళు” అంటూ తబ్బిబ్బుమాటతో ఫోటో బయటకుతీశాడు చంద్రారెడ్డి. “నేను నీ పెళ్ళివిషయం మాట్లాడటానికొచ్చా. ఈ సాయంత్రానికే మనంవెళ్లి పిల్లని చూచుకోవాలి. ప్రస్తుతమేమన్నా అభ్యంతర ముందా!” యని గోపాలరెడ్డిగారడిగారు.

"ఏ యూరేమిటి?" అన్నాడు చంద్రారెడ్డి. "గోపాలపురం" అన్నాడు గోపాలరెడ్డి. "ఎవరిపిల్ల?" అంటూ ఆశ్చర్యంగా అడిగాడు చంద్రారెడ్డి. "మన బంధుగులే నంటూ" చేతిలో ఫోటో అందించాడు గోపాలరెడ్డి. బాబూ! బీదవాడిని - నన్నెందుకు అపహాస్యములోనికి దింపుతారు! నాకు తగినవాళ్ళని నన్ను చేసుకోనియ్యండని వెనక్కి తగ్గాడు చంద్రారెడ్డి.

పిల్లని చూడకముందు నీ కింగా రేమిటయ్యా! చూచి నచ్చితే చేసుకో - లేకపోతే నిర్బంధం లేదన్నాడు గోపాలరెడ్డి.

"ఎప్పుడూ రానివారొచ్చి ఒకపూటైనా ఉండకుండా పోవటం నాకు బాగుండలేదన్నాడు". చంద్రారెడ్డి. "దానికేమోయ్! నీ పెళ్ళికొచ్చి వారం రోజులుంటారులే యన్నాడు" గోపాలరెడ్డి గారు.

తల్లిదీవన తీసికొని గోపాలరెడ్డి గారితో గోపాలపురం సాయంత్రం 7 గంటలకు చేరాడు చంద్రారెడ్డి. చంద్రారెడ్డిని వీరారెడ్డి తమ్ముడు గారింట్లో కూర్చోపెట్టి పిల్లని తీసుకొస్తానని వెళ్ళిపోయినాడు గోపాలరెడ్డి గారు. చంద్రారెడ్డి మనస్సు పరిపరివిధాల పోతోంది. పద్మినికి తనమీద ఇష్టమున్నా తల్లిదండ్రులు పడనీయరని నిస్పృహ చెందాడు. అయినా అంత భాగ్యవంతుల పిల్లని తనంటివాడు కోరటం హాస్యానికి గురవటమనుకుంటున్నాడు.

గోపాలరెడ్డి వెంటనే బావగారింటికి వెళ్లి అక్కని అందర్నీ పిలుచుకొని "మంచిసంబంధం కుదుర్చుకుని పిల్లవాడిని తీసుకొచ్చా. చూచుకుందురు పదండన్నాడు." "వసతి ఏమాత్రముందని" అక్క యడిగింది. "70 ఎకరాలున్నవి. 5 వేలు కట్నం అడుగుతున్నాడని" గోపాలరెడ్డి చెప్పాడు. "బాబో యంతవఱకు తూగలేమంది" ఆవిడ. వీరారెడ్డి 2 వేల వఱకూ యిస్తానన్నాడు. "ఆ 2 వేలు చంద్రారెడ్డికిచ్చి అమ్మాయినియ్యటం మంచిదన్నాడు నరసారెడ్డి.

"నాకిప్పుడు పెళ్లివద్దంటుంటే ఏమిటిది మామయ్యా?" అంది పద్మిని. "అమ్మాయీ! తల్లి దండ్రుల్ని ఎదిరించకూడదు. నా మాటవిని పిల్లవాడిని వచ్చిచూడు. వచ్చితేనే చేసుకుందువుగాని లేకపోతే నిర్బంధము లేదు. పద కుర్రవాడిని చూదుగాని" యన్నాడు గోపాలరెడ్డి. "అది యన

వసర మంది" పద్మిని. కాదు నామాట వినమని మేనకోడలిని బలవంతంగా బయలుదేరదీశాడు మేనమామ.

చంద్రీ కొడుకుల్ని తనతోట గదిలోకి తీసుకెళ్లాడు. నరసారెడ్డి గడప దాటీ దాటటంతో "చంద్రారెడ్డీ! నువ్వేనటోయ్" అంటూ కౌగిలించుకున్నాడు. వీరారెడ్డి కూర్చుండిపోయాడు. పద్మిని చంద్రారెడ్డిని కిటికీ లోంచి చూచి దిగ్భ్రాంతి చెంది ఆశ్చర్య విస్మయాలను పొందింది. వీరారెడ్డి భార్య కల్పించుకొని "పిడికి మతిపోయిందా! ఇటువంటి హాస్యమూ చెయ్యదలంచిం దః" పళ్లు తొక్కింది.

గోపాలరెడ్డి అందరి భావాలూ పరీక్షిస్తూ "బావా! పిల్లను చూడా నీకు కుర! పెళ్లికొడుకు చూట్టానికి వచ్చాడన్నాడు. నరసారెడ్డి "ద్మి!" అని పిలిచాడు. గోపాలరెడ్డి అక్కగారి దగ్గరకు వెళ్లి అక్కయ్యా! కోపగించకు. నేనేమి అసత్యం పలకలా. నీ అల్లుడికి 70 సెంట్లు గాదు. 70 ఎకరా లున్నమాట వాస్తవం. చెప్తూ గదిలోకి వచ్చి కూర్చోండని తల్లీ కూతుళ్లని తీసుకొచ్చాడు.

అందరూ కూర్చుని యున్నారు. గోపాలరెడ్డి తన జేబులోంచి రిజిస్టరు డాక్యుమెంట్సు తీసి "నాయనా! చంద్రారెడ్డీ! యీ కాకితాలు. తీసుకో" అని కాగితాలు ఇచ్చాడు. వీరారెడ్డివేపు తిరిగి "బావా! నాభార్య గతించిన తరువాత నేను పడిన కష్టం వ్యర్థం నీకు తెలుసుగదా! బంధువులు మళ్ళీ వివాహం చేసికొమ్మనిగానీ ఎవరినైనా పెంచుకొమ్మనిగాని ఒత్తిడిచేశారు. ఇప్పుడు వివాహం చేసుకొని ఏం సుఖం అనుభవించగలనో ఆలోచించూ, అట్లా చెయ్యడం తప్పని తోచింది. పెంపుడు తెచ్చుకుంటే స్వంతకొడుకు కాడా? నా చెప్పుచేతల్లో ఉంటాడని హామీ ఎక్కడ? కనక నా యాస్తిని ఏ సంస్థకైనా యిద్దామా, ఏంచేద్దామా యని ఆలోచిస్తున్నా, ఈ నాటికి నా మనోవ్యథ తీరింది. మనకు చంద్రారెడ్డిలాంటి పుత్రుడు దొరకటం ఒహు దుస్తరం. వారికి వారై ఏర్పరచుకున్న ప్రేమ సంబంధం ఎంతో పవిత్రమైంది. ధనాభావంచేత ఆ పవిత్ర ప్రేమను విచ్ఛిన్నం చెయ్యదంటే ఎంత శోచనీయం. ఇతడు నా దత్తపుత్రుడుగనూ, నీ యల్లుడుగనూ ఉండుట మన భాగ్యంగా తలుస్తున్నా. సిద్ధాంతిగారిని సూర్యనారాయణ రావు పంతులుగార్ని పిలిపించండి. రేపు లగ్నం నిశ్చయం చేద్దాం.

# 4 బాధ్యతగల భార్య

## ౧

పదకొండు గంటలు కొట్టారు. పర్వతవర్ధనమ్మ నయించీ నయించని నాలుగు మెతుకులు ఎంగిలిపడి గంటిల్లు కడిగి 5 నిమిషాల్లో పై పనులు సద్దుకుని ఇంటికి తాళంవేసి ఎదుటి మేడలో ఉన్న సుందరమ్మగారితో రాచకార్యానికి వెళ్ళింది. సుందరమ్మగారు గదిలో తమలపాకుల ఈనెలు తీసుకుంటోంది. పర్వతవర్ధనమ్మ మధ్యహాల్లో మంచంమీద చతికిలబడింది. అలికిడినిపట్టి సుందరమ్మగారు "ఎవరదీ" అంది. పర్వతవర్ధని "నేనే పిన్నిగారూ" అన్న వెంటనే సుందరమ్మ "పార్వతమ్మా! అక్కడ కూర్చున్నావేం? లోపలికి రా అమ్మా" అంది.



పార్వతి:— మీ పెద్దబ్బాయిగారు ఇంట్లో లేరా? ఇట్లా ఇంటి రెండు సార్లుగా వస్తుంటే ఇళ్ళమ్మటి తిరిగేదాన్నని మగవాళ్ళను కుటా లేచిపోవని సగం చచ్చేటస్తున్నా పిన్నిగారూ! మా అమ్మగారి యింటిదగ్గర గడప కదిలేదాన్ని కాదు. మా నాన్న ఏవో పుస్తకాలూ - పాటలు చదివిస్తూ మా అప్ప చెల్లెళ్ళనీ తమ్ముణ్ణీ ఆడించేదాన్ని. అవ్వాక రోజులు.

అంటూ గదిలో పడకకుర్చీలో కూర్చుంది పార్వతమ్మ. సుందరమ్మ సింహద్వారం తలుపు వేసొచ్చి "ఏమిటమ్మా! అట్లా నీరసంగానూ భారంగానూ మాట్లాడుతున్నావ్. వొచ్చి ఎగిరిందా ఏమిటి? ఒళ్ళుకూడా వెచ్చంగా కనిపిస్తోన్నదే" అని బుగ్గమీద తాకి చూస్తోంది. అట్లా ఆవిడ తల్లిలాగా తన అనారోగ్యాన్ని పరామర్శిస్తున్న సమయంలో పార్వతి పసిపిల్లయిపోయి

భాపురుమంది. కాలికలమ్మటి కన్నీళ్ళు సుందరమ్మగారి చేతిమీద జలజలా రాలినై. సుందరమ్మగారు "ఏమిటమ్మా! ఆ పిచ్చితనం! ఇట్లా బిగలాడితే ఏమవుతుంది చెప్పు? మనుష్య పిల్ల ఎంత చాకచక్యం ధైర్యంతో ఉండాలి! అబ్బే, యిట్లా ఏడుస్తే ఏమన్నా ప్రయోజనమంటుంది?" అంటూ పార్వతి కంటరెప్పలు దగ్గరకొత్తి ఆ కన్నీటి ధారను ఆపజూచింది గాని వశమైనట్టు కనపడలా.

వెంటనే ప్రక్క కుర్చీలో కూర్చున్న పార్వతమ్మని సుందరమ్మగారు తన చేతుల్లోకి తీసుకుని "ఇదిగో! యిట్లా చూడు. నువ్విట్లా యిడ్డైనావంటే బాగుండదు. నీ మనస్సేమిటో! బాధేమిటో! చెప్పు మరి! పిచ్చిపిల్లా. ఇదిగో కాసిని మంచినీళ్లు తాగు" అని గ్లాసుతో నీళ్ళు తీసుకొచ్చి యిచ్చింది సుందరమ్మగారు.

పార్వతమ్మ కళ్ళనీళ్ళు చీర చెంగుతో అద్దుకుంటూ "వద్దు పిన్నిగారూ! నీళ్లుకూడా నోట్లో పోసుకుంటే చేదుగా ఉన్నై. రాత్రి ఒళ్లు పులకరంగా ఉండి తెల్లవారేటప్పటికి పట్టిమించి తెలతెలనంత కొండలపెట్టుగా జ్వరమొచ్చి ఒళ్లు విరగగొట్టినట్టుంది. అప్పటికీ తోసుకు తిరిగే మొండి పీనుగును గాబట్టి లేచి పదిన్నరకల్లా వంటచేసి పెట్టేప్పటికల్లా తలప్రాణం తోకకొచ్చింది. అంత బాధతోనూ చచ్చినట్టు నూతులో నీళ్లు తోడాను. అవ్వయితేగాని వారికి పనికిరావయ్యె. పిన్నిగారూ! నిజంగా ఆడబ్రతుకంత...

సుంద: — పొద్దస్తే ఏదైనా ఆఫీసుపనిమీద వెళ్లి సరిగ్గా భోజనం వేళకొచ్చారు గాబోలు మీవారు?

పార్వతి: — భోజన వేళకు రావటం ఏమిటి? పొద్దుటినుంచీ యింట్లోనే ఉన్నారు.

సుంద: — ఇంట్లో ఉండి నీ అవస్థ చూస్తూకూడా మందో మాకో సంగతి చూడకపోగా స్నానానికి నూతులోంచి తన నీళ్లు తాను తోడుకోలేదుగా? ఎంత సాధుపలవమ్మా! పైకి ఎంతో నమ్రతగా కనుపిస్తాడు?

పార్వతి: — పోనీ మొండి పీనుగలాగా చాకిరి ఎట్లాగో చేస్తా, సుందూ మాకూ కూడా అడగొకూరలేదు. ఒకపూట కళ్లు మూసుకు పడుకుంటే అదే నయమవుతుంది. కానీ..." నీకెట్లా ఉంది? అన్నం సహించక

పోతే పండేమన్నా లేనా? అని అడగకూడదూ? తన నోటి ముత్యాలేమన్నా రాలిపోతయ్యా? నేనూ ఒకమ్మకడుపున పుట్టినదాన్నే, తను కెంత మగవాడైనా?

సుంద:— అడక్కూడదు కానీ, ఏదన్నా కోపాలొచ్చి మాట్లాడుకోటం మానేశారేమిటి?

పార్వతి:— ఏం చెప్పనూ! మీరు నా తల్లిలాగా కనపడుతున్నారు. కడుపులోది దాచలేకుండా ఉన్నాను. అందుకోసమే మీ యింటి చుట్టూ తిరుగుతున్నది.

సుంద:— అమ్మా! పార్వతీ! బంధుత్వం కంటెకూడా స్నేహితం గొప్పది. నీవింకా యిరవయ్యేళ్ళయినా నిండని పాపవు. "తెల్లనివన్నీ పాలూ, నల్లనివన్నీ నీళ్ళూ అనుకునే వయస్సు. నీ కష్టమేమిటో చెప్పు. నీకంటె చాలా లోకానుభవం గడించిన దాన్నిగదా? నీ కష్టానికేమైనా పరిహారముంటే ఆలోచించి సంసారం చక్కగా నడిచే ఉపాయం యోచించుకుందాం.

పార్వతి:— ఏమో! పిన్నిగారూ! సుఖసంసారం ఈ జన్మలో నాకు లేదేమో? మళ్ళీ యింకో తల్లికడుపున పుడితేనేమో చెప్పలేను. అయినా యింకా ఈ పాడు ఆడజన్మె కోరాలి. నాబుద్ధి బుగ్గయినట్టూ?

సుంద:— అట్లా నిస్పృహ పొందకు, మేమంతా ఆడవాళ్ళం గాదూ? ఆడవాళ్ళంతా నువ్వు ఊహించినట్టు కష్టమే పడుతున్నారనుకుంటే ఈ ఆడజాతే భూమిమీద లేకుండా నశించేదేమో.

పార్వతి:— అట్లా అనటం నాది తప్పేగాని, మొదటి భార్యతో తన ఆనందాన్ని, సుఖాన్ని, కష్టాన్ని అనుభవించేసిన మగవాడిని కట్టుకున్న పిల్ల యిహపరాలకు చెడినదని నా నమ్మకం. అట్లా అయింది నా బ్రతుకు.

సుంద:— అమ్మా! నువ్వు చెప్పింది కొంతవరకే నిజము. ప్రేమాతిశయాల్లో అటువంటి స్థితిలోగూడా సంతృప్తితో జీవిత జీవుల్లాగా ఉన్నవారు లేరనగూడదమ్మా... చిన్నపిల్లవు, అనుభవం తక్కువ.

పార్వతి:— "ఏమో! ధన్యులెక్కడన్నా ఉన్నారేమో, కానీ మా నాన్న నాజీవితం నేలపోసిన పాలులాగా చేశారు. రెండో పెళ్ళివాడయితే

లేం, 80 రూపాయలు జీతం తెస్తూ కూర్చున్న సుఖపెడతారనుకొన్నానే కానీ సెలవరోజు వచ్చిందంటే అమలాపురంలో అమ్మగార్ని సేవించబోతాడనీ, గుఱ్ఱపు పందాలకు టెలిగ్రాం మనియార్డర్లు కడుతారనీ, మాత్రం తెలుసుకోలేకపోయాడు. ఇంతకాలమూ యివన్నీ మా నాన్నకు కూడా చెప్పకుండా దాచా, తల్లివంటివారు, ఇక మీతో దాచలేక చెప్తున్నా"నని కళ్ళల్లో నీరు గిర్రున నింపింది.

కుంద:— ఏమిటే! ఇంతకాలమూ చెప్పావు కాదూ! బాబు గంగులోవాడే. ఉండదగని ఆ రెండు లక్షణాలు ఉన్నై. ఇంకా నేనేమిటో .....

పార్వతి:— ఇంకా యేమిటే- నే చెప్పేది కడుపులో ఉంచండి, క్రిందటి నెలలో నీకు ఆగ్రాచీర కొంటానని యింకా ఏమో చెప్పి బాగుచేయింపటానికి పెట్టెలో దాచిన దండకడియం తీసుకెళ్ళారు, ఇంతవరకూ చీరా రాలా, కడియం రాలా. మళ్ళీ ఈ నెలలో జీతానికి జీతము అయింది, ఆ కట్టుడపు దండకు తలపడి తీసుకెళ్ళి బ్యాంకులో పెట్టి డబ్బు తెచ్చుకొని "నాకు 8 వ తేదీకి పట్నంనుంచి వెయ్యి రూపాయలు గుఱ్ఱపు పందాల్లో వస్తుంది. దండ వదిలించి తెస్తూ ఆగ్రా చీరకూడా తెస్తానని చెప్పారు. ఆ 8 వ తేదీవెళ్ళి పదిరోజులయింది. నా గుండె గుభేలుమంటోంది. నేను నాల్గురోజులక్రిందట "దండ పట్టుకొస్తేగాని వీలులేదనీ" పట్టుపట్టి కూర్చుంటే "నీదగ్గర కులస్త్రీకి ఉండాలిసిన లక్షణాలు లేవనీ - భార్య మగనికి తన సర్వస్వం అర్పణ చేయాలనీ - యేమయితే నేం నాలక్ష్మి - దేవత పోబట్టి నావ్యా దాపరించావనీ ఎన్నో తిట్టి 2 రోజులు సెలవపెట్టి అమలాపురం ఆవిడ దగ్గరకెళ్ళి మొన్ననే వచ్చారు. వచ్చిన తరువాత మాటా పలుకూ లేదు. ఏట్లాగండీ, యిక నుయ్యో, గొయ్యో చూసుకోవలసిన యోగం పట్టినట్టుంది.

కుంద:— అమలాపురంలో......

పార్వతి;— భోగమావిడి ఎవరో ఉందట. జీతం వచ్చే తేదీకల్లా "నిన్ను చూడకపోతే చచ్చిపోయేట్లున్నాను. తెల్లవారకట్ట కలలోకొచ్చి తెల్లవారేటప్పటికి వస్తానని చెప్పావు గాబట్టి ప్రాణం నిలుపుకు ఉన్నానని" ఏమిటో పిచ్చి ఉత్తరాలు రాస్తుందది, అది చూసి యీయన

కృంగిపోయి రాత్రి రాత్రి పరుగెడతారు. నేనెంత ఏడుస్తున్నా సరే- నిజంగా పిన్నిగారూ! మా సవతి దేవతా స్త్రీ అండి- ఈ వడతలు మానాలని సరసంగా ప్రయత్నించి చేత కాక తనలో పలకే అగ్నిని ప్రజ్వలింపచేసుకుని 6 మాసాలలో క్షీణించి సతీదేవిలాగా ఆ అగ్నిలో దేహాన్ని ఆహుతి చేసి స్వర్గానికి వెళ్ళింది. ఆ స్థానాన్ని నిర్భాగ్యురాలిని తీసుకున్నానని వెక్కి వెక్కి ఏడ్వటం ప్రారంభించింది పార్వతి.

సుందర; — పార్వతీ! ఇంతవరకూ దాకా దీన్ని దాచిపెట్టావా?

పార్వతి; — ఏం చెయ్యమంటారూ! దిక్కు తెలియదలా. "ఇంటి గుట్టు బయట పెడితే సంసారం తగలడిపోతుందేమోనని భయపడ్డా." మీరు తల్లిలాగా......

ఇంతా వింటున్న సుందరమ్మగారు పెద్ద ఆవేశంతో మహిషాసురమర్దని లాగా అవతారం చెందినది మాయమాగేట్టుగా...... "సరే జరిగిందేదో జరిగింది, నువ్వు శక్తి స్వరూపాన్ని పొందాలి. పురుషుడు తన స్త్రీ తప్పుదోవల్లో పోతుంటే ప్రాణం తియ్యటానికి - తీసుకోటానికీ ఎట్లా సాహసిస్తాడో అట్లాగే తన భర్త తప్పుదోవల్లో నడుస్తుంటే భార్యకూడా అంతవరకూ సిద్ధం కావాలి. సంసారం భార్యాభర్తల యిద్దరిదీని. దానివల్ల వచ్చే మంచి చెడులు - కీర్తి అపకీర్తులు ఇద్దరివీని. తెలిసిందా? ఇక నువ్వు చాముండీ స్వరూపాన్ని ఎత్తాలి- తప్పులేదు. భర్త ప్రపంచకానికి ఎంత ప్రయోజనమో భార్యకూడా అంత ప్రయోజకురాలే. ఈశ్వర సృష్టిలో ఎక్కువ తక్కువలు లేవు. తప్పు జరుగుతున్నప్పుడు తప్పక ప్రతిఘటించాలిసిందే. అది ధర్మం. అట్లా చేయకపోతే అధర్మాన్ని ప్రోత్సహించినట్లు- పాపం వస్తుంది. నీ సంసారాన్ని నువ్వు దిద్దుకోకపోతే ఎవరు దిద్దుతారు! నువ్వు ఇష్టమొచ్చినట్లు సంచరిస్తున్నావనుకో. అతడు నీకోసం ఎంత ఎత్తు ఎత్తుతాడు. ఇప్పుడు నువ్వుకూడా అంత జరపాలి. స్వధర్మరక్షణంలో లజ్జా - భయం వదలాలి. అట్లా భర్తను ప్రతిఘటించడం పతివ్రత లక్షణం కాదనుకోకు. భర్తను ఉత్కృష్టమార్గంలో పెట్టి అతనికి ఇహపరాలకు దారితీసేదే పతివ్రత. ప్రహ్లాదుడు తన తండ్రి అధర్మానికి ఎదురొడ్డిన కాదా భగవదనుగ్రహం పొంది తండ్రికి

చేయించి కృతార్థుణ్ని చేయించలా? ఇది ధర్మాతిక్రమణం గాదు. ధర్మోద్ధరణం. నువ్వు ప్రతిఘటించాలి. నీకు జయం కలుగుతుంది. ఏమంటావ్? అంటూ సుందరమ్మగారు ప్రశ్నించింది.

పర్వతవర్ధని అమ్మవారి ప్రసాదశక్తులలోని బాలశక్తి స్వరూపాన్ని ధరించి ముఖము జేవురించగా "అమ్మా! అట్లాగే నా పాతివ్రత్యాన్ని నిరూపించుకుంటా. అధర్మాన్ని నశింపుచేసి సంసారాన్ని ఉద్ధరించుకుంటా. భయపడను. ఇదిగో గౌరీమాత సాక్షి. నా భర్తను ధర్మపథంలోకి తెచ్చుకునేందుకు ఈ దేహాన్ని వదలటానికైనా సిద్ధంగా ఉంటా"నని చేతులు దండకట్టు కట్టింది.

సుందరమ్మగారు కొంతసేపటికి ఆవేశాన్ని ఉపసంహరించుకుని పార్వతమ్మా! నీ కొచ్చిన భయంలేదు. ధైర్యంతో ఉండు. నేను కాపురానికి వచ్చిన కొత్తలో ఇట్లా జీర్ణించిపోతున్న సంసార మొకటి భార్య ప్రజ్ఞచే ఉద్ధరింపబడి నేటివరకూ స్వర్గతుల్యంగా అనుభవింపబడుతోంది. అది ఎల్లా జరిగిందో చెపుతా"........అదిగో, మీ బాబాయిగారు వచ్చినట్టుంది. నువ్వు 4 గంటలకు రా." అని సుందరమ్మగారు పార్వతిని పంపించింది.

## ౨

సుందరమ్మగారు తన భర్తకి ఏదో ఉపాహారం పెట్టి కొంతసేపు ఇష్టాగోష్ఠి జరిపి మళ్ళీ స్కూలుకి పంపి కాస్సేపు పడుకుంది. సుందరమ్మ భర్త గారు మాష్టరుగిరికి బళ్ళోకి వెళ్ళటం నిరీక్షిస్తూ కూర్చున్న పార్వతమ్మ హుషారుగా సుందరమ్మగారి యింట్లో ప్రవేశించి "పాపం, మీరు పడుకోబోతున్నారు గాబోలు-మీ రేమనుకున్నా సరే నని పరుగెత్తుకొచ్చా"నంది.

సుంద:— ఫరవాలేదులే - నీ గొడవ వింటే నాకు నిద్దరొస్తోందా? అంది.

పార్వతి:— సరేగాని - ఇందాకటిది చెప్పరూ, అంటూ నవ్వింది.

సుంద:— అదే చెప్పబోతున్నా!

నేను కాపురాని కొచ్చిన కొత్తలో మా ఆడబిడ్డ మొగుడు మ్యునిసిపల్ స్కూల్లో మాష్టరుగా ఉండి 60 రూపాయిలు జీతం తెచ్చుకుంటూ ఉండే.

ఇట్లాగే సంచరిస్తూ ఉండేవాడు. మా ఆయన గుఱ్ఱం పందాల జూదంమళ్లే మా ఆడబిడ్డ మగడు క్లబ్‌లో చేరి పేకచిక్కినప్పుడల్లా దంకాపలాస్ పేక జూదం మొదలెట్టాడు. దానితోపాటు ఉత్తర వీధిలో ఓ నాయికను ఉంచాడు. భోంచేసి కూర్కులు కెళ్ళటం, సాయంకాలం అటునించి క్లబ్బుకుచేరి రాత్రి 9 గంటలకు పేకాడటం, ఇంటికొచ్చి అదరాబాదరా భోంచేసి మళ్లీ క్లబ్‌కో అవిడ యింటికో వెళ్ళటం మామూలు చేశాడు.

మా ఆడబిడ్డ అన్నగారితో గోలపెట్టింది. వీరు "ఇదినీకు తగని పనులని" ఎన్నోసార్లు మందలించారు బావమరిదిని. చివరికి "నాయిష్టం వచ్చినట్లు నేచేసుకుంటాను. నీసంసారం జాగ్రత్తగా చూచుకోవే" అనపోట్లాడి వీరితో మాట్లాడటంకూడా మానేశాడు. వీరు అక్కడికీ ఇంకా యితర స్నేహితులతో చెప్పించారు. ప్రయోజనం లేకపోయింది.

దీపావళి పండుగ రోజంతా యింటికే రావటం మాని క్లబ్‌లోను ఆ భోగం దాని యింట్లోనూ గడిపాడు.

"ఇక ఈ బ్రతుకు బ్రతికే కంటే చస్తేమేలు. ఈ పిల్లని నువ్వు పెంచు వదినా!" అంటూ సాయంకాలం 7 గంటలకు మా ఆడబిడ్డ మా యింటి కొచ్చి పిల్లని నా చేతులో పెట్టి యిక తెల్లవారిన తరువాత కనబడనంది.

నేనూ చిన్నదాన్నేగా! నాకూ అవురని ఏడుపొచ్చి వదినా! ఈరాత్రి యిక్కడుండువుగాని గడ్డం పుచ్చుకు బ్రతిమాలా. "ఇట్లా ఎన్నిరాత్రుళ్ళుంట మంటావ్?" అంది అవిడ. నిజానికి అవిడింట్లో అవిడ సుఖంగా ఉండాలిగాని ఇక్కడుండమనటం న్యాయమా? — నేను మాట్లాడలేకపోయాను. నేను చచ్చిపోతానని పట్టుపట్టింది. "చచ్చిపోయి ఏం సాధిస్తా"వని నేను మందలించా. "సరే యిట్లాకాదు. దీనికి తగిన ఉపాయమేదో ఆలోచిద్దా"మంది.

మాకు ఊహాలు ఘటిల్లినా—ఈయనకు ఎవరు చెప్పినా వినకుండా ఎదురు తిరుగుతున్నాడుగదా! ఇక ఈయన అధికార్లతో చెప్పి ఈయన్ని శిక్షింప చేస్తే బాగుంటుందనుకున్నాం. డబ్బు కనపడటంచేత ఇన్ని వేషాలు వేస్తున్నాడు గనుక వీలయితే ఉద్యోగం బర్తరఫు చేయిస్తే దోవకు రావచ్చునంది మా వదిన. సరే యిద్దరం అట్లాచేయటానికి ప్రయత్నం చేద్దామనుకున్నాం.

నాకు ఒక ప్రక్క భయం, ఒకప్రక్క సంతోషం కలిగింది. సరేనని దేవుడిమీదా, ధర్మం మీదా భారం వేశాం.

మ్యునిసిపల్ చైర్మను గారు చాలా మంచి వాడూనూ, పలుకుబడిగలవాడూనూ, దేశీయసంస్థల్లో పాలుగొన్న వాడూనూ. అటువంటివాడు ఈ దుండగాన్ని అరికట్టకలడనుకున్నా. పైగా ఆ చైర్మను మ్యునిసిపాలిటీ మీద సర్వాధికారాలు ఉన్నవాడు కూడాను. సరే ఈ దోవను ప్రయత్నిస్తామని సంకల్పించుకున్నాం. చైరుమను గారిభార్య మంచిదని కూడా చెప్పారు. మరుసటిరోజు పదకొండు గంటలకు ఇద్దరం చైరుమన్ గారి యింటికి బండి మీద వెళ్లాం. ఆయన భార్య చాలా ఉత్తమురాలు. చైర్మన్ గారి కావిడ ద్వితీయనుట. ఇద్దరూ ఎంతో ప్రేమగా ఉంటారుట.

కొంతసేపయిన తరువాత "మేము ఫలానా అని చెప్పి మాష్టరుగారి కథ చెప్పి 'తల్లీ! మా ఆడబిడ్డను మీ దంపతులు రక్షించాలని, నేను ఆవిడ రెండు చేతులూ పట్టుకున్నా". పాపం ఆవిడ "అమ్మాయిలూ! భయపడకండి, మావారి ద్వారా అతన్ని సత్ప్రవర్తనలోకి తెచ్చి ఆ దంపతులకు సుఖం కలిగించేందుకు ప్రయత్నిస్తాను. ఇక మీరు వెళ్ళి ఈ సంగతి బయటికి రానివ్వకండి" అంది. ఆ తల్లి ఏం చేసిందో ఏమిటో, మరుసటిరోజు ప్రొద్దున్నే చైరుమన్ గారి జవాను మా ఆడబిడ్డ గారియిల్లు వెతుక్కుంటూ వచ్చి ఒకచీటీ ఆడబిడ్డ మొగుడికిచ్చి మిమ్మల్ని ఉన్నవారిని ఉన్నట్టు చైర్మన్ గారు రమ్మంటున్నారని చెప్పాడు.

ఆ చీటీ చూసుకొని ఆయన హడావిడిపడి సరాసరి చైర్మన్ గారి యింటికి వెళ్లి వారికి నమస్కారముచేసి నిలబడ్డాడు.

(ఈ పైవిషయం ఇట్లా జరిగిందని చైర్మన్ గారి భార్యా చెప్పింది.)

చైర్మన్ గారు ఆయన్ని ఒకసారి పరకాయించి చూసి 'నీకు జీత మెంతయ్యా?' అని అడిగారు. 'చిత్తం 62 రూపాయలు' అని ఆయన సమాధానమిచ్చాడు. "సరే క్లబ్ పేకాటలో ఫలాసులో పై నెమాత్రం సంపాదిస్తావని చైర్మన్ నిక్కచ్చిగా అడిగారు. "లేదండీ కొందరం సరదాగా సాయంకాలంపూట ఆడుకుంటాం" అన్నాడు. "రాత్రిళ్లు క్లబ్‌లో డబ్బు పందాలను ఆడుతున్నారని నీమీద రిపోర్టువచ్చింది. ఏం చెప్తావు" అన్నాడు. ఎప్పుడన్నా పండగల్లో ఆడుకుంటాం గానీ అదో వృత్తిగానం

డయ్యా" అన్నాడు. వెంటనే చైర్మన్ గారు "జూదమాడుతూ అదో వృత్తి గాదంటావేమిటీ? ఇదిగో నీమీద కొన్ని కంప్లయింట్లు వచ్చినై, ప్రయివేటు కాండక్టుకూడా బాగులేదని నాకు చూపించి బుజువుచేశారు. నేను అవన్నీ కూడా నమ్మాను. నీ సర్వీసు పుస్తకం ఇదిగో. ఇందాకనే తెప్పించా. నీ చెడునడతను గురించి డి. యి. ఓ. కి ప్రయివేటుగా డి. ఓ. వ్రాసి నీ మీద చార్జి వ్రాద్దామనుకుని అయినా నీకు వార్నింగిచ్చి చూద్దాం. బుద్ధిలోకి రావలసిన వాడవని పిలిపించాను. ఏం చెప్పుకుంటావ"ని చైర్మన్ గద్దించాడు. ఇంకేముంది కొంప మునిగిపోయిందని వాడిపోయి మాస్టరుగారు "చిత్తం. ఈ తప్పు క్షమించండయ్యా! ఇకముందు జాగ్రత్తగా ఉంటానండయ్యా" అని మనవి చేసుకున్నాడు. చైర్మన్ పెద్దకోపాన్ని అభినయించి "జాగ్రత్త ఈరోజు మొదలు క్లబ్బులో ధంకాపలాస్ ఆడినట్టుగానీ ఇంకా యగ్జిబిషన్లో జూదమాడినట్టుగానీ ఇక వింటానంటే నిర్దయతో డిస్మిస్ చేయించకపోతే చూడు. మొదటిసారి కాబట్టి క్షమించి వదిలాను. ఇట్లా జూదమాడే మాస్టర్లక్రింద తయారైతే పిల్లలకు మంచి నడవడిక ఎట్లా అబ్బుతుందీ? జాగ్రత్త ఇక వెళ్లు" అని గదిమాడు. మాస్టరు "చిత్తం చిత్తం" మంటూ ఇంటికి దయచేశాడు. ఇంటికొచ్చి ఆయన గడ్డ ఖంగారు చూచి వంటింట్లో మేం మిద్దరం పొట్ట పగిలేట్టు నవ్వుకున్నాం.

మానవుడు ఆరోజు మొదలు 10 రోజులవరకూ స్కూలూ యిల్లూ తప్ప బజారు ముఖంకూడా చూడలా. మంచి శాస్తి చేశారని మావారు మాయిద్దర్నీ మెచ్చుకున్నారు. ఏదో వీలుచేసుకుని చైర్మన్ గారి భార్యతో అన్నీ చెప్పుతూనే ఉన్నాం. ఆవిడ సంతోషిస్తోంది.

ఇట్లా ఉండగా ఒక ఆదివారం పొద్దున్నే ఎవరో నలుగురువచ్చి మా మాస్టరుగార్ని పేకాటకు రమ్మని పిలిచారు. మా మేష్టరుగారు కొంతసేపటికి ఒప్పుకుని "కొన్ని కారణాలచేత క్లబ్బులో ఆడటానికి రాను. ఇంకా ఎక్కడైనా వున్నా అయితే చెప్పమన్నారు" "అట్లాగైతే తాలూకా సుమాస్తా సాంబయ్యగారింట్లో ఆడుకుందాం. వాళ్ళ ఆడవాళ్లు నోములకి పుట్టింటికి వెళ్ళారు. అది వీలుగా ఉంటుందన్నారు. అందరూ బాగుందనుకున్నారు. మాష్టరుగారు అతి సంతోషంగా భోంచేసి 10 రూపాయిల కాగితం

పర్సులో పెట్టుకొని వెళ్లారు. ఆ వెళ్ళటం వెళ్ళటం మరుసటిరోజు ఆవేళ కొచ్చి భోంచేసి మంచాలెక్కారు. నిద్రలేక కళ్లు ఉబ్బి ఉన్నై.

ఆయనట్లా బళ్లోకి వెళ్ళాడు. మేమిట్లా చైర్మనుగారింటికి బండిలో వెళ్లాం. పాపం ఆవిడ కూతుళ్ళని బుజ్జగించినట్లు బుజ్జగించి రోగ క్షేమాలు కనుక్కుంది అంతా అయిన తరువాత మా ఆడబిడ్డ మొగుడు ఆదివారం పేకాటకు ఎంతడబ్బు తీసుకెళ్ళింది, ఏ గుమాస్తా యింటికి వెళ్లిందీ, అన్ని విషయాలూ ఆమెకు చెప్పి వచ్చేశాం.

మంగళవారం పొద్దుటికల్లా మా ఆడబిడ్డగారింటికి చైరుమను జవాను హాజరైనాడు. వాడిని చూసేప్పటికల్లా మా మాస్టరుగారి యాజ్ఞవాలూ కుంగిపోయినై, వాడు "మాస్టరుగారూ! యిదిగో చీటి. వెంటనే అయ్యగారు రమ్మంటున్నారు." అని చెప్పి చీటి యిచ్చాడు. ఆ చీటీ చూచుకుని ఖంగారు పడుతున్నాడు మాస్టరుగారు. మా వదినగారు లోపల నవ్వుకుంటూ వంటింట్లోంచి "ఇదిగో పెసరట్టు వేశా, వేడివేడిగా ఉందం" టోంది. "ఉండవే! యిక పెసరట్టు వేసుకునే ప్రారబ్ధమే పట్టేట్టుంది.- ఈ పూటతో ఉద్యోగం ఆఖరే-దొరేమిటిరా భగవంతుడా!" అనుకుంటూ యింటమ్మడి తిరుగుతున్నాడు. "త్వరగా రండిబాబూ! ఈ పూట అసలే అయ్యగారు నిప్పులుమ్రింగి బొగ్గులు కక్కుతున్నారు. ఆలస్యమైతే నా మీద పడతా"రని జవాను ఖంగారు పెడుతున్నాడు. 'అంత ఖంగారు పడాలిసిన తప్పేం చేశారండీ!' అని మా వదిన వెనకాల ప్రారంభించింది. చివరికి ఒక క్రమానికి బయలుదేరి "అమ్మవారి గుడికి పోయే మేకపోతు లాగ" చైరుమను యింటికి వెళ్లాడు మాస్టరుగారు. చైరుమను "ఏమయ్యా! ఆదివారం రాత్రి పగలూ ఫలాస్ ఆడి ఎంత సంపాయించావేమిటి?" అని అడిగాడు "చిత్తం. లేదండయ్యా! డబ్బులే నాలు సరదాగా కాస్సేపు ఆడుకున్నా"మని నత్తురు నత్తురు మాటూ చెప్పాడు. చైరుమను తన డైరీ తిరగేసి "తాలూకా గుమాస్తా సారథింట్లో కాదూ, ఆడింది? ఇక యింటిదగ్గరనుంచి 10 రూపాయల కాగితం తీసుకెళ్ళ లేదనేగా ఆ వేడి" అంటూ రుద్రుడై అడిగాడు. మాస్టరుగారు వణికిపోయి, పోసిన ముచ్చెమటలు తుడుచుకుంటూ "చిత్తం క్షమించండయ్యా! బుద్ధి పొరపాటు జరిగింది. ఇకముందు ఆడినట్లయితే డిస్మిస్ చేయండి. ఈ తప్పు కాయండని దణ్ణంపెట్టి దయకోసం గుడ్లప్పజెప్పి నిలబడ్డాడు.

చైర్మన్ గారు కళ్లెఱ్ఱచేసి చూచి "ఛీ! నీ చేతిలో డబ్బాట్టం చేతకాక ఇట్లా పాడవుతున్నావ్! నిజంగా నిన్ను డిస్మిస్ చేయించాలిసిందే గాని నీ సంసారం అధోగతవుతుందని ఆలోచిస్తున్నా. అయినప్పటికీ నీ కేరక్టరు బాగుపడేటందుకూ నిన్ను ఉద్యోగంలో ఖాయం చేయకూడదని నోటు వ్రాస్తూ నీకంటే జూనియర్ని ఉద్యోగంలో ఖాయంచేశా. ఇదిగో ఫైలు చూసుకో. ఈ సంవత్సరం ఇంక్రిమెంటుకూడా ఆపాలని చూస్తున్నా. నీకు ఇంత చేసినా బుద్ధివస్తుందని నాకు నమ్మకం లేదు."

మాస్టరుగారు కళ్లనీళ్లు పెట్టి 'అయ్యా! మళ్ళీ ఈమాటు రిపోర్టువచ్చిందాంటే డిస్మిస్ చేయించండి. ఈ తప్పు కాయమని ప్రార్థిస్తున్నా'నని పై ఉత్తరీయంతో కళ్లనీళ్లు తుడుచుకోటం ప్రారంభించాడు. చైర్మన్ "నువ్వు ఇంకా గ్రంథసాంగుడవని విన్నా. అదికూడా యాంక్వయిరీలో ఉంది, ఇటువంటి జూదగాడికి – ముండల ముఠాకోరుకీ మా స్కూలులో తావు లేదు. మాపిల్లలు నీవల్ల పాడవుతారు. నిన్నిప్పుడు డిస్మిసు చేస్తే అందరికీ కూడా భయంగా ఉంటుందని తోస్తోం"దని గద్దించాడు.

మాస్టరుగారు చీకుకుంటూ "ఇక నామీద ఎటువంటి రిపోర్టు వచ్చినా డిస్మిస్ చేయించం"డని మొఱపెట్టుకున్నాడు. కొంతసేపటికి చైర్మన్ గారు "సరే ఈ ఫైలు పైకి పంపటం ఆపి నీ కేరక్టరు ఇంకా చూస్తా! ఈ మాటు ఏదన్నా వచ్చిందా అంటే – ఇక డిస్మిసల్ కే వ్రాస్తా. పిలవనుకూడా పిలవను. జాగ్రత్తగా మసులుకో – వెళ్లిపో" అన్నాడు.

బ్రతుకు జీవుడా అని బైటపడి ఇంటికొచ్చి "ఇదంతా ఆయనకెట్లా తెలుస్తుందో ననుకుని ఇక చెడు స్నేహితాల్ని వదలా" లనుకున్నాడు. "పేకాటలో నష్టమేమన్నా వచ్చిందేమండీ! అట్లా ఖంగారుపడ్డా"రని మా ఆడబిడ్డ అడగటం ప్రారంభించింది.

అంతా ఒకటే పేకాట – పేక ముట్టుకున్నానా అంటే ఉద్యోగం కృష్ణార్పణ మవుతుంది. అలమర్లో పేకలన్నీ తీసి తగల పెట్టమన్నాడు. మా వదిన నవ్వుతూ "నేను నెత్తిన నోరుపెట్టుకుని ఏడ్చి బతిమాలినా నామాటలు లెక్క–లేకపోయినై. చైర్మన్ గారి మాటలు అత్యవసరమైనై. న్యాయం ఎక్కడ ఉందండీ." అని మా వదినగారు సాగబెట్టింది.

ఇవాళ్ల ఉద్యోగం నిలబెట్టుకొనేటప్పటికి బ్రహ్మప్రళయమైపోయింది. ఇక

నువ్వుకూడా నన్ను ఏడిపించకే అన్నాడు. మా వదిన ఓదార్చి నీతులు చెప్పింది. ఇప్పుడైనా సంసారబాధ్యతను గుర్తించమంది.

"ఇక నాలో తప్పు పట్టుకోండి చూద్దాం"మని మాస్టరన్నాడు.

ఆ పట్టుదలమీదనైతేనేం – ఉద్యోగం పోతుందనే భయంచేతనైతేనేం సంవత్సరం సక్రమంగా గడిచింది. మా ఆడబిడ్డ "ఒకరోజున నన్ను మాత్త ఉదయకు పెట్టుకుని 10 రూపాయల చీర కట్టబెట్టి నీ మేలు జన్మలో మరవలేను వదినా!" అంది.

ఆసాయంకాలం చైర్మన్ మా ఆడబిడ్డ మొగుణ్ణి పిలిపించి "నీ కేరక్టరు బాగుపడినట్లు గుర్తించాను – ఇక నిన్ను ఖాయం చేయటానికి వ్రాస్తున్నా– ఇకమీద బుద్ధిమంతుడవు అవుతావని నమ్ముతున్నా" అన్నాడు. ఇంటికి రావడంతో తాళం వేసి ఉంది. అట్లా పార్కుకు వెళ్లి 7 గంటలకొచ్చి "తాళం వేసి ఎక్కడికి వెళ్లా"వని మా ఆడబిడ్డని అడిగాడాయన. "ఇవాళ మీ చైర్మన్ గారి మనవడు పుట్టినరోజు పండుగ – అందుకని వాళ్లు పేరంటానికి పిలిస్తే నేనూ వదినా వెళ్లి పేరంటం చేసివచ్చాం."అంది.

చైర్మన్ గారి భార్య వచ్చి పిలిచిందా! 'మీకూ ఆవిడకు ఎట్లా పరిచయం?' అని నిర్ఘాంతపోయాడు. మా ఆడబిడ్డ చిన్ననవ్వు నవ్వి "ఇప్పటేనింటేం- ఒక సంవత్సరం నుంచి మాకు ఆవిడకు పరిచయం – తల్లికంటె ఎక్కువగా చూస్తుం"దని చెప్పి నవ్వింది.

"అమ్మ దొంగల్లారా! మీరిద్దరూ కలిసి ఎంత నాటకమాడించారూ!" అందుకనే "స్త్రీబుద్ధిః ప్రళయాంతక మన్నారు"అని నిర్ఘాంతపడిపోయాడు. అక్కడనుంచి ఏ పొరపొచ్చా లేకుండా ఇంతవరకు సుఖ సంసారం చేస్తున్నారు.

అట్లాగే నువ్వుకూడా ఏ ఉపాయంతోనో సిద్ధపడాలి. నీ కాపురం బాగుపడుతుంది. చేయగలవా! అని సుందరమ్మ పార్వతమ్మని ప్రశ్నించింది.

పార్వతి:— అట్లాగే పిన్నిగారూ! ఇక తరుణోపాయం చెప్పండంది.

సుంద:— సరే! పొద్దుపోయింది. "మీవారు వచ్చేవేళకూడా అయింది. రేపాలోచిద్దాం. ఇక ఇంటికి వెళ్లమ్మా" అంది.

---

తీసుకు వెళ్లమన్నా వెళతానన్నాడు. ఆచార్యులుగారు వృద్ధవైద్యులుగాబట్టి తమ అనుభవాన్ని జోడించి యితరాహారం ఆపించి మేకపాలు ఇప్పించమని సలహా యిచ్చారు. నాయుడుగారికి వారియందు అభిమానమూ, విశ్వాసం మెండు. కాబట్టి తప్పక అట్లాగే చేస్తా మన్నాడు.

మంచిరోజు చూచి వైద్యం ప్రారంభించారు. 3 నెలల క్రిందట దొడ్లో ఈనిన మేక నొకదాన్ని చూచి దాని పాలు పేరయ్యకు ప్రారంభించినారు. కర్మ పరిపక్వం అయితేనేం, హస్తగుణం అయితేనేం, ఆరోగ్యం కలిగి రోగ నివృత్తి అయింది. పేరయ్య ఆరోగ్యం పొంది, ఏ రోగమూ లేని కుర్రవాడయి కేకిసలాడుతూ దొడ్లమ్మటి దోవలమ్మటి గెంతటం ప్రారంభించాడు. పాలిచ్చి పెంచిందని కాబోలు తల్లిని ప్రేమించినట్టుగానే ఆ తల్లి మేకని ప్రేమించటం ప్రారంభించాడు. ఆ మేకపిల్లా తనూ, ఆ తల్లిమేక, భాగస్వాములన్నట్టు ఆ చిన్నపిల్లవాడు ఆ మేకపిల్లతో ఆడుకుంటాడు. తన పాలలో భాగం తన పిల్లకీ, ఆ పిల్లవాడికీ చెరిసమానంగా ఉంది గాబట్టి ఇద్దరూ తన సంతానమే నన్నట్టు ఆ తల్లిమేక కూడా చూస్తుంది.

దొడ్లో మంచిగడ్డి కనబడితే దానిని ఏరి తీసుకొచ్చి తల్లిమేక నోటి కందిచ్చి పోతాడు పేరన్న. పొద్దున్నే దొడ్లో కనబడటంతోనే "రా! రా! చెంబు తెచ్చుకుని పాలు పిండించుకో, నా మేకపిల్లనుకూడ తీసుకురా!" అన్నట్లు అరుస్తూ గుంజదగ్గర గుంజుకుంటుంది తల్లిమేక.

"అమ్మదగ్గర పాలుతాగేందుకు రా! రా!" అని పేరన్నను కేకేస్తున్నట్టు పొద్దున్నే దొడ్లోనూ, ఇంట్లోనూ అరుచుకుంటూ తిరుగుతుంది మేకపిల్ల. తల్లి తీసిచ్చినపాలు తాను తాగి మేకపిల్ల తాగేవరకూ కూర్చుని దాన్ని ఆడుకునేందుకు తీసుకెళ్ళేవాడు పేరన్న.

పూర్వం తిన్నవాటికంటె రుచిగా ఉండటం చేతనో, తృప్తిగా ఉండటం చేతనో పేరన్న ఆ మేకపాలమీద రుచి మరిగి తల్లి యిచ్చే యితర తినుబండారాన్ని ఏవగించుకోడం ప్రారంభించాడు. పిల్లవాడు దృఢంగానూ చురుగ్గానూ తిరగటం ప్రారంభించాడు.

ఆ మేకపిల్లతో పసులదొడ్లో తిరుగుతూ ఉండే యింకో లేగావుదూడ సహవాసమైంది. దానితోపాటు ఆ దొడ్లో పుట్టిన జాగిలాయికుక్క పిల్లొకటి స్నేహితం కట్టింది.

నాయకుడుగారు ఊరికే మా పెయ్య గొడ్డదొడ్లో పడి కొట్టుకుంటున్నాడనే మాటే తోస్తుంది కాని ఆ నోరులేని పశువులతో నేస్తం కట్టి ఆటలు మరగినట్టు గుర్తించుకోలేక పోయాడు.

ఆడుకొనేందుకు ఇంకా యితర పిల్లలకోసం చూడకుండా తనతోపాటు ఆ దొడ్లో పుట్టిన ఆ పశువుల పిల్లలతో తన ఆటలు సాగించటం ప్రారంభిస్తాడు,

ఆటల్లో ఏమయినా పేరన్న అన్యాయం చేసినట్టు తోచిందా అంటే "నా కొంపుకుంటే 'అన్యాయం పిత్త నాశనం' అవుతుంది లే' అన్నట్టు లేగదూడ ఊరుకునేది గాని మేకపిల్ల మాత్రం ' నీకు తెలుసునా ? నేనసలే పుచ్చె కొంపు బద్దలయినా సరే, కట్టించుకున్నైనా యుద్ధమాడి చావో బ్రతుకో తేల్చుకునేదాన్ని'' అనే ధీరత్వాన్ని చూపిస్తూ వెనుక కాళ్లమీద నిలబడి తల ఒడ్డిగిల పెట్టి పోటీ యిచ్చేటట్టు నిచేది. జాగిలాయి మాత్రం "నువ్వేం చేసినా సరే నేను నీ క్షేమేనన్నట్టు'' తోకాడించుకుంటూ విశ్వాసం చూపేది. చివరకు పేరన్న వాటిని సమాధాన పరచుకొని యింటికి తీసుకొచ్చేవాడు.

వాకిట్లో ఆడుకుంటూ ఆలస్యంగా వస్తే పెద్ద మేక పిల్ల మేక ఒళ్లు నాకుతూ ' రా ! నాయనా ! బజారు దాటిపోకేం '' అని చెప్పినట్లు అరిచేది. పేరన్న యింతలో మేకపిల్లని వెతుక్కుంటూ తల్లి మేక దగ్గరకు వచ్చేవాడు. తల్లి మేక పేరన్ననుకూడా నాకుతూ " దొడ్లోనే ఆడుకోండేం'' అనే భావాన్ని చూపేది. జాగిలాయిపిల్ల తోక ముడిక్రింది కిరికించుకొని వెనక కాళ్ళమీద కూర్చొని దూరంగా ఉండి యిదంతా చూస్తూ ఉండేది.

తల్లి మేక అటు జాగిలాయి వేపు చూస్తూ "నీ వసలే మాంసం తినేదానివి. నీకు ఊరికేనే వినుగూ కోపం వస్తుంది. నా పిల్లలతో ఊరికే ఆడుకోగాని కలబడకేం" అని బ్రతిమాలుతున్నట్టు మెత్తదిగా అరిచేది.

పాలు తాగి మేకపిల్ల ఎగురుకుంటూ తల్లి దగ్గరనుంచి గెంతుకుంటూ బయలుదేరేది. " మా అమ్మ కరవొద్దంది కనుక కరుస్తా - కరుస్తా - నంటూ ఆటకాయి తనానికి మేకపిల్ల కాళ్లు కరుస్తూ జాగిలాయి పరుగెత్తేది. ఇంతలో స్నేహితులకోసం వెతుక్కుంటూ లేగావుదూడవచ్చి కలుసుకునేది. ఈ సంతోషంలో ఇతర స్నేహితు లెవరొచ్చినా వినిపించుకునేవాడే కాదు పేరన్న.

తను ఏం తిన్నా తక్కిన స్నేహితులుకూడా అది తినాలిసిందే. ఈవిధంగా తనకూ, తన దొడ్లో పుట్టిన పశుసంతానానికీ ప్రేమ సంబంధ మేర్పరచుకొని తోటి పిల్లలతో మెలగినట్లు మెలగుతూ, మాటాడినట్లు మాటాడుతూ పది ఏళ్ల అయుష్షు పూర్తి చేసుకున్నాడు పేరన్న.

ఆ స్నేహితుల మధ్యనున్న మైత్రిగాని ప్రేమాతిశయముగాని సీతయ్య నాయుడుగారికిగాని యితరులకుగాని తెలియబడకుండా గూఢంగా సాగి పోతోంది.

౨

సీతయ్య నాయుడుగారి బావమరిది తన కుటుంబంతోసహా ఉత్తరదేశం వెళ్లి టిక్కెట్టుమీద తిరిగి తిరిగి యింటికిపోతూ బావగార్ని చూట్టానికి దిగాడు. వీరికుటుంబం వారి కుటుంబం బహు సరదాగా ఆరోజు గడిపారు. పేరయ్య మేనమామకొడుకు పట్నంలో తాను చూచిన మేడలు, సముద్రం, జంతువులు, వాటిని గురించి పేరన్నతో చెప్పటం ప్రారంభించాడు,

పేరన్న అవన్నీ అప్పుడప్పుడు చూడాలనుకున్నాడు. మా నాన్నతో వెళ్లి అవన్నీ చూస్తానని సంబరాలు పడ్డాడు. నాయుడుగారి బావమరిది కుటుంబానికి ఆ ఊళ్ళో బంధుగు అందరు విందులు చేశారు. పేరన్న యింటిమాట మరచి బంధుగులిళ్ళల్లో విందు లారగిస్తున్నాడు.

సీతయ్యనాయుడుగారు చాకలి బ్రహ్మణ్ణి పిలిచి "ఒరేయ్! నువ్వూ వీరడూ కలసి దొడ్లో కరి ఏటని తియ్యండిరా - యివాళ్ల విందులో పులావ్ చేయించాలని" చెప్పాడు.

ప్రక్కయింటి ఆసామి "ఒరేయ్! నీకడుపు కాలా! ఆ బర్రెను అట్లా కొట్టి చంపకురా" అని పాలేరాడిమీద కసురుకుంటున్నాడు.

"నీ మొండలారా! రారా!" అని వీరడు బ్రహ్మణ్ణి పిలిచాడు.

మేకని దొడ్లోకి పిడకల గుడిసె వేపుకు తీసుకు వెళ్లారు. వాగిలాయి ఎందుకబ్బా మా మేకని యిట్లా తీసుకెళుతున్నారని దానివెంట వెళ్ళింది. దొడ్లోంచి గిత్తదూడ యిదంతా చూడొచ్చింది.

ఏటని క్రిందపడేసి వీరడు మీదెక్కి కూర్చున్నాడు. బ్రహ్మడు చుర

కత్తిరించి తాటాకులమీద పెట్టాడు. "చూస్తారేం! పేరన్నను పిలుచుకు రండిరా!" అన్నట్టు మేక అరుపు పెట్టింది.

"పేరన్న ఎక్కడ? పేరన్న ఎక్కడ?— అంటూ జాగిలాయి బజార్లమ్మట పడింది." పేరన్నో! పేరన్నో! అని మేక అరుస్తుంటే వీరడు మేక పినికి పట్టుకున్నాడు. 'బాబో! ఇది నేను చూడలేను. నాయనో' అని అవుదూడ చంగున పరుగెత్తుకుపోయి తల్లికడుపులో దాక్కుంది.

ఒక్క క్షణంలో రేటు తల దాని మొండెం నుంచి బ్రిహ్మడు విడదీశాడు. వేడిరక్తం క్రింద పరిచిన పచ్చి తాటాకుమీద ప్రవహించింది. మొండెం నెత్తుర్లో దొర్లింది. ఎవర్రా! మిమ్మల్నీపని చేయమందీ? వాడి కుటుంబ నాశనం చేస్తానని శపథం త్రించు కున్నట్లు గుడ్లు పెద్దవిచేసి నాలిక చాచి వీరడివంక చూస్తున్నట్టుంది ఆ తలకాయి.

జాగిలాయి పోయి చెప్పిందిలాగుంది. ఆతల్లి మేక 'నాయనా! నాకడుపులోని నీచేతులు రక్తసిక్తం చేసుకున్నావా! నువ్వూ గొడ్డుమోతువు కావే-కడుపులోపి ఎరగవూ - ఒక క్షణమైన తుచ్ఛపు ఆకలి తృప్తికోసం నా కడుపులో చిచ్చు పెడతావా? నా ఉసురు తగల్లా - దున్నపోతుల్లాగా యిద్దరు మీ దెక్కి నా తల్లి నిండుప్రాణం తీస్తారా? మీబిడ్డను కూడా యెవరన్నా అట్లా కోసుకతింటే అప్పుడు నా బాధ తెలుస్తుందేమో మీకు" అని తల్లి మేక శాపనార్థాలు మొదలు పెట్టినట్లు అరుపులు ప్రారంభించింది.

3

పులావ్ బలే కమ్మగా ఉంది. కైమా ఉండలు కరకరలాడుతూ కమ్మగా ఉన్నై. పేరన్నకూ అతని బావమరదికీ వాళ్ళమ్మ తలా నాలుగు ఉండలూ చేతిలో పెట్టింది. బావమరది ఒక్క వాయిలో నాల్గు నమిలేశాడు. జాగిలాయి "ఛీ-ఛీ మీ స్నేహితం పట్టకూడదు. మీరు రాక్షసిజాతిలో చేరినవాళ్ళ"న్నట్టు దూరంగా కూర్చుంది.

పేరన్నకు ఏదో వెగటువాసన కొట్టింది. జాగిలాయిని పిలిచి ఒక ఉండ క్రింద పడేశాడు. "అందులో మన మేకమాంసం పెట్టారు. అది తెలియక నువ్వు తినగలుగు తున్నావు గాని నే నెట్లా తినగలను దేముడో!" అని

మోర ఆకాశంవేపు ఎత్తి ఏడుస్తూ కూర్చుంది జాగిలాయి. బావమరది గబుక్కున ఆ ఉండతీసి నోట్లో వేసుకున్నాడు. "నాకు సయించట్లేదు ఇదికూడా తిన"మని తక్కినవికూడా పెట్టేశాడు పేరన్న.

## ౪

బుడ్డకమతగాడు గొడ్లపాకలోకి వెడుతూ పేరన్న ముందు నిలబడి "నాకు కూడా ఒక ఉండపెట్టవా!" అని అడిగాడు. పేరన్న నెమ్మదిగా బావమరది చేతిలోవి తీసి ఒకటిపెట్టాడు.

బుడ్డకమతగాడు నోట్లో వేసుకుని "బలేకమ్మగా ఉంది. నువ్వేతినవేం — ఇందాక మనదొడ్లో కరిమేకని కోశారు నువ్వు చూశావా!" అని చెప్పి వెళుతున్నాడు. పేరన్న అరుగుమీద నుంచి ఒక్కదూకుదూకి "కరిమేకని కోశారా? ఎందుకు కోశారూ? ఎక్కడో చూపించరా!" అని బుడ్డాడిని పట్టుకుని వణికిపోయాడు పేరన్న.

జాగిలాయి "మెంకోర్రి దొడ్లో కోశారా?" అంటూ ఏడుస్తూ వగ్గంకొచ్చి దొడ్లోకి దోవతీసింది.

తల్లి మేక "పొద్దుటినుంచి ఎక్కడ ఏడుస్తున్నా! ఇప్పుడు దొడ్లోకివెళ్ళి మాత్రం ఏంచూస్తా? కొమ్ములూ, గిట్టలూనూ? నా తల్లి ఇప్పటికి మీవాళ్ళ కడుపులోపడి జీర్ణంకూడా అవుతుంటేను" నంటూ ఏడుస్తూ అరిచింది.

సరాసరి జాగిలాయి పిడకల గుడిశ దగ్గరకుపోయి అగి భోరున ఏడిచి మేక కాలిగిట్టల్ని తాటాకులోంచి బయిటికి లాగింది. ఆవుదూడ 'అక్కడికు రాకూడదుబాబూ! కిందపడేసి పెండకాయి కోస్తారని మొండిగోడ దగ్గరనుంచి తొంగి చూస్తోంది.

పేరన్న తాటాకుమీద ప్రవహించిన నెత్తుర మడుగునూ భూమిమీద ప్రవహించిన రక్తపు కొల్లునూ చూశాడు. ఆ నాల్గుగిట్టల్నీ చేతిలో పట్టుకుని అస్థికలు నదిలో కలపటానికి వెళుతున్న పితృబంధువులాగా యింటివేపు బయలుదేరా డా కుర్రవాడు.

ఏదో అనుభవించినట్టు ఒణికిపోతూ అడుగులు తడబడుతూ నడిచాడు. జాగిలాయీ — బుడ్డాడు, పేరన్న పడిపోకుండా అదుముకుంటూ తలవాకిట్లోకి తీసుకొచ్చారు.

సీతయ్య నాయుడుగారు బంధుగుల్ని పంపించివస్తూ అప్పుడే గుమ్మంలో కాలు పెట్టాడు. తండ్రిని చూస్తూ పేరయ్య బావురుమని ఏడుస్తూ "నాన్నా! మన కరిమేక తల కాయి కాళ్లు ఎందుకు కోయించావ్?" ఏంచేసింది? అని ఏడ్చి చేతిలోఉన్న గిట్టలవంక చూట్టం మొదలెట్టాడు. చివరకు వెర్రి చూపులోకి దిగింది. క్షణంలో దుఃఖం మహాసముద్రంలోని కెరటంలాగా పొంగి వాలుకట్టి ముంచి ఉక్కిరి బిక్కిరిచేసి స్పృహ తప్పించి క్రిందపడేసి స్వప్నావస్థలోకి తీసుకెళ్ళింది.

నాయుడుగారు గొల్లున ఏడ్చి "వారా! నీరా! రండ్రా! కొంప పోతోం"దని ఏడ్చి, పేరన్నని బుజాన వేసుకున్నారు. నిమిషంలో అందరూ పోగైనారు. తల్లి ఓయమ్మా బాదుకుంటూ నాయనా! నాయనా! అని ఏడుస్తూ చెవులు మూసింది. బంధుగులందరూ చేరి మొఖాన నీళ్లు చల్లి శీతలోపచారాలు చేశారు.

పేరన్న చేతిలో గిట్టలు బిగిసిపోయినై. బలవంతాన తీస్తే వేళ్లు విరిగి పోతాయేమోనని భయపడ్డారు.

నాయుడుగారు ఆచార్యులుగారిని పిలిచి "నా తండ్రిని బ్రతికించి నా కొంప నిలపండి బాబుగారూ!" అని కాళ్ళు పట్టుకుని ఏడ్చాడు. ఆచార్యులుగారు నిమిషంలో పుట్టుకొచ్చిన ఆ అస్వస్థతకు కారణం మానసిక మని గ్రహించారు. ఆ కుర్రవాడి సునిశిత మానసిక శక్తికి ఆశ్చర్య పోయినాడు. తడిగుడ్డ నుదిటిమీద కప్పి "యింకే చికిత్సా అవసరం లేదన్నాడు."

ప్రదోషకాల మైంది. వాతపు ఘడియలు వచ్చినై అన్నారు. పేరన్న ఆ ప్రక్కనుంచి ఈ ప్రక్కకు పొర్లాడు. తల్లీ బంధుగులు యావన్మందీ చుట్టూ కూర్చుని ఉన్నారు. నాయుడుగారు "నాయనా! పేరన్నా!" అనిపలకరించాడు. పేరన్న మైకంచూపు చూస్తూ "నాన్నా! కరిమేకను చంపావా? జాగిలాన్నికూడా చంపుతావా" అని ప్రలాపం ప్రారంభించాడు. "ఎందుకూ నన్నుపిలుస్తున్నడూ? పేరన్న కట్లా ఉండని" జాగిలాయి అంతరిక్షంగా చూస్తూ మంచంచుట్టూ తిరుగుతోంది. పేరన్న కలవరింత నాయుడుగారి గుండెల్లో పొడుచుకుని "బాబో! ఘోరంచేశా — ఘోరం చేశా"నని- మనస్సాక్షి గోలపెట్టి కళ్ళమ్మటనీరు కార్చటం ప్రారంభించింది. ఆచార్యులుగారు తల్లిమేకని తెప్పించి "ఇదిగో మేక, నాయనా! బుడ్డాడు

గటుపుమీంచితోలు కొచ్చాడని" చెప్పించాడు. తల్లిమేక "నా కడుపుకాలి చేనుంటే నీబిడ్డ ఏమయితే నాకెందుకన్నట్టు" నెమరువేయకుండా ఎటూ చూడకుండా మొద్దులాగా నిలబడింది.

"బాబో! దీన్నికూడా కోస్తారేమో"నని అప్పుడాడ అరుగుమీద్ది అరుగు మీంచి తల్లిదగ్గరకు పరుగెత్తింది.

పేరన్న "ఏదీమేక" అని మంచం తడిమి "అమ్మో! పొట్టలోవుంది - కొమ్ములతో పొడుస్తోంది — అమ్మ కడుపునొప్పే" అని ఏడవటం ప్రారంభించాడు. తల్లి ఆమాటలు వింటూ కడుపు చెఱువు చేసుకుంటోంది. బంధుగుల్లో ఎవరో యింకో డాక్టర్ని తీసుకొచ్చారు. ఆ వచ్చిన డాక్టరు "కుర్రవాడు ఇట్లా ఎడా తెఱిపి లేకుండా ఏడుస్తుంటే హృదయం దెబ్బ తింటుంది. మత్తువచ్చి ఏడవకుండా ఉండేట్టు యింజక్షన్ ఇస్తున్నా"నని "బ్రొమాయిడ్ యింజక్షన్ ఒకటి యిచ్చాడు."

"మానసికమైన ఈ రోగానికి దైహిక చికిత్స అయిన యీ యింజక్షన్ ఏం చేస్తుం"దని ఆచార్యులుగారడిగారు ఆ డాక్టరుగార్ని. "మీకు వాటి విషయం తెలియదు - ఇటువంటప్పుడు ఇంజక్షన్ ఇచ్చితీరా"లన్నాడు డాక్టరు.

విషౌషధ ప్రయోగాల్తో పేరన్న శరీరం లోపలా బయటా బిరుసెక్కింది. మరునాటి ప్రదోష కాలం వఱకూ పేరన్న దేహం చైతన్య రహితంగా పడి ఉంది. వాతపు ఘడియల్లో గొణుగుమాట పుట్టింది. ఆ గొణుగుడులో "నాన్నా! చూడు మేక పొడుస్తూ 'నన్ను మీ నాన్న చంపాడు. నేను నిన్ను చంపుతా'నంటోంది. అడుగునేందుకు ఎక్కడికో రమ్మంటోంది. వెళుతున్నా, వెళుతున్నా"నని ప్రారంభించాడు.

పైనకప్పిన బట్టలు పీకేసుకుంటూ లేవబోతున్నాడు. గుణం పుట్టిందని గుసగుసలాడుతున్నారు.

పేరన్నకి ఒక్కసారి తెలివివచ్చింది. అది చావు తెలివన్నారు. "నాన్నా!" అని పిలిచి "ఇంకా జాగిలాన్నికూడా చంపమనకే, వాళ్ళమ్మ ఏడుస్తుందీ" అన్నాడు. నాయుడు ముఖాన గుడ్డ అడ్డం పెట్టుకుని బావురుమన్నాడు. తల్లిని పిలిచాడు పేరన్న. "అమ్మా! ఏడవ"కన్నాడు.

తొంగి చూస్తూన్న జాగిలాయిని దగ్గరకు రమ్మనిపిలిచాడు. జాగిలం పేరన్న ముఖములో ముఖం పెట్టి కళ్లల్లో చూస్తోంది. కుర్రవాడు దానిమెడమీద చెయ్యివేసి "అమ్మా!" అని పిలిచి విశాల విశ్వంలో శ్వాసలు కలిపేశాడు.

"నా బిడ్డని మింగేశానరో!" అంటూ నాయుడుగారు నెత్తి బాదుకుంటూ క్రిందపడిపోయాడు. జాగిలాయి పేరన్న భౌతిక శరీరాన్ని ఊరి వెలుపటి వరకూ సాగనంపి మళ్ళీ ఊళ్లో కనపడలేదుట.

మాకాకా! ఎటువంటి ప్రాణత్యాగం జరిగిందో. ప్రాణం ప్రాణాన్ని మారుగోరిందట.

---

# 6. పెనిమిటా - పిశాచమా?



## ౧

"నే నింతవరకూ ఇటువంటి సంగతులు చదవటం వినటమే కలిగిందిగాని ఇప్పుడు ప్రత్యక్షంగా చూడటం కూడా సంభవించిందని అసలు నువ్వా పిల్లను చూచావా?" అన్నాడు మా రాముడు, "అదేమిటీ! నేను మన దేముడి కల్యాణాలకొచ్చినప్పుడు ఆ అమ్మాయి యిక్కడే ఉందిగా! ఆ అమ్మాయి కూతురుకూడా బాబా! బాబా! అంటూ నాదగ్గరకొచ్చి ఒక పూట నాతో అన్నం తిన్నదికూడాను" అన్నాడు రామమూర్తి

"ఔనుగా! నువ్వు వచ్చినప్పుడు ఆపిల్ల యిక్కడే ఉందిగా" అన్నాడు కాముడు. "పవళింపు సేవప్పుడు పాటలుకూడా పాడింది. కంఠం చాలా శ్రావ్యంగాకూడా ఉంది" అన్నాడు మూర్తి.

"హృదయం కూడా చాలా మృదువైంది. ఆ అమ్మాయి సంగీతం చెప్పుకుందిట— నీ కెందుకీ పాట? భోగం పిల్లలాగా" అని చలమయ్య అనేప్పటికి ఆరోజునుంచే సంగీతం మానేసి ఒక్క గీతంకూడా నోటినుంచి రానియ్యనని ఒట్టుపెట్టుకుందిట. అమ్మ ఒక పాట పాడమ్మా అంటే ఈ నియమం కొత పాడనన్నదిట. దానిమీద అమ్మ భగవద్విషయాల్లో ఈ నియమం పాటించక; ఇతర కార్యాల్లో మానేద్దువుగాని బుజ్జగించి పాడించింది. ఆ అమ్మాయి ఈశ్వరుడిమీద ఒక కృతిపాడి కళ్ళనీళ్లు పెట్టిందని అమ్మ చెప్పిందన్నాడు కాముడు.

మూర్తి:— ఆ అమ్మాయి కాపురానికొచ్చి నాలుగు ఏళ్ళయింది కాదూ?

కాముడు:— ఔను. వాళ్లు ఈ ఊరు వచ్చినప్పుడే ఆ అమ్మాయిని తీసుకొచ్చారు. వచ్చిన వెంటనే గర్భిణివచ్చి ఆ ఆడపిల్ల పుట్టింది.

మూర్తి:— చలమయ్య మంచివాడి లాగానే కనుపిస్తాడే.

కాముడు:— దరిద్రుడు. ఆ భార్యకు తప్ప అందరికీ మంచివాడే. ఇచ్చకాలవాడు.

మూర్తి:— ఆపిల్ల పేరేమిటి? మరచిపోయాను.

కాముడు:— సతీదేవిట. సత్తెమ్మ - సత్యవతి అనికూడా పిలుస్తున్నారు. ఆ అమ్మాయి చాలా గుణవంతురాలు. ఒకసారి మన చెల్లెలులాగా నాన్నదగ్గర కూర్చుని మాట్లాడుతూ ఉంటే నీ కా ముసలాయన కావలసి వచ్చాడేం, అని లోపలికి పిలిచి కొట్టాడుట చలమయ్య. ఆ చేష్టలకు అమ్మకు కోపమొత్తి వాడిని పదిమందిలో పెట్టటానికి సిద్ధమయింది. కాని నేనే ఆపాను.

మూర్తి:— అయితే ఆపిల్ల సౌజన్యానికి వాడి మూర్ఖత్వానికి దుఃఖదాంపత్యమయి ఉంటుంది.

కాముడు:— ఇది ఈశ్వర మాయ ఏమో! మంచి నమ్రతగా ఉంటాడు మొగుడు. గయ్యాళిగా ఉంటుంది భార్య; అందంగా ఉంటుంది భార్య. కునిష్ఠిగా ఉంటాడు భర్త; చలాకీగా ఉంటాడు మగడు.

మట్టాగా ఉంటుంది భార్య; దయా, సత్యశాంతాలతో ఉంటాడు పురుషుడు. నిర్దయా, అధర్మంతో ఉంటుంది అతని స్త్రీ; ఇట్లా మనం ఇద్దరిలోనూ వ్యతిరేక గుణాలు కలవారిని చాలామందిని జూడ వచ్చుననుకుంటా.

మూర్తి:— తమ్ముడూ! పూర్తిగా ఇదంతా ఈశ్వరుడిమీదా, మాయ మీదా నెట్టెయ్యబోక. మనిషి స్వభావాలే చాలావరకు కారణం. తన భార్యయొక్క మంచి గుణాన్ని భర్త గుర్తించలేడు. దానికి కారణం ఆ అమ్మాయి తనకు భార్య అయి యుండటమే. భర్తయొక్క మంచి తనాన్ని భార్య గుర్తించదు దానికి కారణం అతనుమగడై యుండటమే. భార్యలో సరసగుణం ఎక్కువగా ఉంటే, దాన్ని అనుసరిస్తే తాను లొంగిపోతానేమోనని తనలో అరసికత్వాన్ని వృద్ధిచేసి భార్యతో పోటీచేస్తాడు. భర్త ధర్మపరుడైతే భార్య తనలో అధర్మాన్ని లేవ దీస్తుంది. ఇవన్నీ మనం నాటకాలద్వారా చూడటల్లా? మంచి నీతి మంతురాలైన భార్యను చిన్నచూపుచూచి వేశ్యతో స్వర్గం కడతా డొక పండితుడు. నాటకాంతంలో నువ్వు నాకు భార్యవయి యుండటం చేతనే నీ సుగుణం నేను చూడటం లేదంటాడు.

కాముడు:— చలమయ్యకూడా మనం చెప్పకో తగినంత దుర్మార్గుడు కాదు.

మూర్తి:— సత్యవతికూడా అంత అవిధేయురాలు కాదేమో!

కాముడు:— అయితే వారిద్దరికీ ఇట్టి ప్రారబ్ధం కలిగిందేం?

మూర్తి:— మొదటిది వారిద్దరూ భార్యా భర్తలయి యుండటం చేతనూ, రెండవది పైవాళ్ళవల్లనూ. వేయిపడగలు చదివావుగా! అరుంధతి మొదటి దినాల్లో చర్య — అరుంధతికి తన భర్తమీద వైముఖ్యం రేకెత్తించారు పైవాళ్లు. తన కాపురాన్ని అంగంలోంచి లేవనెత్తి స్వర్గం చేసుకున్నాడు ధర్మారావు. అట్లాగే పురుషుడు తన సత్తాతో సంసారాన్ని సుఖవంతం చేసుకోవాలి.

కాముడు:— చలమయ్య తన చేతిలో ఉన్న నూర్లు కాస్తా తగలేసు కుని బస్తీకెక్కి నాటకాల్లో జొరబడి తాను నిరసించిన భోగం పిల్లను చేతికింద వేసికొని సావిత్రి నాటకం మాడాడు. మంచి పేరు సంపాదించాడు వేషాల్లో — క్రమేణా చెడుతున్నాడు గుణాలలో.

ఒకరోజు సత్తెమ్మ "మీరు బోగం పిల్లలతో కలిసి సావిత్రి నాటకం వేస్తున్నారే! నే నా బోగం పిల్లలకు పాటలో ఏం తగ్గిపోతాను? నాకు సావిత్రివేషం ఇచ్చి మీరు సత్యవంతుడు వేస్తే వాళ్ళకంటే బాగానటించ గలనే" అని అడిగిందిట. చలమయ్య నోరు మెదల్చలేక రెండు తిట్టి ఊరుకున్నాడట.

మూర్తి:— నిజమే. తనభర్త అట్లా నాటకాల్లో తిరిగి బోగం వాళ్ళతో నేస్తం కడితే ఏ భార్య సహించగలదు? ఆ పిల్ల మంచి సలహా యిచ్చింది. అట్లా చేస్తే ఈ పాటికి ఎంతో ధనం, కీర్తి సంపాయించే వాళ్ళు. మొగుడూ పెళ్ళాంకి సత్యవంతుడూ సావిత్రి వేస్తున్నారంటే ఎంతోమంది వచ్చి చూస్తారు గూడాను.

కాముడు:— ఒకసారి చింతామణి వేశారు. చలమయ్య బిల్వమంగళుడు, తెనాలి బోగంది చింతామణి. నాటకం చాలా బాగుంది. సత్యవతికూడా వెళ్ళి చూచింది. చలమయ్య ఇంటికి రావటంతోనే "తమరు నాటకాలం వేసి అందరికీ నీతి బోధించటానికే గాబోలునే! తమకా నీతులుం పనికిరావుగా మున్న? మీరు అభినయించిన ఆ బిల్వమంగళుడు ఎట్లా వేశ్యా మోహంలోపడి చెడ్డాడో చూపించారుగా. మన కథంతా కూడా అట్లాగే జరిపించాలనుకుంటున్నారా? ఇదంతా నా హృదయ వేదనతో వచ్చే మాటలుగా అడుగుతున్నా"నంది. చలమయ్య సమాధానం చెప్పలేక రెండు తన్ని రెండు రోజులు ఇంటికిరాలా.

నాటకాలు వెనకపడినై. తన దుర్గుణాలు తనభార్య చూపటంచేత తన భార్య సద్గుణాలు దుర్గుణాలుగా తాను ఎన్నుతున్నాడు చలమయ్య. అత నేది అన్నా ఆ అమ్మాయి ఊరుకుంటే - వాగి వాగి వాడే ఊరుకుంటా డులే అని మొండితనం వహించిం దనుకుంటున్నాడు. ప్రతి మాటలోనూ, అపార్థం స్ఫురింప చేసుకుంటాడు. "రండీ! ఇక భోంచేద్దురుగానీ" అంటే 'ఇంకేముందీ మింగి ఊరుమీదికి పోదువుగానీ' అని ఎక్కిరిస్తోంది అను కుంటాడు. "ఈ అణాపెట్టి పూలు తెచ్చిపెట్ట"మంటే "నువ్వు తెచ్చి ఇయ్యకపోయినా నా డబ్బుతోనైనా తెచ్చివ్వ మంటూంది" అను కుంటాడు.

సత్తెమ్మ పెళ్ళికాలమందు 200 రూపాయలు నగలను చదివించారు.

మేనత్త పెంచిన మోహంతో తన మనోవృత్తి డబ్బులోంచి 600 రూపాయలు ఇచ్చింది. ఆ సొమ్మంతా యిప్పటికి 12, 13 వందలయింది. చలమయ్య మాటలకూ చేష్టలకూ విసిగి సత్తెమ్మ ఏదన్నా ఒకటి అన్నదా అంతే "ఔనులే డబ్బుగలదాన్నని నీకు అహం, నీకు మగడంటే ఏదో సమానం" అని నిందించేవాడు. "నాకు ఏ కోశానా అటువంటి తలంపే లేదు. నన్నట్లా నిందించటం ఎందుకని" సత్తెమ్మ దుఃఖించేది. చిన్న పిల్లయినా మంచి శాంతిప్రదాయకురాలు.

ఈవిధంగా ఆదంపతులమధ్య చినికి చినికి పెద్ద వానయి చిన్న పిల్లకాలవగా ఏర్పడి చివరకు అద్దరీ యిద్దరీ ఒరసిన ఒక సెలఏరయింది. చలమయ్య మేనమామ దానికి వాటం ఏర్పరిచాడు. చలమయ్యను తన యింట్లో ఉంచుకున్నాడు గనుక ఇట్లా చెయ్యి, అట్లా చెయ్యి అని ప్రోత్సాహిస్తాడు. దగ్గర ఉన్న బస్తీలో మంచి స్థలం కొని అందులో పాక వేసుకొని ఉందాం. గనుక నీ పెళ్ళాం నగలసొమ్ము తెమ్మని ప్రోత్సహించాడు, కొంతవఱకు వివేకంగల చలమయ్య మనం నగలకిచ్చింది కొద్దేనాయె. దానికిగాను 14 వందలూ ఎట్లా తెమ్మంటావని అడిగాడు. "నీ పెళ్ళాంపేర ఉంటే నీది కాకపోతుందా? నీ భార్యమీద హక్కున్న పురుషుడు దాని డబ్బుమీద మాత్రం నీకు హక్కులేదా? ఆ సొమ్ము మనమేమన్నా దుర్వినియోగం చేస్తున్నాం గనకనా? తీసుకురమ్మని ఒత్తాసిచ్చాడు.

'నే నింతవఱకు నాటకాల్లో తిరిగి పొలం పాడుచేశానని వాళ్ళకు గుర్రుగా ఉంటే పైగా ఆ డబ్బుకూడా యిస్తారా? ఇది సార్థకం లేని ప్రయత్నం' అని కాళ్ళు చాచాడు చలమయ్య.

'వెంగళప్పులాగ పుట్టి ఈ పని - అందులోనూ భార్యద్వారా - చేసికోలేని జన్మ వృథావృథా' అని మేనమామ నిప్పు పెట్టాడు. ఇక చలమయ్య మొండి బండపట్టుపట్టి భార్యతోనూ - అత్తగారితోను యుద్ధానికి సిద్ధమవాలని నిశ్చయించాడు. అత్తగారు ఒక రణపెంకి అని తెలిసికూడా.

ఒకరోజు మధ్యాహ్నం - తన పెళ్ళాం గనక "ఆ డబ్బు తేనియ్యనూ" అంటే వళ్ళు పగలగొట్టాలనే సన్నాహంతో పేపబెత్తం మంచంక్రింద పెట్టుకుని సత్తెమ్మని యిట్లా రమ్మని గదిలోకి పిలిచాడు. సత్తెమ్మ నవ్వు

అంటూ పిల్లని చంక నేసుకుని "ఉండమ్మా! యివ్వాళ్లేదో కాలానికి విపరీతం పుట్టింది. పోయొద్దాంరావే" అంటూ గదిలోకి వచ్చింది. వస్తూ "మీ నాన్న గారెందుకో యిన్నిరోజులమట్టీ మూతి బిగించుక కూర్చున్నారు గాని కారణమేమిటో నువ్వన్నా అడుగమ్మా" అంటూ లోపలికి వచ్చింది.

చలమయ్య తన భార్యయొక్క సుహృదయాన్ని - నవ్వు ముఖాన్ని చూచేప్పటికి తనలోని విషపుతనాన్ని కప్పుకోలేక నవ్వాడు. సత్యవతి వెంటనే "ఎందుకో ఆ దొంగనవ్వులు, నవ్వటం అడుగమ్మా" అని పిల్ల మీద పెట్టింది.

"సరే లే! నీ వేషాలు కట్టిపెట్టి నే నడిగేదానికి ఔనో - కాదో ఒక్క మాటలో చెప్పు. సోది పనికిరా"దన్నాడు చలమయ్య.

"నేను వేషాలు కట్టిపెట్టట మేమిటి? ఇంతవరకు నే వేమన్నా వేషాలు వేశాను గనుకనా, ఇప్పుడు కట్టిపెట్టటానికి? ఈ దొంగవేషపుమాట లేమిటో కనుక్కో అమ్మా" అని పిల్లని తండ్రి వేపుకు తిప్పింది.

పిల్ల సమయానికి వచ్చీరాని మాటల్తో తువ్ తువ్ అంది. "ఏడిచావు, నోరు ముయ్యండని" నవ్వుముఖంతో ఇద్దరినీ అదమాయించాడు చలమయ్య. చిన్నపిల్ల గావురుమంది. పిల్లని ఓదార్చుకుంటూ లేనికోపం అభినయించి "ఏమిటది? నోరెరుగని పిల్ల నట్లా గదమాయించటం - ఏదయినా నీను రిహార్సల్సు చేసుకునేందుకు మమ్మల్ని పిలిపించారా ఏమిటి!" అంది సత్తెమ్మ నవ్వుతూ. చలమయ్య - 'అక్కడితో ఆగు! నే నొకమాట అడుగుతా. సోది పెట్టక. ఔనో - కాదో ఒక్కమాటలో సమాధాన మియ్య'మన్నాడు.

"ఆ! అట్లాగే! మీరూ! ఒక్కటేమాట అడగాలి, నేనూ అట్లాగే సమాధానం చెప్పాలి" అని ఊరుకుంది.

"ఏడిచావు కానీ! నీ పేర వడ్డీకి తిరుగుతున్న నీరూపాయిలు తీసుకువస్తావా? రావా? దానితో పనుంది" అని లోపల సిగ్గుపడుతున్నా పైకి మొండిగా అడిగాడు. సత్యవతి నివ్వెరపోయి ఏమో ఆలోచనలోపడి చివరకు "ఏం పనేమిటి?" అని అడిగింది. చలమయ్య అటుముఖం పెట్టుకుని బస్తీలో స్థలం కొనాలన్నాడు.

"ఒక్క స్థలమేనా - ఇల్లుకూడా వేస్తారా?" అంది సత్తెమ్మ. ఆమాటలో తన్ను అవమానిస్తోందని ఎంచి చలమయ్య కళ్ళెఱ్ఱచేసి-

"ఇల్లేమిటి? కూడేసేస్తా. నీ అటువంటి సాహుకారు చేతులో ఉంటే నాకేం కాదనా!" అన్నాడు.

"నేను సాహుకారేమిటి! మీరిచ్చిన డబ్బేగా మీకు లేని షావుకారితనం నాకేమిటి" అంది సత్యవతి నెమ్మదిగా.

"ఇంతకీ ఏమి తేల్చావు" అన్నాడు చలమయ్య.

"చూడండీ! నేను ఎప్పుడైనా మీకు వ్యతిరిక్తంగా ఉంటానా! స్థలం కొని యిల్లు కట్టుకుందామంటే నాకు ఇష్టముండదూ? మీరట్లా విసుక్కుంటారెందుకూ! ఇప్పుడే నన్ను చెప్పు, చెప్పు అంటే నేనేం చెప్పను? నా మెళ్లోవి గనుక నా, చప్పున తీసి చేతిలో పెట్టటానికి! పైకం వాళ్ళ చేతుల్లోనుండే - పదీ పరకా కానాదో- పోలున చేతులోకి రావటానికి! మా అమ్మా వాళ్ళతో చెప్పి తెచ్చే ఏర్పాటు చేస్తానుగాని తొందర పడకండి. నన్ను నిప్పులు తొక్కించకండి" అని దీనంగా మాట్లాడింది.

"నీ సొమ్ముకు ఒకరి ఆజ్ఞ ఏమిటి? చుంచు భట్టు పెళ్ళికి కొండిభట్టు ఆజ్ఞ" అని సాగించాడు చలమయ్య.

"ఇంతకాలం నుంచీ వడ్డీలకూ వడ్డీలకూ తిప్పుతూ కష్టనష్టాలు పడి వృద్ధిచేసిన వాళ్ళ పర్మిషను అవసరం లేదంటారా?" అని నొచ్చుకుంది సత్యవతి.

"ఆ! తప్పకుండా. దీనికి ఎవరి సంప్రదింపూ అనవసరం. తెల్చటం తెచ్చుకోనటమే" అన్నాడు చలమయ్య.

"కొంచెం ధర్మంకూడా ఆలోచించండి... అందరి కష్టసుఖాలు కూడా కొద్దిగా విచారించాలి. ఆ డబ్బు మా బావదగ్గరే ఉంది. ఎవ్వని ఏగాని పుట్టని ఈ సమయంలో అంత మొత్తం కక్కమంటే ఎట్లా బాధపడుతాడో విచారించండి. రెండు మూడు నెలల్లో పంటలు వస్తవిగా! అప్పుడు తీసుకుందాం. అందరం సంసార పక్షంలో వాళ్ళమే. ఆలోచించండి" అని నెమ్మదిగా అంది.

"అదంతా అనవసరం. 'బ్రాహ్మణుడు వచ్చేవరకూ పౌర్ణమి ఆగుతుందా'? వెంటనే ఆ స్థలం కొనాలి. లేకపోతే మిగిలి పోతుంది"! అన్నాడు చలమయ్య చరచరలాడుతూ.

"పోనీ, అదిమిగిలిపోతే ఇంకొకటి కొనుక్కుందాం. ఆదుర్దా పడకండి" అంది సత్యవతి.

"ఇక నీ తెలివితేటలు కట్టిపెట్టు. 15 వ తేదీ లోగా డబ్బు తెప్పించావా సరేసరి; లేకపోతే ఇక చూడు నీపాట్లు...కుక్కలుకూడా పడవు" అని చరాలున లేచాడు.

సత్యవతికి కొండంత దుఃఖం వచ్చింది. ఆ సునిశితమైన బుద్ధికి అంతులేని పరాభవం కలిగింది గద్గదస్వరంతో "నేనూ మనిషినే. నన్ను కుక్కతో పోల్చటానికి, నే చేసిన తప్పేమిటి? నా పేరుతో ఉన్న ఆ శెఫవడబ్బును రెండు మూడు నెల్లో తెప్పిస్తానన్నదేగా! మీరు తొందర పడకండి. నా చేతనైన ప్రయత్నం చేస్తా. ఈ డబ్బు నా ప్రాణం హరించటానికి వచ్చింది." అంటూ గుడ్లనీరు గుడ్ల కుక్కుకుంది.

"నీ వెధవసోది మానెయ్యి – తెప్పించిన తరువాత నాతో మాట్లాడు" అని చలమయ్య లేచివెళ్లాడు.

౨

వెంకటరామమ్మ సత్యవతిని కాలువవైపుకు తీసుకువెళ్ళి "మీ అమ్మ నిన్న ఇకముందు డబ్బు విషయం కబురంపవద్దంది. ఇంతవఱకు 3–4 సార్లు కబురుచేసే టప్పటికి మీ బావకి చాలా కోపంవచ్చిందిట. ఈ డబ్బు నీ తాతగాడి ముల్లెగాదని నీ మొగుడికి ఉత్తరం వ్రాస్తానంటున్నాడట – ఈ డబ్బు నిన్ను అరడిపెట్టి తెప్పించి మళ్లీ నాటకాల్లో వాడి పల్లపు పొలంలాగ తగలపెడతాడు. జాగ్రత్త. అని మీఅమ్మమ్మ చెప్పింది. ఏదన్నా పొలంకొని నీపేర పెడతారట, గాని స్థలాలకీ గిలాలకీ నీ మొగుడుకి ఒక దమ్మిడీ కూడా ఇవ్వరట. మీ అమ్మ చాలా కటువుగా మాట్లాడింది. మీ నాన్నమాత్రం కాస్సేపు ఏడిచి "పాపం, పసిపిల్ల. అదిమాత్రం ఏంచేస్తుంది. దాని మొగుడూ అతని తాలూకువాళ్ళూ నిలవ నియ్యకపోతే అట్లా కబురంపుతోంది గాబోలు. దాన్ని ఎటువంటి ఇబ్బందులు పెడుతున్నారో. ఇక్కడున్న మనకేం తెలుస్తుంది. సరే 10 రోజుల్లో తమ్ముడు ఉపనయనానికి వస్తుందిగా. అప్పుడు మాట్లాడు కుందాం అన్నాడు మీనాన్న" అంది.

ఆ మాటలు వింటూ సత్యవతి కూర్చొబడి "వదినా! అమ్మా, బావా, వాళ్ళు అట్లా అంటున్నారు. వీళ్ళు ఇక్కడ ఇట్లా నిప్పులమీద నడిపిస్తున్నారు. వీళ్ళ మధ్య నేను నలిగిపోతున్నా. అటు తల్లితండ్రులూ నాకు కలిగిన బాధ ఏమిటో గమనించరు, ఇటు చేసుకున్న భర్తా నాకు కలిగిన సంకటస్థితి విచారించరు. నే నెట్లా చచ్చేదమ్మా వదినా!" అంటూ ఏడిచింది. "ఏమో నాకు అయోమయంగా ఉంది. ఈ బెధవడబ్బు నా ప్రాణం తీస్తోందమ్మా" అన్నది. వెంకటరామమ్మ ఓదార్చి యింటికి తీసుకొచ్చింది.

చలమయ్య సత్యవతిని మరికమాట అంటున్నాడు. చలమయ్య మేనమామ కూడా దానిమీదా దీనిమీదా పెట్టి పెంగుడు మాటలు వినని గడుగ్గాయి లంజ అనేశాడు. ఆ మాటలు సత్యవతి హృదయాన్ని బ్రద్దలు చేసినై.

బావమరది ఉపనయనానికి తీసుకువెళ్ళటానికి చలమయ్య మామగారు వచ్చాడు. మామగారిని నిర్లక్ష్యంగా చూచి అవమానించాడు చలమయ్య. నా మూలాన నా తండ్రికి అవమానం కలిగిందిగదా అని సత్యవతి లోపల లోపల పోయిన ఏడిచింది.

మొండట్లో "నా భార్యను పంపు"నని బిగిశాడు చలమయ్య. తరువాత ఒక స్నేహితుడు "నీభార్య డబ్బు తేగలుగుతుందేమో చూడు"మని సలహాయిస్తే సత్యవతిని మాత్రం పంపి తాను మాత్రం వడుగుకు వెళ్లటం మానేశాడు చలమయ్య.

3

సత్యవతి తల్లితో తన అవస్థలు చెప్పుకుని బతిమాలుకుని ఎట్లాగన్నా ఆడబ్బు ఆవతల పారేసి తనని సుఖంగా కాపురం చేసేట్టు చూడమంది. ఆయన ఏ నాటకాల్లోనో తిరగతూ ఉన్నా ఇంటికివచ్చి చక్కగా మాట్లాడుతూ ఉంటేనే చాలు నని సంతోషిస్తున్నా. నన్నెందుకు దుఃఖంలో ముంచుతావని బతిమాలుకుంది. తండ్రితో "— నాన్నా! నన్ను దయచూచి మీ రందరూ ఒడ్డున పడెయ్యండి" అన్నది. బావతో "ఎట్లాగయినా నాకోసం కష్టపడ్డానన్నవడి నా సంసారం నిలుపు"మని దేవురించింది. తల్లి మూర్ఖంగా "ఛా! నాకడుపున పిచ్చిపిల్లవు పుట్టావు. ఆ శాస్త్రా వాళ్లు మింగి కూర్చున్నా తరువాత ఏడుస్తూ కూర్చుంటావా! చెపితే నా వినవు.

గ్రహించనూ లేవు. చలి చచ్చినదానిలాగా పడిఉంటే ఎన్నన్నా, అంటారు. మళ్లీ తిరిగి అనటం ప్రారంభించావా అంటే వాళ్ళే నోరు మూసుకు పడి ఉంటారని బోధించింది. "ఇక నీకు చెప్పుకొన్నందుకల్ల లాభంలేదు. నా జీవితం అగచాట్లకు వచ్చిందిక" అని లోపలికి వెళ్లి ఏడ్చింది సత్యవతి. తండ్రి ఓదార్చి "ధైర్యంగా ఉండమ్మా! నీ బాధలు నేను చూడవచ్చానుగా. కొంతకాలమాగు. నే నేదో తరుణోపాయం చేస్తా"నన్నాడు.

౪

చలమయ్య సత్యవతిని కల్లీపచ్చే మాటలంటున్నాడు. సత్యవతి లోపల లోపల కుమిలిపోతోంది. ఒకసారి సత్యవతి అన్నం తింటూంటే అంద రిలో పట్టుకుని "ఇదిఎవరి సొమ్మని గడ్డి తిన్నట్లు తింటున్నావు?"—"ఏదన్నా పోగుచేసుకు తింటే కడుపు నిండక పోయిందా" అని నోటికొచ్చినట్లు తిట్టాడు.

సత్యవతి అన్నం విడిచిపెట్టి గదిలోకివెళ్ళి ఏడుస్తూ మొగుడి చేతులుపట్టు కుని "నన్ను క్షోభపెట్టకండి. ఆ డబ్బుమీద నాకు ఆశయుండి వాళ్లదగ్గర దాయలేదండీ. ఆ డబ్బు మీకిప్పించాలనే ప్రయత్నిస్తున్నానుగాని వాళ్లు పెంకివాళ్లులాగా నన్ను... మా నాన్నమాత్రం ఏదో దోవ చెపుతా నన్నాడు. చూడండీ! చేసుకున్న మీరూ ఏడిపించి - కన్నవాళ్ళూ ఏడిపిస్తే నే నేమయి పోవాలి చెప్పండి" అని రోదించింది.

చలమయ్య పెద్దనోరు పెట్టుకుని సత్యవతిని తిడుతూ "మీ అమ్మ యిటు వంటిది. మీ నాన్న అటువంటివాడు" అంటూ తిట్టటం మొదలుపెట్టాడు. సత్యవతి ఏడుస్తూ "వాళ్ళెందుకు నా మూలంగా తిడతారు. నే పట్టింది వాళ్ళని తిట్టించటానికేనా! అనేదేమిటో నన్నే అనండి, దండించం"డని ఏడిచింది.

నాలుగురోజులు గడిచినై. చలమయ్య మేనమామకు ఏదో తంపిపెట్టాడు. సత్యవతి సగపడ భోజనం చేసింది. చలమయ్య గబగబా రానూను "సిగ్గూ శరం లేకుండా కుక్కలాగా వెధవ పొట్టకు తింటే సరిపోతుందా"! అంటూ సత్యవతి తింటూ తింటూ ఉన్న విస్తరి చుట్టచుట్టి తీసుకెళ్లి దొడ్లో గోతులో పారేశాడు. మేనత్తా మేనమామా వాళ్ళూ చలమయ్యను మాకలేక సత్య వతిని అన్నం తినమన్నారు.

సత్యవతి ముఖం చేవురించింది. తాకిచూస్తేగాని తెలియరాని ఒక వేడి ఒంట్లో పుట్టింది. కంటినీరుకూడా ఇగరకొట్టింది. సత్యవతి పసిగుండె ఎంత బరువెక్కిందో గాని నడవలేక నడవలేక గదిలోకిపోయి చాపమీద పడింది. మొగుణ్ణి గదిలోకి పిలిపించింది. ఇతర ప్రసంగమేమీ చేయకుండా ఒక్క మాటగా "మధ్యాహ్నంచి నన్ను మా ఊరు పంపండి. అప్పుడు నేను తిరిగి రాగలుగుతానేమో చూస్తా. దీనికిమాత్రం ఎదురు చెప్పకండి" అని గాంభీర్యం వహించింది.

"ఎట్లా చచ్చినాసరే, ఈ మాటు డబ్బుతీసుకు రాకుండా వచ్చావంటే ఖూనీ చేస్తా"నన్నాడు చలమయ్య.

సత్యవతి చేతిలో ఉన్న ఆ చిన్నపిల్ల ఏదో నోట్లో పెట్టుకుని తుపుక్కున తండ్రి ముఖాన పడేట్టు ఉమ్మేసింది. మధ్యాహ్నం రెండుగంటలకల్లా చలమయ్య యింటికివచ్చి సత్యవతిని మూడు గంటల కారు ఎక్కించాడు. కారు కదలపోతోంది. సత్యవతి మొగుడువంక చూచి "దయ ఉంచండి, వెడతా"నని నమస్కారం చేసి దివ్యమైన ఒక చిన్న నవ్వు నవ్వింది. కారు కదిలింది. ఆ నవ్వు చలమయ్య హృదయాకాశంలో పండువెన్నెలయి హృదయం చల్లబడింది.

ఆ నిష్కల్మషమైన ప్రశాంతమైన ఆ సత్యవతి నవ్వుతో ముఖం చంద్రబింబమయింది. పూర్ణచంద్రునిచూచి సముద్రం పొంగినట్టు చలమయ్య హృదయం ఆ క్షణంలో హద్దుతప్పి సత్యవతిని చుట్టూ కన్ను నిలబెట్టి తనలో ముంచుకుందామన్నంత పొంగు బయలుదేరింది. ఇదంతా ఆ పిల్ల నవ్వులోంచి పుట్టిన అమృతంలాగా కనుపించింది. సత్యవతిలో ఒక దివ్య శ్రీ ప్రవేశించినట్టు కనుపించింది గాబోలు.

కారును ఆపి సత్యవతిని దింపుకుందా మన్నంత ఉద్రిక్తుడైనాడు చలమయ్య. "నన్ను నువ్వందుకోగలవా" అన్నట్టు కారు అదే పోత పోతోంది. క్షణంలో ముంచుకువచ్చిన ఆ ప్రేమ వెల్లువయొక్క లోతు ఎంతో చూస్తున్నట్టు చలమయ్య ఆ కారువైపు తిరిగి చెయ్యి ఎత్తాడు.

ఇంత వెల్లువని యీచంటిపిల్లను భుజానవేసికొని అవలీలగా ఈదగలనన్నట్టు చలమయ్యను చూచి నవ్వుతూ నవ్వుతూ నిమిషంలో కనుమరుగైపోయింది సత్యవతి. సత్యవతి హృదయం దూదిపింజలాగ తేలికై చంద్రిక[illegible]ంది

స్వర్గ సుఖాలకు ఎగిరిపోతోంది. చలమయ్య హృదయం బరువై ఊపిరి ఊపిరి సలుపని భూగర్భగుహాలలోంచి పాతాళానికి దించుకు పోతోంది.

౨౮

అనుకోనట్టుగా వచ్చి కళ్ళపడ్డ కూతుర్ని చూచి సంతోషించాడు తండ్రి. మనమరాలిని తీసికొందికల్లి! డబ్బువిషయంలో ఆదుర్దాగానున్న తండ్రి "మళ్లీ ఏమన్నా జరిగిందా, తల్లీ?" అన్నాడు.

"ఏడిచారు — వాళ్లచావు అట్లా చస్తూనే ఉంటారు, పిచ్చిపిల్ల గాబట్టి వాళ్ళు ఎట్లా ఆడిస్తే అట్లా ఆడుతోంది. ఇంకోపిల్ల అయితే వాళ్ళని వాళ్ల చేష్టల్ని తూరుపార పెట్టేది. ఇదేనా మాపిల్ల? చాలా తెలివితేట లయింపని మురుసుకుంటా"రని తల్లి, తండ్రిని వెటకారం చేసింది. "దాని తెలివితేటలు నీ అటువంటి గడుగ్గాయితనం తెలుస్త"నని తండ్రి నవ్వాడు. "ఆ! కనపడుతూనే ఉన్నై" అని తల్లి చెప్పింది.

రాత్రి భోజనాలైనై. వాళ్లు అందరూ మంచాలు వేసుకుని యిష్టాగోష్ఠి ప్రారంభించారు. సత్యవతి — ఆ డబ్బు తనపేర ఉండటంచేత — అది వాళ్ళకు ఇయ్యకపోతే తన సంసారానికి వచ్చిన అగచాట్లు — తనకు కలిగిన అవమానం — అమర్యాదా అంతాచెప్పి, చివరకు "ఈడబ్బు ముఖ్యమో — నా సంసారం ముఖ్యమో మీరు ఇప్పుడే తేల్చం"డని అడిగింది. తండ్రి దిగలా పడ్డాడు గాని తల్లిమాత్రం "ఏడిచావులే! ఎప్పుడూ నీ కీ గొడవే — వాళ్ళిట్లా ఏడుస్తూనే ఉంటారు. నువ్వు మొండిచరిచి ఊరుకుంటే వాళ్లే నోరుమూసుకు పడి ఉంటారు. ఈ విషయం ఎందాకా చెప్పనే తల్లీ— తెలివితేటలుండాలి, ఇక పడుకో" అని చిచ్చి కొట్టింది.

"అమ్మా! నిప్పులగుండాల్లో కాపురం చేస్తున్న నాకోసం ఆ డబ్బు పారపోసి నన్ను బయటికి తీయలేకపోతున్నావుగా! నీకడుపులో పెట్టి పెంచిన నాకంటె ఆ డబ్బు ఎక్కువయిందిగాదూ! సరే కానీ ఆ డబ్బునే వడ్డీలకేసి పెంచుకో" అని బిక్కమొఖం వేసింది సత్యవతి.

తండ్రి గుండె గుభేలుమంది. "చాతగాని దానివి, తెలివీ లేదు, కేటా లేదూ. ఇక పడుకో"మని తల్లి గదమాయించింది. ప్రొద్దున్నే సత్య

వతి బావ వచ్చాడు. సత్యవతి బావతోకూడా అదేప్రకారంచెప్పి "మొన్న మహానుభావులయిన డబ్బిచ్చి నన్ను పంప"మని దేవులాడింది. "నన్ను హాయిగా కాపురం చేయనీ" అంది. తండ్రి ఎటూ చెప్పలేక ఉక్కిరి బిక్కిరి అయాడు.

బావగారు ఉగ్రులై "వాళ్ళెవరిటి? వాళ్ళ చేష్టలేమిటి? మాట్లాడితే చిన్న పిల్లనిట్లా ఒంటరిగా డబ్బు దబ్బంటూ పంపుతారా? ఆ డబ్బు వాళ్ళ తాతగాడి ముల్లె అనా? కనుక్కుందాం. దాన్ని యిట్లా యిబ్బంది పెడతారా? పదిమందిలో చెప్పి పేడనీళ్లు కొట్టిద్దాం. పదండి మధ్యాహ్నం నుంచీ పోదా"మని అందరూ నిశ్చయించుకున్నారు. సత్యవతి "వాళ్లు పంపలేదు. నేనే వచ్చా"నంది.

"నీకేం తెలియదులే. అసలే వెఱ్ఱిబాగుల పిల్ల"వని బావగారు గదమాయించి "మధ్యాహ్నం నుంచి మాతో బయల్దేరు. భయం లేదులే. నిన్నెవరన్నా యింకా అన్నారంటే - చేశారంటే పోలీసు రిపోర్టులుచేసి దుంప తెల్లగించేస్తా"మని బావగారు గడబిడచేశాడు.

అందరూ భోజనాలుచేసి సిద్ధమయారు. సత్యవతి బయటున్నానని చెప్పి అవతల అరుగుమీద కూర్చుంది. "నీ సాంగత్యానికి తగినట్టు పదిహేను రోజుల్లోనే మాయమాట్లు వచ్చినా" అని తల్లి సణిగింది. బావగారు ప్రయాణం విరమించి నీళ్ళు కాడు పెట్టుకున్నాడు.

౬

సత్యవతి తాను చేయగలిగింది ఏమిటా అని జిజ్ఞాస పడింది, కాస్సేపు తోట దొడ్లోకి వెళ్ళి కూర్చున్నాడి. తల్లి యింత కఠినురాలవటానికీ, బావ పట్టినపట్టు విడవక పోవటానికీ - తండ్రి అసహాయత్వమూ - భర్తయొక్క నిరాదరణమూ - పసిపిల్లదాని పేరిమా తలుచుకు తలుచుకు ఏడిచింది. ఆ ఏడుపులో ఒక పెద్ద నిట్టూర్పు వచ్చింది. ఆ నిట్టూర్పులో "ఓసీ! సతీ! నీ పాపం ఎట్లా ఉండిందే" అని ఒక్కమాట పైకి వచ్చింది. కాస్సేపు ఏదో ఆలోచించుకుంది. భర్త నిరాదరణమూ - తల్లిదండ్రుల నిరాదరణమూ మధ్య నలిగి సతి అట్లా చేసిందిగా" అనుకుంది. నేను బొటనవ్రేలితో అగ్ని పుట్టించలేనుగా! అనుకుంది. మూడు కాగితపు ముక్కలు తీసుకు వచ్చింది. ఎగా

వెంటనే గదిలోకిపోయి తలుపు వేసుకుని ఒక క్షణానికి బయటికి వచ్చింది.
వచ్చినప్పటినుంచీ ఆ పిల్లను చంక వేసుకొని దానితో ముద్దులాడుకుంటూ
బావగారింటికీ పెత్తండ్రిగారింటికీ ఇంకా కొంతమంది యిళ్ళకూ వెళ్ళి
అందరితోనూ కులాసాగా మాట్లాడి వచ్చింది. ఆ కులాసా చూచి తల్లి
"పిచ్చిపిల్లా! నీకు సంతోషమొచ్చినా ఆపుకోలేవు, దుఃఖమొచ్చినా అణుచు
కోలేవు. ఎందుకట్లా తిరుగుతా? గుప్పెడు మెతుకులు తిని అరుగుమీద
పడుకోక?" అంది.

సత్యవతి పెద్దనవ్వునవ్వి "అమ్మా! ఒక్క అయిదు నిముషాలు అట్లానుంచో!
నిన్ను కరువుతీరా చూస్తాను. తమ్ముడిని కూడా ఎత్తుకునుంచుంటే మరీ
సంతోషమంది.

"నీకేమన్నా పిచ్చిపట్టిం దేమిటి? నోరు మూసుకు పడుకో" మంటూ లోపలికి
వెళ్ళింది తల్లి.

సత్యవతి తండ్రిని పిలిచి "నాన్నా! నువ్వు మనమరాలిని నేను చూస్తూ
ఉండగా ఒక్కసారి ఎత్తుకుంటా? అని అడిగింది. "అమ్మా! దానికేమి!
నా తల్లిగదే" అని తండ్రి మనమరాలిని నెత్తిమీద ఎక్కించుకున్నాడు
వెంటనే సత్యవతి గదిలోకి వెళ్ళిపోయింది,

## ౨

రాత్రి భోజనాలైనై. అంతా పండుకున్నారు. ఇంట్లో పాతఘడియారం
10-11-12 ఒంటిగంట కొట్టింది. అరుగుమీద పిల్ల "అమ్మా! అమ్మా!
అంటూ ఏడుపు ప్రారంభించిది. పిల్ల ఏడుస్తోంది. సముదాయించవేమే
సత్యం" అని తల్లి పిలిచింది. సత్యవతి పలకలా. "మాట్లాడవేమి? మూగ
దయ్యావా!" అంటూ తలుపుతీసి మెల్లాలోకివచ్చింది. సత్యవతి పక్కమీద
కనుపించలా. అమ్మాయ్-అమ్మాయ్ అంటూ అవరణంతా పిలిచింది. మూంచు
కొంపొందు గేటుతలుపు గడియ వేసుకునే ఉంది.

"ఏమండోయ్ - సత్యం ఏమయిందండీ! కనపట్టలేదు. ఇట్లా రారేం"
అని మొగుణ్ణి పిలిచింది. ఆగందరగోళంలో చుట్టుపట్లవారందరూ చేరారు.
దొడ్లూ దోవలూ వెతికారు. నూతులూ గోతులూ వెతుకు తున్నారు. తల్లి

అబాయిలూ దిబాయిలూ చేస్తోంది. తండ్రి మొద్దుబారిపోయాడు. అందరూ ఎవరుపడితే వారు "చూడండిరా! చూడండిరా! అంటున్నారు. కొంతమంది చెరువుచుట్టూ తిరుగుతున్నారు. తూర్పు రేకలు తెల్లవారినై.

కొంతమంది మాలవాళ్లు "మన పెద్దనూతిలో ఆడమనిషి చచ్చి తేలి ఉందని గుబ్బిస లాడుతున్నారు. ఆ సంగతి పెద్దమాలవచ్చి మునసబుగారితో చెప్తూ తున్నాడు. ఇంకేముంది? సత్యవతే నని అందరూ పరిగెత్తారు.

సత్యవతి కళేబరాన్ని ఇంటికి తెచ్చేప్పటికి 9 గంటలైంది. ఆ నవ్వుముఖం చూచినవాళ్ళంతా ఆశ్చర్యపోతున్నారు.

చాకల్ది మట్టుచాపా, బట్టలూ సర్ది "ఇదిగో 3 కాగితా"లని సత్యవతి తండ్రి కిచ్చింది. "అయ్యో! దేముడా! అవి నేను చదువలేనరో" అని విరుచుకుపడి అరుగుమీ ఆనించి పసుపూకుంకుమా అలంకరించి కూర్చోబెట్టిన శవం వేపు తిరిగి, "తల్లీ! నీనోటిమాటలు నేను వినలేదని నాకు కాగితం మీద వ్రాసి చూపించావా? తల్లీ! ఈ ప్రయాణం సిద్ధంచేసుకునా నేను చూస్తూ ఉండగా ఈ పిల్లనెత్తుకో మని నాకు అప్పచెప్పావా? తల్లీ! అని అలుకులాడి భార్యను పిలిచి "చూచావా! నీ పిల్ల ఏమి తెలివితేటలు గలదన్నావు – సతీదేవి లాగా దేహం విడవలా!" అని వలపోశాడు.

తల్లి బావురు మని ఏడ్చి "బాబో! దానిమాటలు చెప్పి చంపెయ్యకండో! నే కెట్లా బ్రతుకనో" అని మొగుడు కాళ్ళమీద పడింది.

ఆ తెల్లవారకట్టే సత్యవతి కనిపించటం లేదని చలమయ్యకు చెప్పటానికి మనుష్యులు వెళ్ళారు.

ఆ రాత్రి కలలో తనను స్వర్గసుఖాలు అనుభవింప చేసిన నా సత్యవతి కనపడక పోవటమేమని చలమయ్య ఆదుర్దాగా పరుగెత్తి సైకిల్ మీదపడి వచ్చేశాడు.

ఇంటి ముందుకు వచ్చేవరకూ ఎవరూ ఏమీ చెప్పలా. సందుమూల తిరిగేప్పటి కల్లా జనం ఇంటిముందు గుంపులుగూడి ఉన్నారు. సరాసరి ఆదుర్దా పడుతూ సైకిల్ దిగాడు. చుట్టూ ఉన్నవాళ్ళు దోవ యిచ్చారు. శవ స్వరూపంగా ఉండి నవ్వుతూ ఉన్న ఆ భార్యముఖం చూచాడు. ఆనాడు కలలో చూచిన ముఖం జ్ఞప్తికివచ్చింది. అచేతనుడై నిలబడిపోయాడు. అత్తగారు

"చేతులారా మాతల్లి ప్రాణం తీశాం దేవుడా" అని పెద్దశోకం పెట్టింది. చలమయ్య గుండె అవిసిపోయింది."

కొంతసేపటికి తెలివివచ్చింది. "ఇదిగో నీభార్య నీకు వ్రాసిన ఉత్తరం" అని ఎవరో చేతికి చీటీయిచ్చారు. చలమయ్య ఆపాదమస్తకం వణికిపోతోంది. చీటీ విప్పాడు.

"ప్రాణేశ్వరునకు నమస్కారములు. నా ఆయుస్సంతా 22 సంవత్సరములలో ముగించుకు పోతున్నా. దీనికి మీరు బాధ్యులుగారు. నేను సుఖ సంసారం చేసుకోలేకపోయినా. చిన్నపిల్లను నా ప్రాణంగా పెంచండి. సెలవు."

ఆ చీటి చదివాడు. ఆ వణుకుతో ఆ శవం ఎదుటికి వెళ్ళినుంచున్నాడు. కడుపులోంచి ఒక పెద్ద ఆవేశం వచ్చింది. ఎక్కిళ్ళతో ఏడుపువచ్చింది. ఆ రోదనములో "సత్యవతీ! నీకు నమస్కారం" అన్నాడు. భోరున ఏడిచాడు. "నేను దౌర్భాగ్యుణ్ణి. నీ అటువంటి యిల్లాలి వెంట రాలేకపోయినాను. నాకు సెలవియ్యి. నీ ముఖం చూడలేను. ఎదుటకూడా ఉండలేను. నీ మరణానికి నేనేకారణం. నన్ను శపించలేవూ! నీ ప్రాణంలాగు ఉన్న ఆ పిల్లనుమాత్రం ఈ పాతక చేతులతో ఎట్లా తాకగలను – సత్యవతీ! నీ జీవితం ధన్యం చేసుకున్నావు పో. దయఉంచి ఎప్పుడైనా కలలో కనపడి నన్ను చూచిపోతూ ఉండు. నీకు నమస్కారం" అంటూ ఏడుస్తూ బజారువెంట నడిచాడు.

---



# 7. బసవదేవుడు



౧

ఒకరోజు సాయంత్రం భవానీపురంలో నడిబొడ్డున ఉన్న ఊరరావిచెట్టు చుట్టూ కట్టిన దిమ్మెమీద పిన్నలూ, పెద్దలూ పరివేష్టించి ఉన్నారు. అది ఒక చిన్న క్రమశిక్షణలేని సభలాగ ఉంది. అందులో పంటరెడ్లున్నారు. పాలికాపులున్నారు. పెద్దకమ్మలున్నారు. బ్రాహ్మణులున్నారు. వీరందరిలోను వయస్సులో పండిన భయభక్తులు అంతగాలేని వయస్సు కోడెగాండ్రు కూడా లేకపోలేదు.

కొందరు రాజకీయాలు చర్చిస్తున్నారు కొందరు ఎదుటివాళ్లు ఔనన్నది కాదనటానికి కూర్చున్నారు. క్రమమైన చర్చ లేకుండా కొందరు వీరాధివీరులుగా మాట్లాడుతున్నారు.

వారిది పెద్దగహితాంగం; పాడిపంటలు గలిగి ఆ ఊరు శ్రీ మహాలక్ష్మితో తాండవిస్తోంది. నాగరికత పూర్తిగా ఆక్రమించకపోయినా భావాలు అందరినీ అవహించి ఉన్నై. ఎన్నెన్నో ప్రసంగాలు చేశారు. గత నెలలో గిరిపురంలో జరిగిన దుక్కిటెడ్ల బలప్రదర్శనం మాటలు వచ్చి అందులో తమ గ్రామానికి వచ్చిన ఖ్యాతిని పొగడుకుంటూ ఏమైనాసరే మాదేళ్ళ మన పశువుల్ని గెలిపించి ఆ బంగారుపతకం తామే కైవసం చేసుకోవాలని తీర్మానించుకున్నారు.

సముద్రాల వీరయ్యగారి కొడుకు పాతముఠాదార్ వెంకయ్యగారితో అదిగో! అవాళ్లే గొల్లబోయిళ్ళే యివాళ పొద్దున పెత్తందారుగారి దగ్గరకు వెళ్ళి ఎడ్లజతలు అమ్మకానికి ఉంటే చెప్పండి. నేను ఎడ్లను ఖరీదు చెయ్యటానికి

వచ్చావనన్నాట్ట. ఇంకా ఎక్కడైనా గిత్తలుంటే కూడా చెప్పండన్నాట్ట. పిచ్చిముండావాడు! అవాళ్లేజోడేనా.

ఆ!

ఆ పందెం కొట్టిన జతనిమ్మంటే బాగుండేదే - అయనేమన్నాట్ట?

ఆయన వీళ్ళని చూచి నవ్వుకొని అమ్మకానికివస్తే అట్లానే కబురుచేస్తాన్లే, వెళ్ళండి అన్నాట్ట. వారి కసుతగాళ్ళు వీళ్ళవైపు తొంగిచూచి ఒకటే నవ్వటంట.

"పిలూ. గమ్మత్తు చేద్దాం." (అని ఒకాయన)

ఓయ్! అబ్బాయిలూ! మిమ్మల్నే? యిట్లారండని ఒకకోడెగాడు పిలిచాడు.

నల్లటిఛాయా కండలు తిరిగి మంచి దేహపాటవాన్ని కలిగి అనాగరికులుగా ఉన్నా, ఠీవిగా ఆ యిద్దరూ వచ్చి ఆ చిన్నరథం ముందు నిలిచారు. పెద్ద జమాలు నేతదుప్పట్లూ, పెద్దతలపాగాలూ, చేతుల్లో మంచి పొన్నులువేసిన కాణాకర్రలూ, చెవులను మంచి రకపు రాళ్ళ బావిలీలు ఉన్నై. ఆయిద్దరూ నిలవటంతో ఆ సభఅంతా అటు తిరిగిపోయింది.

ఒకరు—మీదేఊరు?

మాదినైజాం రెడ్డిపల్లి అడవి. మన్యం.

ఇంకొకరు—ఏంపనిమీద వచ్చారు?

పశువుల్ని కొనుక్కుపోదామని వచ్చాం.

మరొకరు—దున్నకుర్రల్ని, ముదిలిగేదల్నీ, బేరం చేసుకునేందుకు వచ్చారా?

అవ్వీ కొంటాం - మంచి ఎడ్లజతల్నీ, గిత్తల్ని కూడా కొంటాం?

ఎడ్లజతల్నే కొంటరుగా! ఎన్నిజతలు? నాయనా!

జతలుచూచి మాట్లాడుకుందాం- మీదగ్గర అమ్మకానికి ఉన్నయ్యా?

ఒకరు—ప్రొద్దున పెత్తందారి యింటికి వెళ్ళింది మీరేనా?

ఔనండిబాబు!

ఇంకొకరు—వారేమన్నారు? వారిదగ్గర పందెపు జతలు కూడావున్నయి. ముందు ఊళ్ళోవిచారించుకొని తరువాత తమ దగ్గరకు రమ్మన్నారు.

కుర్రవాళ్ళల్లో నాయకుడుగా ఉన్న రమణయ్య వెటకారంచేస్తూ చూడు నాయనా! మీకు కావలసినన్ని పశువుల్ని ఈ ఊళ్ళో చూచిపెడతాంగాని దారిబత్తాలు మీదగ్గరఉంటే సరేసరి, లేకపోతే ఎట్లాగైనా సాగుచేసుకోండి. మీకు చుట్టపొగాకు మాబావగారు ఇస్తారు. అచేయిల్లు అన్నాడు.

అందరు నవ్వారు.

ఆ వచ్చిన యిద్దరిలో చిన్నవాడు ముఖం చిట్లించుకుని మీ వంటి దాతలైన కోటీశ్వరులు పశువుల్ని తోలిపెట్టి పోగాకు ఇప్పిస్తుంటే దారిబత్తెం ఇచ్చే దొరలు దొరకక పోతారా? పోనీ బిచ్చమెత్తుతాం. అని అంటూ ఉండగా.

పెద్దాతడు బహుశాంతముఖంతో ఊరుకోవోయ్! నాయనా! — అతడు చిన్నవాడులెండి! పెద్దల ఎదుట బజార్లో తలయెత్తి మాట్లాడటం ఇంకా నేర్చినవాడు కాడులెండి అని అంటుండగా.

ఒకరు:—అదిగో! రమణయ్యా! మీ పశువులు ఇంటికి వెళుతున్నాయి, అందులో ఏమైనా నచ్చుతయ్యేమో చూచుకొమ్మనమన్నాడు.

రమణయ్యగారు నవ్వుతూ మంద వీళ్ళని దోవబత్తెం చూచుకోనీ పాపం.

సైజాం పెద్దాతడు:—శాంతంగా అబ్బేనా! మన పశువులు - వాటిల్లో వేటికైనా వదలుతారా ఏమిటి?

ఒకరు:—బేరం రొఖ్ఖమా? అరువా?

సైజాం:—ఎట్లాగనా సరే - మీదయ.

ఇంకొకరు:—ఎన్ని జతలు కావాలో అసలు ఊహవుందా ?

సైజాం:—వాటిని నిలబెట్టండి. చూచుక చెప్తాం.

సభికుడు:—నీకు ఎడ్లపరీక్షనా? యింకా ఏమైనా తెలుసా?

సైజాం:—అశ్వపరీక్షా తెలుసు, ముందు మీఎడ్లమాట చెప్పండి. మీరెరగని గుఱ్ఱాల గొడవ మీకెందుకు!

సభికుడు:—ఓయబ్బా! చాలవటుకుందే! రమణయ్యా! పశువుల్ని నిలబెట్టు ఆపరీక్షేమిటో చేయిద్దాం.

రమణయ్య నవ్వుతూ పశువుల్ని మందవేయించాడు. సైజాంవా రిద్దరూ 2 జతల ఎడ్లనూ, జత గిత్తల్ని, ఒకగిత్త దూడని 2ఆవుల్ని, ప్రక్కకు మళ్లించి బాబూ! ఈ తొమ్మిది జీవాల్ని ఎంచుకున్నాం. బేరంచెప్పమన్నారు.

సభికుడు:—(హాస్యంగా) మనలో మనకేమిటిగాని ఏదోయిచ్చి తోలుక వెళ్లుమనరూ బేరాలేమిటి!

సైజాం:—మరీ అంత దరిద్రులం కాదులెండి. ఖరీదు చెప్పండి నచ్చితే కొంటాము.

సభికుడు:—మీదగ్గర ఏమాత్రం డబ్బుందో చెప్పు ముందు. మనం సంప్రదించుకొని బేరమాడదాం. చివరకు ఆయన వీటన్నిటికి కలిపి ఏబంద రూపాయిలో యియ్యమంటే పళ్ళికిలించి పోవాలిసి వస్తుంది అన్నాడు.

సభంతా నవ్వారు గాని మణేదారు మాత్రం కోపించాడు.

నైజాంకుర్రవాడు:—ఏమంత గడుసుతనంగా మాట్లాడుతున్నారు. దాని బత్తెం చూచుకుంటే పశువుల్ని తోలిపెడతా మన్నారుగా, యిదేనా ఎత్తుబారీ అన్నాడు.

సభికుడు:— ఊరుకోవోయ్! త్రుసుగుడా! అడవిమాటలు రానియ్యకుమరీ!

నైజాం పెద్ద:— వాడు అడవిలో ఉన్నవాడు కాబట్టి అమాటలు వస్తై! తమరు పట్టణవాసులుగా! నూటి మాటలు మాట్లాడండి, ఈ పశువుల్ని ఎంతకు వసూల్తాకో చెప్పివేయండి.

రమణయ్య:— నీకెంత యీయగలవు!

నైజా:— అది అన్యాయం, మీరు ఇంత అంటే నా మోజును బట్టి కొంటాం.

రమణయ్య:— (వెటకారంగా) అట్లాగయితే సరేగాని మొత్తానికి నూట పదారు రూపాయిలు ఇయ్యగలవా?

నైజాం:— బాబూ! యింటిపెత్తనం నీదేనా? యింకా యెవరినైనా సంప్రదించాలా!

రమణయ్య:— అదంతా నీకెందుకోయ్! ఇవి ఎంత! అన్నావు- నేనింత అన్నా - చేతనైతే యింత యిస్తానను. లేకపోతే తోకముడు.

నైజాం:— (కోపంతో) అయితే మధ్యవర్తులను చూడు. బేరం ఖచ్చితం చేస్తాం.

రమణయ్య:— వీరందరూ మధ్యవర్తులుగారూ? పెద్దమనుష్యులు కానివా రిక్కడలేరు.

మణేదార్ వెంకయ్య అందుకుని, ఇదిగో, రమణయ్యా! వాళ్లు నిక్కచ్చిగ మాట్లాడుతూ ఉంటే నువ్వు తమాషాగా మాట్లాడుతావేం! ఇప్పుడైనా అక్కర వుంటేఅమ్ముతానని చెప్పు......... తరువాత ......అని కోపించాడు.

రమణయ్య:— కాదుమామా! లేకపోతే పిల్లడగటం ...... కాకపోతే నేను చెప్పటం...మరీ...నువ్వు చెప్పు...

నైజాం చిన్నవాడు:— ఆ చెప్పేదేమిటో తిన్నగా చెప్పు. నీవన్నట్లు మా అడవివాళ్ళకు ఆకేకలూ, కాకిలూ నత్తురు మంటలూ తెలియవు. సూటిగా మాట్లాడు. తిక్కిరి బిక్కిరి మాట్లాడక - సేదుక మాటలు మాట్లాడుతావేం-

అందరూ నవ్వారు.

రమణయ్య:— అధిక ప్రసంగం చెయ్యక - దున్నలు బేరానికి వచ్చారా? ఎడ్లజతల ఖరీదుకు వచ్చారా? చెప్పండి.

నైజాం:— ఊరక్కే తోచింది మాట్లాడక ఈ తొమ్మిది జీవాల్ని ఎంత కిస్తావో చెప్పు. నీ పెత్తనం ఉంచే- లేకపోతే మానెయ్యి; దున్న మాట తరువాత.

రమణయ్య:— (నవ్వు తెప్పించుకుంటూ) సరే రు 1500 లు ఇస్తే వదుల్తానన్నాడు. ఇంకా బేరంలేదన్నాడు.

నైజాం:— ఖాయంగా మాట్లాడుతున్నావా? మళ్ళీ తబాతప వస్తుందా! మణేదారు: ఇంకొక పెద్ద కాపు:—ఏం రమణయ్యా!" సమాధానం ఏం చెప్రతావ్! అన్నారు.

రమణయ్య:— తెల్లపోతూ అ! ఖాయమే. వెంటనే క్యాష్ ఇయ్యాలి. వాయిదా యివ్వలేనన్నాడు.

నైజామాతడు:—మణేదార్ గారూ! బేరం ఖాయం చేసుకున్నాం, పైకా నికి గడువు అవసరం లేదు. దారి కాగితం వ్రాయించండి. ఎవరినైనా పిలిపించి మీరు మధ్యవర్తులుగా ఉండాలి; అన్నాడు.

డబ్బేదీ? మరీ! అని రమణయ్య; నత్తుకు నత్తురు మన్నాడు.

నైజాం ఆయన:—డబ్బే లేకపోతే యింకేముంది, బాబూ! అంటూ మొల జాలం తీసి 100 పైగా కాసులు మణేదారు ముందర పోసేసి ఎంచమన్నారు. సభంతావిస్మయం పొందింది. రెండవ నైజాము కుర్రవాడు పశువుల్ని మందవేసి నిలిపాడు. రమణయ్య స్తంభించి కూర్చున్నాడు.

సభికుడు:—రమణయ్య తండ్రికి కబురంపాడు.

నైజామాతడు:—ఏమీ ప్రయోజనం లేదు. బేరంజరిగిపోయింది. లెక్క గట్టుకుని ఈ నవరసులు తీసుకోండి. లేకపోతే పైకం ఇస్తామన్నారు.

రమణయ్య తండ్రి:—హడావిడిగావచ్చి,ఏమిటిరా!పిల్లకాయ చేష్టలు సఖహా

సంప్రదింపు లేకుండా ఇదేంపని! ఏమిలోకం! అని కొడుకుని మందలిస్తున్నాడు.

మణేదారుగారు: — బాబాయ్! మనవాడు పిచ్చోపాడ్లో చేశాడు. ఇంత వఱకు వస్తుందనుకోలే. యిక ఏమీ లాభంలేదన్నాడు.

రమణయ్య: — లేచివెళ్ళాడు.

తండ్రి: — ఇదేమిటొరీ? నాయనా! ఇంటిగొడ్లని బజారులో వేలంవేసినట్లు చేశావేరా? అని కేకాలేశాడు. నైజాం వారిని మీరెవరు బాబూ! అంటూ సాయిలా పాయిలా ప్రారంభించాడు.

ఆ సభికులందరూ: — ఒక అరగంటలో ఎన్నడూ అనుకోని కార్యం జరిగిందని ఆశ్చర్యపోయి "మనిపాత మాణిక్యాల్లా"గావున్న ఆ నైజాంవారిని విస్మయంతో చూచారు.

మణేదార్: — వారిని పరామర్శచేసి పుట్టుపూర్వోత్తరాలు అడిగాడు.

నైజాము చిన్నవాడు: — మీకవ్వన్నీ ఎందుకూ! మేము అడవి వాళ్ళము. మాతో మీకెందుకూ అని రుసరుసలాడాడు.

పెద్దాయన: — చిన్నవాడిని మందలిస్తూ ఊరుకుర్రకుంఇట్లాగే ఉంటుంది. ఇతడు నాకొడుకు లక్ష్మారెడ్డి. నన్ను రామిరెడ్డి అంటారు, మేమూ మీ జిల్లావారమే. వంద సంవత్సరాలపైగా మాతాతలు నైజాములోకి వెళ్ళి సేద్యం చేసుకుని నైజాం ఇలాకా కొంత అడవి పల్లప్రభూమి సంపాదించారు. మేము దానిని సేద్యం చేసుకుంటూ బ్రతుకుతున్నాం. ఏదో బక్క రైతులం. మొన్న వేసంగిలో గత్తరువచ్చి పశువులు చాలా నష్టమైనై; పనివాళ్ళమీద ఆధారపడకుండా స్వయంగా వచ్చి మనవైపు మాకుర్రవాడికి చూపించి పశువుల్ని ఖరీదుచేసి పోదామని వచ్చాము.

భీమపురపు మునసబుగారు, వారిపశువుల్ని యింకా కొంత మందనూ మా అడవికే వుల్లరికి తోలుకూ ఉంటారు. మొన్న రావటం వారిదగ్గరకేవచ్చి కొన్ని పశువుల్ని కొని వారి పరంగా ఉంచి ఊడొచ్చాం. ఈ పశువులకు కూడ దోవకాగితం ఇప్పించండి అన్నాడు.

రమణయ్య తండ్రి: — దిగలా పడుతూ కుర్రవాడి మాటలు ఖాయం చేయవలసిందేగా; పరిస్థితులుగూడా విచారించండి అన్నాడు.

మణేదారు: — బాబాయ్! మన వాళ్ళవి కుర్రమాటలుగా సాగలా, పెంకె

తనానికి ప్రాయశ్చిత్తం జరిగింది. అయినా మీ యిష్టం, అని ఊరుకున్నాడు.

రెడ్డి:- నెమ్మదిగా తమమాట పట్టింపుతో సబబైన ధరకంటె ఎక్కువగానే పెట్టారు. కాదని ఎవరన్నా అంటే మూదరా యిస్తాను. అది చూచుకోండి. కాని పశువుల్ని మాత్రం వదలమని వాటిని ఒకటొకటిగా వదలాయించి చూచాడు. ఒక ఏడాది వయసు కోడెదూడ పరుగునవచ్చి రెడ్డి పక్కన నిలబడింది.

రమణయ్యతండ్రి:—రా! నాయనా! అని పిలిచాడు. కోడెమాత్ర రెడ్డి ముఖం వంక చూచింది. రెడ్డిగారి చూపులు కోడె ముఖంమీద నిలిచిన్నై, ఆయన చేతులు మోర గీకిన్నై. ముఖం ముఖాన్ని ముద్దుపెట్టుకుంది, కోడె పొంగి వృషభరాట్ లాగా పొంగి రెడ్డి నానుకొని నుంచుంది.

రెడ్డిగారు:—రత్నం దొరికిందన్నాడు.

రమణయ్యతండ్రి:—దాన్ని నేను కని పండించుకున్నాను. దాన్ని నాకు వదలుదూ, అని కోరాడు.

రెడ్డిగారు:—నేను ఆ ఫలాన్ని సద్వినియోగంచేస్తా. నీకు పుణ్యమేంగా అన్నాడు. ఇద్దరూ సఖ్యపడ్డారు. ఊరివారంతా ఏపుట్టలో ఏపాముందో తెలియదుగదా! అనుకున్నారు.

కొంటె:—బుర్రిలు:-సిగ్గుపడిపోయారు.

ఆ ఊరివారు రెడ్డిగార్కి అసంపూర్తిగా ఉన్న భజన మందిరం చూపిస్తే దానికి కావలసినంత కలపా, వాసం ఇస్తానని వాగ్దానముచేసి ఎప్పుడొస్తే అప్పుడు బళ్ళతో తోలిపెడతానన్నారు, ఊరివారు మెచ్చుకున్నారు. తండ్రీ కొడుకులు వారి శెలవు పుచ్చుకున్నారు.

౨

భీమపురం కరణం నరసింహారావు పంతులు, మునసబు వెంకటరత్నం నాయుడు ఈ ఉభయులూ అన్యోన్యంగా ఉంటారు. రామిరెడ్డి ఈ ఉభయులకూ పరిచయం. మునసబుగారి దొడ్లో మందవేసుకున్న పశువుల్ని తోలుకుని తమ గ్రామం చేరుకోటానికి నవమీ సోమవారం లగ్నం పెట్టుకున్నాడు రామిరెడ్డి.

కొంతకాలం క్రితం రెడ్డిగారి కూతురు గ్రహపీడతో బాధపడుతూ ఉంటే నరసింహారావు పంతులుగారు మధ్యంలో రెడ్డిగారి యింటికద్దవుండి గ్రహజపం చేసి రక్షయిచ్చి బాగుచేశారు. రెడ్డి చాల సంతోషించారు, కరణంగారు ఆ జపాలకు అన్నశాంతి యిప్పుడు చెయ్యమని కోరారు. రెడ్డి నాకు ద్రవ్యలోపం ఎక్కడా యుండదు. అన్నివర్ణాలకు సమారాధన ఏర్పాటు చెయ్యండని డబ్బు ఇచ్చాడు. మునసబు కరణాలూ ఇంకా ఊరివారు నడుంకట్టి పెద్ద ప్రయత్నం చేశారు. సంవత్ సంపత్తుల్లో వెంకటరత్నం నాయుడుగారు మంచి హుషారయిన వ్యక్తి. కరణంగారూ అంతవాడైనా నాయుడుగార్ని చూచుకుంటూ పోతారు.

సంతర్పణపనులు జరుగుతున్నై. కరణంగారు భార్యతో ఏదో గుడ గుడ లాడి సంతోషంతో బయటకువచ్చి కూర్చున్నారు. అప్పుడే మునసబుగారు ఏదో సంప్రదింపుకు వచ్చాడు.

కరణం:—సంతోషపడుతూ "రత్నం! మనవాళ్లు ఇంకో పెటుగు పెట్టారు విన్నావా? అని చెవిలో గొణిగారు.

నాయుడుగారు:—నవ్వుతూ కానియ్యండి బాబు. అది మన బాపనయ్యలకి ఉపనయనం నాడు నేర్పిన విద్యేగా! ఇంత సమర్పించుకుంటున్న రెడ్డి బాబు మంచి అబోతును వెయ్యలేడూ? అడిగితే మంచి మంత్రాంగం చేస్తారయ్యా! యింకా చూస్తావేం. కాని - ఆ కోరిక కూడా వెళ్లబెట్టు. మాకు నోరుతెరచి అడగటం చేతరాదు కాని - "కసికోడలుంటే ఖద్దసే అత్త ఉంటుందా!" అది నీచేత కావటల్లేదేమో నని వెంగగాని అని నొక్కాడు.

రామిరెడ్డికీ లక్ష్మిరెడ్డికీ ఫలహారం పెడుతూ కరణం భార్య:— అన్నయ్యా! మీబావా ఈ ఊరివారూ మిమ్మల్ని కోరి ఒక అబోతు దూడని రేపు అచ్చువేయిస్తామనుకుంటున్నారే- మీరు విన్నారా!" అంది. రెడ్డిగారు నవ్వుతూ అమ్మాయిగారూ! పంతులుగారు అడటానికి భిడియపడుతున్నారేమో! అట్లాగే. వారి చిత్తానుసారమే చేయిద్దామనండి అన్నారు. ఆరొయ్యో అన్నా! మీబావగారికి భిడియమంటూ ఉందా! అట్లాగైతే కరణీకం ఎట్లా నడుస్తుంది. ఇవ్వన్నీ ఎట్లా నడుస్తవి అంది. తండ్రి కొడుకులు నవ్వుకున్నారు.

ప్రయత్నం ఫలోన్ముఖం అయింది. కరణంగారు భవానీపురపు రమణయ్య

గారివద్దకొన్న దూడని వదలమంటారు. రెడ్డి "అది జాతిరత్నం మంచి లక్ష
ణాలు కలది. అక్షలో ఒకటి యిటువంటిది దొరుకుతుంది. నాకు పశు
సాంప్రదాయం తెలుసుగనుక ఇట్లా చెప్తున్నా. అది దేవతాదూడ.
రమణయ్యగారికి ఇచ్చిన డబ్బంతా ఈ ఒక్క దూడ చేస్తుంది. ఇది నాదొడ్లో
ఉంటే చాలునని మురిశానన్నాడు. మీరన్నట్టు దాన్ని దేవదూడగానే
మా గ్రామంలో తిరగనియ్యండి. మాకు మాత్రం దేభెదూడ ఎందుకూ?"
అన్నాడు కరణం. వెంకటరత్నం నాయుడు - అందుకుని "రెడ్డిబాబూ!
మా కరణంగారు పట్టి ధర్మరాజంటివాడు. పాపం మాయగోవు. ఆయన
సంకల్పించాడంటే వృథా కావడం నేనింతవరకూ చూడలా. ఆ దూడని
శంకరేశ్వరుణ్ణి చెయ్యి. తరువాత నీ యిష్టం." అన్నాడు, రెడ్డిగారు నవ్వి
"తమ్ముడూ! అవశ్యం అట్లాగే కానియ్యండి. దైవకార్యమేగా మీరు
చెయ్యమనేది. దాని ఏర్పాటుకూడా చేయించండన్నారు. మరునటిరోజు
ఊరంతా అలంకరించారు. శ్రీరామ కల్యాణం చేశారు. భజనలూ, ఊరే
గింపులూ, జరిపారు. ఎక్కడ చూచినా రెడ్డిగారి ఈవిని మెచ్చారు.

12 గంటలకు అభిషేకాలు చేస్తున్నారు. ముత్తయిదువలు దూడకి కాళ్ళకు
పసుపూ పారాణి పెట్టి పెళ్ళికొడుకులాగా మంటపంలోకి తీసుకొచ్చారు.
రెడ్డిగారు ఆ దూడ ఎదట నిలబడ్డారు. కరణం పైవాంగు చేస్తున్నారు.
మునసబు అక్కడి ఏర్పాటులు చేస్తున్నాడు. మేళగాళ్లు బ్రహ్మాండంగా
మ్రోయిస్తున్నారు.

పురోహితుడు మేళాలను ఆపించి సంకల్పంచేసి ఆ దూడను
సంబోధించి "ఓ! వృషభరాట్! దేవబ్రాహ్మణ ధర్మమాన్యాలు
రక్షిస్తూ బసవదేవుడవై సత్సంతానాన్ని గని మాపాలిట నందీశ్వరుడవై మా
భూముల్ని పండించి మా పాడిపంటల్ని బీదాబిక్కీనీ కనిపెట్టి యథేచ్ఛం
విహారా! అని ప్రబోధించాడు. కరణం హడావిడిగా మంటపంలోకి వచ్చి
రెడ్డిబసవేశ్వరుడని నామకరణం చెయ్యండని పురోహితున్ని హెచ్చరించాడు.
మునసబు మెచ్చుకున్నారు. ఆ దూడ రెడ్డి ముఖం చూచి రంకె వేసింది.
రెడ్డి సంతోషంతో కళ్లలో నీళ్లునించుకుని దూడకు ప్రదక్షిణంచేసి హారతి
యిచ్చి "బసవా!" అని దూడముఖం ముద్దుపెట్టుకున్నాడు. ఆ దూడ
రెడ్డి కపోలం నాకింది. రెడ్డిగారు కరణం భార్యనుపిలిచి "అమ్మా! పసుపు
నీళ్లు తీసిపారబొయ్యండి" అని చెప్పి మునసబుగారి దొడ్లోకి తోలారు.

అన్ని వర్గాలకూ తృప్తిగా సమారాధన చేశారు రెడ్డిగారు. కాలచక్రం దొర్లింది. చిన్నలు పెద్దలయినారు. పెద్దలు వృద్ధులైనారు. చిన్నబసవడు పెద్దబసవడు అయినాడు. ఆ విశాలమైన సోగకన్నులతో మూపురం తొణుకుతుంటే – గంగడోలు ఊగుతుంటే ఆ తీర్చిన ముఖం ఎత్తుకుని బజార్లమ్మటి వస్తుంటే ఊరివారు ముచ్చటపడతారు. ఎరగనివారు భయపడి అరుగులెక్కుతారు.

## 3

రోజులో ఒక పర్యాయం కరణంగారి ముంగిలివాకిట్లోకివచ్చి నిలుస్తాడు బసవదేవుడు. ఆ కరణం భార్యా చేటలో తవుడూ తెలగపిండీ వేసి తినిపిస్తుంది. తాను వచ్చిన సంగతి ఆమె పనితొందరలో ఉండి గమనించక పోతే అంబా! అని ఒకపిలుపు పిలుస్తాడు. అయ్యో! నాయనా! బాసనులు మండిపోనూ, నువ్వు వచ్చిన సంగతే చూడలేదురా! బసవా! అంటూ గబగబలాడిపోతుంది. రాత్రి మునసబుదొడ్లో బసచేస్తుంది.

ఒకనాడు పురుగేదో ముట్టుకుందిలాగుంది, బసవడు పడిపోయాడని మునసబు తహాతహా లాడేటప్పటికి ఆయన భార్య ఆనందీశ్వరుడికి సహస్రఘటాభిషేకం మొక్కుకుని వెంకటేశ్వర్లుకి ముడుపుకట్టింది. కరణం భార్య సూర్యభగవానుడికి మొక్కి ఎడం చెయ్యి మీద కట్టుకుంది తరువాత మొక్కులు చెల్లించారు.

ఒక ఆవు వెంబడిపడి పొరుగూరు ఆబోతు భీమపురం వచ్చింది. ఒక ఆసామి బండి ఎడ్లని అమాంతం పొడిచింది. ఇంకొక దొడ్లో కట్టేసి ఉన్న గిత్తల్ని పొడిచింది. ఊరివారు దీనిసంగతి ఎట్లాగని ఆలోచిస్తున్నారు. రెడ్డి బసవడు ఊరినడిబొడ్డున నిలబడి పెద్ద అంకె పెట్టి యిట్లా ఊరిమధ్యలోకి వచ్చి నిలబడు అన్నట్టు గిట్ట నేలరాచి సవాల్ చేసింది. ఆ వచ్చిన ఆబోతు ఎట్లా పోయిందో ఎవరికీ తెలియదట.

ఒకరోజున మంచి పైరువేసిన పొలం మధ్యలో దిగి ఉన్నాడు రెడ్డిబసవడు. ఆ పొలం ముసలి కామందు చేనుగట్టున నిలబడి "బసవా! మాబోటి బీద రైతుల్ని కనిపెట్టకపోతే మా పిల్లలూ మేమూ ఎట్లా బ్రతకాలన్నాట్ట"

వెంటనే బసవడు గిరుక్కున వెనక్కి తిరిగి ఒక్క సరకైనా తిరక్కుండా డొంకెక్కి ఊళ్లోకి వెళ్లిపోయిందట.

బసవడు ఒక్కసారి పెద్దరైతు చేను గట్టువ్వటి మేస్తుంటే వాళ్ళ పెద్ద కమతగాడు పైనుంచి గడ్డిమోపెత్తుకుని వస్తూ అబోతుని అదిలిస్తే కదలకపోయేప్పటికి "ఓసి నీ అబోతు పాడుగాను! తేవేం - నీయమ్మ...... అంటూ ఏదో బండబూతు తిట్టాట్ట. అదిట్లు వినీవినడంతో పెద్ద అంకవేసి గట్టెక్కి బుసకొడుతూ కమతగాడికి ఎదురువచ్చిందట. వాడు హడలిపోయి నుంచుంటే చంపుతుందని భయపడి గడ్డిమోపు అక్కడే పారేసి పిక్కబలం చూపి ఊళ్ళోపడి ప్రాణాలు దక్కించుకున్నాడు. బసవడు కూడా వాడి వెంట వెళ్ళి ఆ రయితువాళ్ళింట్లో నుంచుని నుంచుని వెళ్లిపోతే అక్కడ అబోతు ఎందుకొచ్చిందని అడిగినా పాలనా చేయలేకపోయాడు గాని ఆ కమతగాడు మాత్రం అబోతు ఎదుటపడి ఎరగడట.

పశువులకు గత్తరవచ్చి దొడ్లలో పడిఉంటే బసవడు బయలుదేరి ఆ దొడ్ల లోకి వెళ్లి ప్రతినిత్యం వాటిని చూచుకొని చివరకు ఊరిమధ్యనున్న కొలుపుల నాదిరిం దగ్గరకువచ్చి నిలబడి పోయేదట.

౪

వెంకటాద్రి ఆ ఊరి ఇల్లంటుకం వచ్చాడు. 30 ఎకరాలు సేద్యం చేస్తున్నాడు. మంచి బలంలో ఉన్నాడు. రెండు మూడు పర్యాయాలు బసవడు అతని చేలవైపు కనపడితే రెల్లుకట్ట దిగేవరకూ తరిమివచ్చాడు. ఎక్కడైనా బసవడు కనిపిస్తే ఈర్ష్యగా చూచి ఊరికే చేలమీదబడి ఉన్నది తిండి తిని తెగబలిసిందనుకునేవాడు. ఒకనాటి ఉదయం వెంకటాద్రి తన దిబ్బమీద తుమ్మపీకెలు కొట్టి సాదులకు నిలబెట్టి ఎండబడి వస్తున్నాడు వాళ్ళ గడ్డిమను బసవడు మేస్తోంది. వెంకటాద్రి కోపంతో తిడుతూ అదిలించాడు బసవడు బుసగొట్టి ఎదురు పొరాయించింది. తిడుతూ కర్రతో ఒక దెబ్బవేశాడు వెంకటాద్రి. నందీశ్వరుడిలాగా మీద కొగబడింది అబోతు. కళ్లు తెలియని కోపంతో తనచేతిలో ఉన్న చేగొడ్డలితో నుదిటుపై ఒక పెట్టు పెట్టాడు వెంకటాద్రి. అధర్మపు గొడ్డలిపెట్టు మెదటికి వొచ్చింది, ధర్మరక్తం బయటికి చిందింది. బసవడు "అంబా"

అని ఒక పెద్ద రంకేసి వెంకటాద్రి వెంటపడింది. కళ్ళు, ముఖం రక్తసిక్తమయింది. వెంకటాద్రి పరుగు ప్రారంభించాడు. ఇక పరుగెత్తలేననుకున్నాడు. చచ్చిపోయినాననుకున్నాడు. తొందరచిందరతో డొంకలో ఉన్న చిన్న బావిచెట్టెక్కి వణుకుతూ కొమ్మల్లో కూర్చున్నాడు. బసవడు వచ్చి చెట్టుకింద పరవళ్ళు తొక్కుతూ బావిని నేలమట్టం చేయాలని చూస్తోంది. నాలుగు కాళ్లతో పడగొట్టగలదే కాని పగిలిపోయి ఉన్న ఆ నుదురు ముక్కలయితే యింకేముంది, అక్కడికీ బసవడి రాపిడికి చెట్టు గజగజ లాడిపోతోంది. వెంకటాద్రి ఎదగుండెతో నోరూ వాయీ లేకుండా ఎప్పుడో చచ్చాననుకున్నాడు,

వచ్చేపోయేవాళ్లు పెద్ద సంత చేరారు. చివరకు ఊరంతా అక్కడే చేరింది. కథ అంతా విని వెంకటాద్రిని తిట్టారు— కరణంగారి కవలగాడు ఊళ్ళోకి పరుగెత్తి కరణంగారితో బసవడితల వెంకటాద్రిగారు పగలకొట్టాడని చెప్పి ఏడిచాడు. కరణం గందరగోళంగా బావిదగ్గరకు వచ్చి యిదేం? నాయనా! యిట్లా కొట్టావని రోషంతో వెంకటాద్రిని అడుగుతూ యింకా ఎట్లా బ్రతుకుతుందిరా అని బసవడి దగ్గరకు రాబోయాడు—

బసవడు పెద్ద బుసకొట్టి ఒక పెద్ద పొట్లాటలో కొడుకుని వారించవచ్చే తండ్రిని కొడుకు "ఊరుకోవయ్యా! నీకు తెలియదు— వాళ్ల సంగతో నా సంగతో తేలేవరకూ నేను విడువను. నువ్వు నాదగ్గరకు రాక యింటికిపో" అని గద్దించేటట్టుగా — కరణాన్ని దరికి చేరనియ్యక వీడిని చెట్టు దిగనియ్య, పిండి పిండి చేస్తానన్నట్లు రంకెలు ప్రారంభించి రుద్రమూర్తి అయ్యింది— కరణంకూడ దగ్గరకు పోలేకపోయాడు—

ఎవరో కరణంగారి భార్యకు మన బసవడితల వెంకటాద్రి పగలగొట్టి చంపాడని వినిపించారు. ఆ వృద్ధయిల్లాలు అయ్యో! అయ్యో! నా తండ్రిని తలే పగలకొట్టాడూ! యింవాళ్ళ ఏ విషప్రరోజాగా నాయనా. అని అడుగుకుంటూ యింత సున్నం—బెల్లం ఒకగుడ్డ తీసుకుని బజారువెంటబడి ఆమాంతం బావిదగ్గరకు వచ్చింది. కరణం— భార్యను వారించి యిప్పుడు దగ్గరకు పోయావంటే నిన్ను తొక్కి చంపుతుంది. జాగ్రత్త! అన్నాడు. ఆ తల్లి— కరణాన్ని నిలూనాచూచి ఏమిటిది! యింతప్పుడిమట్టి పెంచుకున్న నాతండ్రి నన్ను తొక్కి చంపుతుందయ్యా! లెండి అడ్డం. చస్తే కొడుకుచేతులో

సేగా చావాలిసింది. అయ్యో! 'అట్లా తల పగిలి ఉంటే ఎట్లా ఊరుకున్నా రండీ' అంటూ గబగబా చెట్టు మొదట్లో ఉన్న బసవడిదగ్గరకు పోతోంది. బసవడు కోపంతో ఉండె, ఆమెను ఏమిచేస్తుందోనని అందరూ హడిలారు. బసవడు ఆమెను చూడటంతోనే అంబా అంబా అని అరిచి చెట్టుపైకి చూచి గిట్టలతో నేల గీకుతూ పెద్ద బుసలు ప్రారంభించి నువ్వెందుకు వచ్చావ్? నేను పొడిచి చంపేసి యింటికి వస్తానన్నట్టు తల్లి ఎదుట పిల్లవాడి మారాములాగా ఆడింది.

ఆ తల్లి చెట్టుపై వెంకటాద్రిని చూచి నాయనా! నిన్నేం చేసిందయ్యా! తోవనుపోయె దోవనువచ్చే తండ్రిగదా. యిట్లా గొడ్డాలితో ఎవరైనా కొట్టుకుంటారా? చేతులెట్లావచ్చినై అని, రా! బసవా! యివాళ ఎంత పాపిష్టి రోజురా! అంటూ ఆబోతు వేపుకు నడిచింది. పైజనమంతా ఆవిడను దగ్గరకు రాకుండా కోపంతో పొడిచితొక్కుతుందని భయపడ్డారు. బసవడు చిందులూ పరవళ్లూ మాని నిలబడింది, ఆవిడ దెబ్బమీద సున్నం బెల్లం కుక్కి గుడ్డ కట్టాలని ప్రయత్నిస్తుంది. ఆబోతు తల అంటనివ్వకుండా వాడిని తొక్కిచంపితేగాని ఈ రక్తం తుడవ నివ్వనన్నట్టు తప్పుకుంటుంది.

వెంకటాద్రి భార్య పరుగెత్తుకువచ్చి అమ్మగారూ! అయ్యని రక్షించి నాకు పసుపూ కుంకుమా నిలుపెట్టమని ఏడిచింది. కరణం భార్య బసవడిని "పదా! ఇంటికి అంటుంది. బసవడు అక్కడనుంచి కదలడు.

పడమటి పొలంమీద ఉన్న మునసబుగారికి ఈ వార్తచేరింది. ఒక్క అంగలో జువ్వి దగ్గరకు వచ్చారు. దృశ్యం చూచారు. కళ్లు చింతనిప్పులైనై. జనం ఒత్తుకున్నారు. బసవడి కంట్లోకి పైనుంచి నెత్తురు బిందువు జారింది. నాయుడు కళ్లెగరించి తీక్షణదృష్టి పాతజువ్విమీదనున్న వెంకటాద్రిమీద పడింది. పెద్ద శబ్దంతో ఏం బ్రాహ్మడా! మా ఊళ్ళో బ్రతకటానికి వచ్చి మా తలకాయలు పగలగొట్టి మా పెళ్లాల పుస్తెలు తెంపుకుందా మనుకున్నావా? ఇట్లా చిత్రవధ చెయ్యకపోతే ఎక్కడున్నా ఒక తుపాకి తెచ్చి కాల్చిపోయినావా? క్షణంలో నీ కోరిక తీరకపోయిందీ? ఇదేనా గోబ్రాహ్మణులంటూ చదువుకోటం? ఆహా! ఏం పుట్టుక పుట్టావయ్యా? నోరులేదుగదా అనుకున్నావా? ఈ ఘోరం వృథాపోతుందనుకున్నావేమో! ఇంతదెబ్బ తిన్నతరువాత ఇదేం

బ్రతుకవచ్చింది. గోహత్య మెడగట్టుకో తలచావు. అట్లా చేశావ్, అని గర్జించి బసవడికి పది అడుగుల దూరంలో నుంచుని కరణం భార్యవంక చూచి, అక్కయ్యా! ఎంత పిచ్చితల్లివమ్మా! ఆ గాయం సున్నంతో పూడుతుందా? తల్లీ! ఏంచేస్తాం. మనబిడ్డ పరాయివాడికి ముద్దా? అకృత్యం జరిగిపోయిం తరువాత ఎంతగోలపెడితే ఏం లాభం? పదమ్మా — యింటికి అని బుజ్జగించి బసవడి నెత్తుకునడిటి చూచి నీప్రారబ్ధం, మనకు అన్ని చేలుండగా ఇక్కడి ఏం బంగారం తిందామనివచ్చావు?, నాయనా! అని కన్నీళ్లు తుడుచుకుంటూ ఏమిటీ హంగామా యిక్కడ? ధర్మాన్ని తప్పి నడిచాడన్నమాట ఆయనకే యెరుగదనీ. ఇంతకాలం ధర్మరూపంగా ఉన్న నీవు వైధవ్యప్రాణం కోసం ఇంత కార్పణ్యం పట్టి బ్రాహ్మణ్ణి చెట్టు దిగనియ్యకుండా ఉక్కబెట్టి చంపజూడటం న్యాయమా! పదా ఇది ఊరుకాదూ? ఊళ్లో చిన్నా పెద్దా కలిసి ఏం న్యాయం చేస్తారో? అక్కడే తేల్చుకుందాం. భగవంతుడు చూస్తూ ఊరుకోడుగదా! పదమ్మా! అని సముదాయించాడు వెంకటరత్నం నాయుడుగారు.

వింటున్న ఆ మాటలకు జనం హృదయం ద్రవించింది. బసవడు ముట్టె నేలమీద పెట్టి యిస్సురమని గదలి ఊరు ముఖమయింది. ముందు కరణం గారి భార్య నడిచింది. తరువాత బసవడు. ఆ వెనుక మునసబు, తరువాత ఊరు జనం; వెంకటాద్రి చెట్టు దిగాడు. ఊరివారి తిట్లకు రోషం తెచ్చుకుని యిల్లు చేరాడు.

బసవడు సరాసరి గ్రామసావడిముందుకు వచ్చి నిలబడింది. పంచాయితీవారందరూ కూడారు. ఊరుమ్మడి సొత్తుకు హానిగలిగింది. కాబట్టి దానితరపున ప్రతివాదూ ఫిర్యాదీయే నంటున్నారు. ముద్దాయి వెంకటాద్రికోసం వెట్టివాడిని పంపించాడు. పశువుతో సమానంగా తాను పంచాయితీవారి ముందర నిలబడటానికి సిగ్గుపడ్డాడు. పిలువబడినందుకు రోషం; ఊరివారితిట్లకు కోపం వచ్చింది. వెళ్ళకుండా ఉందామనుకున్నాడు. "అట్లా పనికిరాదు. పెద్దమనుష్యులు పిలుస్తుంటే వెళ్ళటంమర్యాద సబబుకూడా" అంది భార్య. ఏమిటి సబబు? వాళ్ళ కార్యం ఆబోతుని కొడితే దాన్నితోలుకొచ్చి అక్కడ నుంచోబెట్టి పంచాయితా? పొలం పాడుచేస్తే కొట్టకూ? ముద్దుపెట్టుకుంటారా? మీ పిచ్చిముండాకొడుకుల చేష్టలు మీ ఊళ్లో సాగుతున్నై.

బసవడు కళ్ళనీరు కారుస్తూ మునసబు దొడ్లోకి వచ్చింది. ఏవో మందులు వేసి కట్లు కట్టారు. ఆనాడు మొదలు బసవడు పరక కొరకటం మానింది, నీరు తాగదు. కరణం మునసబు భార్యలు వచ్చి చేటతో తెలకపిండి పెట్టి బతిమాలారు. తినదు, నోట్లో తోస్తారు, ఉమ్మేసింది. ఇట్లా వారం గడిచింది. బసవడు సగమైంది. అందరూ విచారపడుతున్నారు. పదునైదు దినాలు జరిగింది. బసవడు వటించి ఉంది. దేవపశువు ప్రాయోపవేశం చేసిందని వేదన చెందారు. ఏకాదశి రాత్రి అంబా అని రెండుసార్లు అరిచింది. నరసింహారావు వెంకటరత్నం నారాయుడు వారి భార్యలూ దుఃఖపూరిత హృదయాల్తో దానిచుట్టూ కూర్చుని ఉండగా ఆ వృద్ధస్త్రీల కడుపుల్లో తలపెట్టి ప్రాణం విడిచి ఆ బసవడు పరమపదించాడు. మరణానికి ఆయూరి ఆబాలగోపాలం కన్నీరు విడిచారు. పెద్దఉత్సవంతో ఒకచోట బసవడిని ఖననంచేసి సమాధికట్టారు.

వైశాఖంలో వెంకటాద్రి భార్య ప్రసవించింది. ఆ శిశువు పుడుతూనే ఎద్దు రంకెలాగ శబ్దం చేసి ప్రాణం విడిచింది. వెంకటాద్రి తల్లి:- నాయనా! నీ కొంపకు అరిష్టం పట్టిందిరా! నీయిల్లు నిలువదురా! అని ఏడిచింది,

మరు సంవత్సరం మళ్ళీ వెంకటాద్రి భార్యకు కనేరోజులొచ్చినై. ఆవిడ ఏడుస్తూ తనకు అంబోతు దర్శన మిచ్చిందని తన కల భర్తకు చెప్పింది. వెంకటాద్రి ఒంటరిగా కూర్చుని పశ్చాత్తాపంతో కుమిలి తన అసత్యాన్ని నిందించుకొన్నాడు. అతడి తల్లి:- నాయనా! మనకు ఎవరుపుట్టినా ఆ బసవదేవుడిపేరు పెట్టుకొని వెండి బసవడిని దానమిస్తానని మొక్కించింది. సంతానం నిలిచింది. ఆయనకు 4 మొగ బసవలూ 3 ఆడ బసవలూ మాత్రం కలిగారు.

---

# 8. ఇల్లఱికము



౧

దుష్టమైన 1933 సంవత్సరం ప్రారంభించింది. "ఒళ్లు ఒడలుగానూ, ఒడలు బళ్లుగానూ మారటం" మొదలుపెట్టినై.

కాంట్రాక్టు ప్రకారం తాను ఇంగ్లీషుకంపెనీలకు సప్లయిచేయవలసిన సరకుల ధర పెరిగిపోవటంచేత అరుణాచల నాయుడు తన లక్షరూపాయిల ఆస్తిని కోలుపోవలసిన రోజు వచ్చింది.

కొంత స్థిరాస్తినీ, మేడనూ భార్యాపేర పెట్టి కొంత అన్యాక్రాంతం చేసి ఆ ఆపదలోంచి తప్పించుకోమని తన స్నేహితుడు నరసింహారావుపంతులు సలహా యిచ్చాడు. నాయుడుగారు ఆ ఆందోళన సమయంలో మనస్సు చెదరిపోకుండా నిగ్గబట్టి భార్యను పిలిచి "మనం చేసిన ఋణాన్ని మరో జన్మలో వాళ్ళకు నీచసేవచేసి తీర్చుకునేకంటే తృణమో, ఫణమో ఈ జన్మలోనే ఋణదాతలచేతిలోపెట్టి ఋణ విముక్తి చేసుకుందామని ఉంది, నీ సలహా 3 మాటల్లో తేల్చ"మన్నాడు.

సుశీలమ్మగారు మొదట్లో తమకు కలిగిన ఆపత్తుకు దుఃఖించినాకూడా "మీరు ఎట్లా చేయ సంకల్పించారో అట్లా చేయండి. నేను కాదనకండి, డబ్బును మనం గడిస్తున్నాం గాని మనని డబ్బు గడించలా. వీటికంటె నా కక్కర వేదీ లేదు. నన్నడగవలసిన పనిలేదండి."

నిష్కల్మష హృదయంలోంచి వచ్చిన ఆ సాధ్వి మాటలకు నాయుడు మరింత బలం తెచ్చుకుని నరసింహారావు పంతుల్ని పిలిచి ఆస్తీ అప్పూ లెక్కచూడమన్నాడు. పంతులు నాయుడుగారి యిష్టప్రకారము దాని తాలుకూడా వ్రాసేశాడు. ఆస్తికీ, అప్పుకూ సరిపోయింది కాని నాయుడుగారి నీతి ప్రతిష్ఠలు మాత్రం మిగిలినై, వాటిని మాత్రం ఏ ఋణదాతా కట్టుకోలేకపోయాడు. నాయుడుగారు తమ స్వంత మేడలోంచి లేచి అద్దింట్లో ప్రవేశించాడు. సంసారం బహుకష్టంమీద నడపాలిసొస్తోంది.

౨

నాయుడుగారి పెద్దకొడుకు శంకరం - వెంకటరత్నం రెండోవాడు. స్నేహితుల బలపాటంలోపడి శంకరం విశాఖపట్నంలో యఫ్.ఏ. మొదటి సంవత్సరం నుంచీ ప్రారంభించాడు. తనతో వచ్చిన కుర్రవాళ్ళందరితోనూ ఒక్క ప్రాణంగా హాస్టల్లో గడుపుతున్నాడు. బీద కుర్రవాళ్ళకు జీతాలూ, పుస్తకాలూ చేతనైనంత సహాయం చేస్తాడు. అతని ఔదార్యా

నికి స్నేహితులూ, ఉపాధ్యాయులూ మెచ్చుకుని చాలా గౌరవించేవారు. ఎల్లకాలం ఒకే రీతిగా గడుస్తుంది గనుకనా!

మొదటి సంవత్సరం బాగానే గడిచింది. రెండో సంవత్సరం రెండోరకంగా గడిచింది. గవర్నమెంటు పరీక్షలు కూడా జరిగినై. అందులో ప్యాసయి బి. ఏ. లో చేరాడు. తండ్రితోపాటు తనకూ దుర్దశ ప్రారంభించింది. నాయుడుగారు కొన్ని నెల్లు పెటపెట మీద డబ్బు పంపగలిగాడు గాని చివరకు తన అసహాయతన్ని తెలియపరచాడు శంకరానికి. కుటుంబ దుస్థితికి శంకరం తపించిపోయి తండ్రిని ఇబ్బంది పెట్టకుండా చదువు ఆపుకుందా మనుకున్నాడు. "దానికంటే బి. ఏ. ప్యాసయి ఉద్యోగం చేసి కుటుంబ సంరక్షణ చేయటంగౌరవ" మని స్నేహితులన్నారు. స్నేహితులకు తెలియకుండా ఎక్కడైనా ట్యూషనులు మాట్లాడుకుని జీతం హాస్టలు ఖర్చులు సంపాదించుకునేందుకు ప్రయత్నం చేస్తున్నాడు శంకరం. శంకరానికి తెలియకుండా జీతం హాస్టలు ఫీజు కడుతున్నారు స్నేహితులు. దుస్తులు కూడా సద్దుతున్నారు. ఇట్లాగే మర్యాదగా ఆ సంవత్సరం గడిచింది. బి. ఏ మొదటి తరగతిలో ప్యాసయినాడు. స్నేహితులందరూ చేరి విందులూ వినోదాలు జరుపుకుని ఎవరి ఊరికి వారు వెళ్ళారు.

## 3

అతుకాపటం నాయుడుగారిని ఒకరిద్దరు స్నేహితులు "మేం డబ్బు పెట్టుబడి పెడతాం. మళ్ళీ వ్యాపారం చేసి బీదరికాన్ని వదలించి బయటపడ మన్నారు. నాయుడు తన సహజ గాంభీర్యాన్ని విప్పి "ఇక నేను పెద్దవాడనైనా— నా కొడుకులు చేతికందొచ్చారు, వాళ్ళే సంసార బాధ్యత వహించి తల్లిదండ్రులను పోషించుకుంటారు; వెన్నెల తరువాత చీకటి వస్తూనే ఉంటుంది, ఇక నేను దిగులు పడవలసిన పని లేదన్నారు. ఈ ఊరునుంచి లేస్తానేమోకూడా" అన్నారు, తన ఆప్తుల్లో ఒకరైన నరసింహారావు పంతులుగారు ఒకరోజు సాయంకాలం ఏదో ప్రసంగం చేస్తూ "నాయుడుగారూ! నువ్వు సదాశివనాయుడుగారిని ఎరుగుదువు కాదూ?" అన్నాడు.

నాయుడు:- బాపట్ల నాయుడుగారేనా ?

పంతు:— ఔను,

నాయుడు:— కొద్ది పరిచయమే—అదీ నీ ద్వారా కలిగిందే కూడా...!

పంతు:— ఆయనకు కొంచెం బాగా కలిసొచ్చింది, గవర్నమెంటు తరఫున పనిచేసి పేరుకూడా సంపాదించాడు. ఆయనకు ఒక్కటే ఆడపిల్ల. పెళ్ళి సంబంధం అనువైంది కుదిర్చిపెట్టమని రెండు మూడు పర్యాయాలు మనదగ్గరకొచ్చాడు. టెలిగ్రాంమీద పిలిపించుకు మాట్లాడాడు కూడా.

నాయుడు:— అట్లాగైతే మన రమణయ్యనాయుడు సంబంధం మాట్లాడక పోయావా, 40-50 వేల ద్రవ్యం ఉందికూడాను.

పంతు:— అయితేమాత్రం కుర్రవాడికి చదు వెక్కడి నుంచి తెద్దాం ? పిల్ల చదువుకున్నది కూడాను. అటువంటి వరహీనం నా కిష్టం లేదు.

నాయుడు:— అయితే వారికి సరిపోయిన వరుడు కనపడుటలేదే.

పంతు:— కనపడకపోవటమేమిటి! మన శంకరం లేడూ! నాకు ఎంత దేశం తిరిగితే మాత్రం మనసంబంధంవంటిది తేగలరా ?

నాయుడు:— పంతులూ! అది ఒకప్పటి మాట అయితే కావచ్చుగానీ, యిప్పుడనుకోటం హాస్యాస్పదంగా ఉంటుంది.

పంతు:— ఔనయ్యా! అట్లాగనే నేనూ అన్నా! అంటేనేం. ఆనాయుడు నీ కొడుకునే తప్ప ఒప్పుకోటల్లా. నేనేం చేయాలి విశాఖపట్నంలో మన శంకరంతో చదువుకున్న ఇద్దరు కుర్రవాళ్ళు ఆయన బంధుగులట. "మీ పరువు మర్యాదలను గురించీ, శంకరం తెలివితేటలూ ధర్మగుణం నీతి వర్తనాన్ని గురించీ సదాశివ నాయుడుగారికి, ఆ పిల్లకూ చెప్పారుట." అందుచేత మీ అబ్బాయి మీదనే మక్కువపడి ఉన్నారు. మనసంబంధం నా ద్వారా అయితే తప్పక జరుగుతుందని నన్ను నుంచోనీయటల్లా; కూర్చోనీయటల్లా; ఏం చేస్తావో!

నాయుడు:—నువ్వుకూడా అట్లా అంటే నేనేంచెప్పను? వాళ్ళతో ఈస్థితిలో మనమేం తూగగలం? ఏమన్నా ఆలోచనఉందా?

పంతు:—అదంతా వాళ్ళే ఆలోచించుకొని అన్నీ ఏర్పాటులూ చేసు

కున్నారయ్యా! నువ్వు ఊరికే పెళ్ళికి వెళ్ళి వధూవరులను ఆశీర్వదించి రావటమే.

నాయుడు:—పంతులూ! ఇక నన్నేమీ అడగక నీయిష్టమొచ్చినట్లు చెయ్యి. నా జీవితం, కుటుంబ పరువు, మర్యాదలూ నీ కెరుగనివాడివు కాదుగదా!

పంతు:—అయితే యిదొక్కటి విను ఆదిమాత్రం ఆలోచించుకోవాలి. సదాశివనాయుడు భాగ్యవంతుడు. దైవకృపవల్ల అతనికి కలిసివస్తోంది, యుద్ధపరిస్థితులలో గవర్నమెంటులో పలుకుబడికూడా వొచ్చింది. అయినవాడూ ఒక్క పిల్ల. వెనకాముందు లేదు. మన శంకరాన్ని అల్లుడుగా చేసుకుని తనయింట్లో అట్టేపెట్టుకుని ఇతని తోడుతో తన ఖ్యాతిని గవర్నమెంటులో పదిముఖాలా వ్యాపింప చేసుకోవాలని తలుచుకుంటున్నాడు. కానీలే! అతని తంటాలు అతన్ని పడనీ. మనం పైనుండి చూస్తూఉందాం. ఎక్కడఉంటేనేం; నీ కొడుకు కాక పోతాడా...?

సుశీలమ్మగారు తలుపు చాటునుంచి "అన్నయ్యా! వివాహసంబంధం విషయములో శంకరాన్ని కూడా విచారించండి." అంది.

ఆ రాత్రికే తల్లీ, తండ్రీ, కొడుకూ, పంతులూ చేరి సంబంధంవిషయం చర్చించుకున్నారు. చివరకు తండ్రి ఆజ్ఞతో శంకరం అత్తవారి యింట్లో ఉంటూ కుటుంబాన్ని సంరక్షించుకునేందుకు ఒడబడ్డాడు.

పంచమిరోజున సదాశివనాయుడు లగ్ననిశ్చయానికి వచ్చాడు. అరుణాచల నాయుడుగారి మర్యాదలకు ఆనందం పొందాడు. శంకరంగుణగతాలూ రూపరేఖ విలాసాలూ ప్రత్యక్షంగా చూచి చాలా మెచ్చుకున్నాడు. ఇటువంటి కుర్రవాడు తనకు అల్లుడై తన యింట్లో, తన కూతురుతో తిరుగుతుంటేనే చాలు. తనయిల్లు శోభాయమాన మనుకున్నాడు. ఇన్ని మేడలూ, లక్షలూ ఉన్నవాడికి ఇద్దామని పెంకితనంచేసే తన యిల్లాలు కూడా శంకరంయొక్క వర్చస్సూ, గుణాలూ చూస్తే తప్పక ఈ సంబంధం చేసుకుందామని పట్టుపడుతుం దనుకున్నాడు. ఇక చంద్రిక యిటువంటి విద్యాపాటవాలు గలిగిన భర్తను రాత్రింబగళ్ళు ఎడబాటులేక చంద్ర చంద్రికలవలె జీవితం గడుపుకుంటూ సంతోషిస్తుం దనుకున్నాడు.

నెలాపదునైదురోజుల గడువుతో లగ్ననిశ్చయం చేసుకుని నాయుడుగారు లేచారు. అందరూ లేచారు. శంకరాన్ని ఏవోమాటలుపెట్టి నాలుగడుగులు

పైకి తీసుకెళ్లి ఈ పచ్చఉంగరం పెట్టుకుని నాకు సంతోషం కలిగించమని సదాశివనాయుడు కోరాడు. శంకరం సందేహించాడు. నాయుడు బలవంతంచేసి శంకరం వేలికి పెట్టాడు. శంకరం వినమ్రుడై – "అయ్యా! భోగభాగ్యాలకంటే నాకు కుటుంబపోషణ ప్రధాన కర్తవ్యం – దానికి తోడు నా స్వాతంత్ర్యాన్నికూడా ప్రధానంగా భావించే వ్యక్తి" నన్నాడు.

"అయ్యో! నాయనా! దాని కేమి కానగలరు; మనమంతా బంధుకోటిలోవారమేగా. ఒకరిమర్యాదలు ఒకరు కాపాడుకోవాలి – అన్నీ నాకు తెలుసు; ఇకపోయి వస్తా. మీరు మీసన్నాహంలో ఉండండి. నాటి విషయమంతా మన నరసింహారావుపంతులుగారి ద్వారా ఏర్పాటవుతై. ఇక నువ్వు ఆగు నాయనా!" అన్నారు. శంకరం "సెలవు" అన్నాడు. నాయుడు "మంచిది నాయనా" అన్నాడు.



తను యుద్ధానికి సప్లయిచేసిన తిండిపదార్థాల్లోనూ, ఇంకా ఇతర వ్యాపారాల్లోనూ లాభం వచ్చిన 70 వేలల్లో సగమయినా ఖర్చుచేసి వివాహం పేరు మోగేటట్టు చేయాలని నిశ్చయించాడు. పెద్దపెద్ద పందిళ్లు వేయించాడు. వివాహమంటపం పట్నంనుంచి శిల్పపనివాళ్ళనురప్పించి అలంకరింపచేశాడు. తఫాతాక రకం పూలపల్లకీ పురమాయించాడు. పెళ్లికి వచ్చిన అందరికీ గదులుగదులు విడుదులు ఏర్పాటు చేశాడు. ముహూర్తం సాయంత్రం 7-25 నిమిషాలకు. రకరకాల ఎలక్ట్రిక్ దీపాలు తోరణాల్లోనూ పూలగుత్తుల్లోనూ, మంటపంలోనూ దివ్యంగా మెరిసిపోతున్నై. బంధుగులందరూ పెద్దపెద్ద తలగుడ్డలతో తివాసీలమీద వేంచేశారు. ఉద్యోగస్థులందరూ ఒక ప్రక్క కుర్చీల్లో కూర్చున్నారు. బ్రాహ్మణశ్రేష్ఠులంతా ఆశీస్సులు చదువుతూ కూర్చున్నారు. స్త్రీ బృందమంతా పరదాలల్లో ప్రవేశించారు.

తెరసెల్లా తీశారు. మంటపస్తంభాల్లో అమర్చిన పెద్దపవరు గలిగిన నాల్గు బల్బులను గప్పున వెలిగించారు. ఆ వెల్తుర్లో వధూవరులు మెరిసిపోయారు. అందరి చూపులూ అటే పరుగెత్తినై.

అందరికీ పెళ్ళికూతురు కంటె పెళ్లికొడుకే అందగాడనిపించింది. అతనికి

ఉత్తమవిద్య అబ్బటం కూడా శోభాయమానంగా ఉందనుకున్నారు. చంద్రిక శంకరాన్ని సిగ్గుతో తేరిచూడలేక ఓరగా చూచింది. శంకరం ఆచూపులకే బ్రహ్మానందం పొందాడు.

రాధమ్మగారు కూతుర్నీ, అల్లుడినీ కరువుతీరా చూచుకు సంతోషించి "భాగ్యం మాట అటుంచితే బంగారంలాంటి అల్లుడు వచ్చా" డనిమురిసింది. ముత్తైదువలు మంగళహారతులు పాడారు. భోగంవాళ్లు పెళ్లిపెద్దలు మీద సరాగాల పాటలు పాడారు. వచ్చినవారందరూ శంకరంయొక్క విద్యావినయాలకు మెచ్చుకొని అనుకూల దాంపత్యం కుదిర్చినందుకు సదాశివనాయుడుగారిని శ్లాఘించారు. అరుణాచలంనాయుడుగారు అరణాలక్రింద రెండు వేలు చదివించారు. పంతులు సభాసదులకు పుష్పమాలలూ, కర్పూర దండలూ వేయించి ఆశీర్వదించాడు.

పెళ్ళి ఫెళ్లుమని జరిగిపోయింది. శంకరం భార్యతో కలిసి తలిదండ్రులకూ, అత్తమామలకూ వధూవర్గంతో నమస్కారాలు చేశాడు. చక్కటి విద్యావంతుడైన మగడు దొరికాడని చంద్రిక ఉబ్బిపోయింది. తమరు వాగ్దానం చేసిన ప్రకారం వివాహానంతరం వీరులకు పెట్టుకోవాలని కోరుతూ కోడల్ని, బంధువర్గాన్ని తీసుకుని అరుణాచలంగారు వెళ్లారు.

౨౪

సదాశివనాయుడుగారు తన అల్లుడిని నెమ్మది నెమ్మదిగా రాజకీయ రంగంలో ప్రవేశపెట్టాడు. పెళ్ళయిన నాలుగు మాసములలో రెండుపర్యాయాలు తన పనిమీద గవర్నరుగారి సందర్శనానికి పంపాడు. లోగడ తనకు అనుకూలంగాని పనికూడా గవర్నరుగారివల్ల శంకరం చేసుకు రాగలిగినందుకు సంతోషించాడు. రెండోపర్యాయం తన మగనిని పట్నం నుంచి త్వరగా పనిచేసి పంపలేదని చంద్రిక గవర్నమెంటు ఉద్యోగులమీద అలిగి "నాకే కనక అధికారముంటే వాళ్ళని డిస్మిస్ చేసేదా"న్నంది. తండ్రి సంతోషించాడు.

చంద్రిక శంకరాన్ని స్వంతంగా కాస్తైనా దూరం కానిచ్చేది కాదు. అతను పనిమీద ఊళ్లోకి వెళితే వచ్చేంతవరకూ పై అంతస్తు గదిలో కిటికీ ప్రక్కన కూర్చుని అతనికోసం దారికాస్తూ ఉంటుంది. ఎంత పనిలో ఉన్నా

సరే రోడ్డుమీద ఎవరి కారుమోత వినపడ్డా వరండాలోకి వచ్చి చూచేది. కారు ఆగకుండా పోతుంటే "ఛా! వెధవ కార్లు ఒట్టిరొద. పనీ, పాటా లేకుండా పరుగెత్తుతూ ఉంటై." అని విసుగుతూ లోపలికిపోయేది. శంకరం కాస్త ఆలస్యంగా యింటికి వచ్చాడంటే "ఏమండీ! దొరగారూ! బయటి వాళ్ళు మిమ్మల్ని త్వరగా వదలిపెట్టరా? లేకపోతే మీరే వాళ్ళని వదలి పెట్టరా? ఏమిటీ! అంత పని; ఒళ్ళు విరగదీసుకుని చేస్తేనేగాని పనులు గావా? అట్లాగైతే ఎందుకింతమంది గుమాస్తాలూ, అన్ని పనులూ మీరే చేసుకుంటుంటే" అని గుమాస్తాలమీద కంటుతనాన్ని చూపించేది.

శంకరం కారుదిగి లోపలికి రావటంతోనే వెంటనే ఉండి కోటూ, ఉత్తరీయం అందుకుని ఎలక్ట్రిక్ పంకా క్రిందకు కుర్చీలాగి తాను ఎదురుగా కూర్చుని "పాపం! అలసిపోయి వచ్చారు." అని పదే పదే అనుకునేది.

నౌకరువచ్చి "బాబుగారూ! ఎవరో వచ్చి తమకోసం హాల్లో ఉన్నారని" శంకరంతో చెప్పాడంటేసరి చంద్రిక చరచరావచ్చి "ఏరా! నీ కింకా పనేమి లేదేమిట్రా! పో! వస్తారు, కూర్చోండని చెప్పలేవూ!" అని కసిరేది, శంకరానికి వచ్చేటట్లుగా. "ఒన్నే కాస్సేపు కూర్చొంటారు లెద్దురూ. మీరు హడావిడిపడి తిరుగుతుంటే ఆరోగ్యం చెడుతుందని సలహా యిచ్చేది. శంకరం లేచి వెళ్ళబోతుంటుంటే "ఇదిగో చూడండి! ఏదో చెబుదామనుకున్నానండీ! ఒక రహస్యం చెపుతా కూర్చోండని" మాటా మాట్లుపెట్టి ఆపాలని చూచేది. శంకరం నవ్వుతూ "అట్లా అంటే ఎట్లా మరి! త్వరగా వస్తాగా" అనేవాడు. "చూస్తాగా క్షణంలో రాకపోతే" అంటూ గది బయటువరకూ వచ్చేది.

ఒకరోజు సాయంకాలం ఆఫీసునుంచే "అర్జంటు పనిమీద బెజవాడ వెళుతున్నా"నని అమ్మగారికి కబురంపి శంకరం వెళ్ళిపోయాడు. ఇంకా వస్తాడని దోవలు చూచుకుంటూ కూర్చున్న చంద్రికకు రాత్రి 8 గంటలకు తెలిసింది. వెంటనే వంటవాడిని కసిరి గదిలోకిపోయి పడుకుంది. వంటలవాడు నాయుడుగారితో "అమ్మాయిగారు భోంచెయ్యకుండా పడుకుం"దన్నాడు. తల్లి వెళ్ళి చంద్రికను బుజ్జగించి వంటింట్లోకి తీసుకెళ్ళి అన్నం పెట్టింది. తండ్రి కంటపడకుండా వెళ్ళి అన్నం అటూయిటూ తోసి లేచి పోయి గదిలో పడుకుంది. కళ్ళు ఎర్రబడి ఉన్నై.

కంట్రాక్టుల్లోనూ, మిల్ భాగంలోనూ బాగా లాభం వచ్చింది. అన్ని పదార్థాలకూ ధర పెరిగిపోయిందని శంకరం స్వతంత్రించి ప్రతి నౌకరుకూ 10 రూపాయలు జీతం పెంచాడు. మామగారు ఆమోదించాడు. అందరూ శంకరాన్ని ధర్మప్రభు అన్నారు.

శంకరం బయటికి పోకపోతే వ్యవహారాలు కుదిరేటట్టు కనుపించవు. చంద్రికకు శంకరం ఇంట్లో ఉండకపోతే నిమిషం గడిచేటట్టు కనిపించదు. వారిద్దరిమధ్యా రాజీ కుదర్చటానికి రాధమ్మగారూ, నాయుడుగారూ తికమక పడతారు.

శంకరం ఏదన్నా పరధ్యానంగా ఉండి చంద్రిక మాటకు సమాధానం చెప్పకపోయినాడా అంటే "ఇంటిదగ్గరనున్న కాస్సేపయినా యిట్లాఉంటే నే నిక్కడుండు కేమిటి! నే వెళ్లుతున్నా"నని చంద్రిక బెదరించి అలిగేది. శంకరం ప్రియోక్తులతో చంద్రికను సమాధాన పరిచేవాడు. శంకరాన్ని విడిచి ఉండటమంటే చంద్రికకు ప్రాణసంకటముగా ఉంటుంది. శంకరం ఎప్పుడూ ఏదో అసంతృప్తిగా ఉన్నట్టే కనిపిస్తూ ఉండేవాడు. చంద్రిక "ఎంతచేస్తున్నా యింతే, అదేమిటో చెప్పి చేయించుకోకూడదూ" అని నిష్కర్షగా అడిగేది. శంకరం బయటి హాల్లోకి వెళ్లి కూర్చునేవాడు. చంద్రిక శంకరాన్ని మేడమీదకి తీసుకువచ్చి "అట్లా ఉలుకుతా రేమండీ! మీ కట్లాగూ ధర్మప్రభువు అని పేరు పడ్డాక. ఇక నేనేగా? నన్నే కానివ్వండి" అనేది.

౬

"చంద్రిక అప్పుడప్పుడు మొండిపట్టు పడుతుందనీ- తెలివితక్కువగా మాట్లాడుతుందనీ నాయుడుగా రన్నారు. "మీరట్లా అనకండీ! గారాబంగా పెరిగిన పిల్ల గనక కొద్దిగా లోకజ్ఞానము తక్కువ. మనమే దాన్ని అట్లా అంటే ఇంకా పైవాళ్ళు మన్నిస్తారేమిటి? ఊరుకోండీ!" అంది నాయుడుగారి భార్య రాధమ్మగారు.

"అట్లా అనక-నిన్న శంకరం"-'మానాన్నగారికి 4 రోజులనుంచీ సుస్తీగా ఉందట నేనూ మీ అమ్మాయీ వెళ్లి నాల్గురోజులుండి క్షేమం చూచుకుని వస్తా'మంటె పిచ్చిపిల్ల వెంటనే - "ఏమంత పెద్ద జబ్బులెద్దూ? అవి

మామూలు జ్వరాలే; హడావిడి పడకండి– రేపొద్దున్నా పండగకి వెళ్ళవద్దా" మంటుండే! తప్పుగాదూ? ఎవరి తలిదండ్రులమీద వారికి ప్రేమ ఉండదూ? అతను తెలివితేటలు గలవాడు గాబట్టి "అట్లాగా" అంటూ చురుగ్గా వెళ్లిపోయాడు. సరిగ్గా మెట్లు దిగాడో, లేదో "నాన్నగారూ! అక్కడకు వెళ్లాలి– వెళ్లాలి అంటారు. అక్కడ రోజంతా పులుసు తింటామనీ, నన్నుకూడా రమ్మంటారు. నన్నా పూరిపాకలో కూర్చోపెట్టాలని కాబోలు" అంది. అతను విన్నాడేమోనని నాకు చచ్చినచావయింది. నాకే కోపం వచ్చింది– మళ్ళీ అతను వినిపించుకుపోతే పట్టి పిచ్చిదైపోతుంది," ఊరికే దాన్ని అరడి పెట్టకుండని రాధమ్మ నొక్కింది-

మరొకరోజు శంకరం భార్యతో సహా తండ్రిని చూట్టానికి పేటకు వెళ్ళాడు. అమ్మా, నాన్నా చాలా సంతోషించారు. తన చదువును గురించి వెంకటరత్నం తన అన్నగారికి చెప్పాడు. తండ్రి శంకరాన్ని పిలిచి "నాయనా! ఈ రోజు నాకు కులాసాగా ఉంది. నీతో కూర్చుని పథ్యం తింటా"నన్నాడు.

శంకరం తన తల్లికి బెనారసుచీర చంద్రికచేత ఇప్పించి నమస్కారం చేయించాడు. తండ్రికి కుటుంబఖర్చులకింద రెండువందలు ఇచ్చాడు. డబ్బుకు చాలా కటకట పడుతున్న అరుణాచలం చాలా సంతోషించి "తమ్ముడిని కనిపెట్టి ఉండు నాయనా! అన్నాడు.

"మిమ్మల్ని ప్రతిదినం చూడాలని ఉంటుంది. మీరువచ్చి ఆ ఊళ్ళోనే – పోనీ దూరంగానే ఉంటే నాకు చాలా సంతోష" మన్నాడు శంకరం. నాయనా! నీ కింకా లోకానుభవం తక్కువగానీ, ఇక్కడే ఉండనీ" అంది తల్లి. నిజమే నన్నారు నాయుడుగారు.

చంద్రిక ప్రతిరోజూ ప్రయాణమవుతూ ఇంటికి పోదామని శంకరాన్ని తొందర పెడుతుంది. "న్యాయానికి యిదే నీయిల్లుగాని, అది కాదని" శంకరం నెమ్మదిగా మందలించేవాడు. "నా కిక్కడేమి తోచటంలేదు, చూడటం అయిందిగా, పోదాం పద"మంది చంద్రిక. "నీ తలితండ్రులు నీ కెట్లాగో నావాళ్ళూ నా కంతే, తెలుసుకో"మ్మని రోజూ జరుపుతున్నాడు.

అత్తగారు కోడల్ని ప్రేమగా లాలించింది. కోడల్ని నాన్నగారు మురిపంగా చూచాడు. వెంకటరత్నం వదినగార్ని భక్తితో చూచాడు. చంద్రిక పీటి నన్నిటినీ గడించక "యింటికి పోదా" మంటుంది. శంకరం "నువ్వు వెళ్ళు. మా తమ్ముడిని ఇచ్చి పంపుతా, నేను వెనకాల వస్తా"నన్నాడు. చంద్రికకును కోసంవచ్చి "ఔను ఎంత, చేస్తేనేం; ఎంత ఉంటేనేం. ఏనాడచిలక ఆనాడపలుకు పలుకుతుం"దనుకుంది. శంకరానికి అవమానం తోచింది. కోడలురొక్క అసంతృప్తిని అత్తమామలు గ్రహించి శంకరాన్ని "నాయనా! ఎక్కడివాం ళ్ళక్కడ ఉండటం మంచిది, మంచిరోజు చూచుకుని ప్రయాణమై వెళ్ళం" డన్నారు. శంకరానికి మరీ అవమానం తోచింది. తండ్రిని కుటుంబజరుగుబాటును గురించి హెచ్చరించాడు శంకరం. తల్లి అందుకుని "నాయనా! భగవంతు డున్నాడు. అవన్నీ తడవక - అవన్నీ భగవంతుడికే ఎరుక - అదృష్ట దురదృష్టాలు ఎవరివి వారివే. ఎందుకు నువ్వు కూడా ఖేదపడటం?"అని సంభాషణ మార్చింది. శంకరానికి అప్పుడో లేనంత దుఃఖంవచ్చింది. "అమ్మా! మీరు కష్టపడ నవసరంలేదు. ఇంకా డబ్బు పంపుతా; ఎప్పుడూ కష్టాలు ఇట్లా ఉండవులే" అన్నాడు.

తల్లి శంకరం మాటకు అడ్డొచ్చి "నాయనా! అట్లా పెట్టుకోకు. నువ్వు కావాలని వారు తీసుకు వెళ్లారు. అందుకు నాయనగారు ఒప్పుకుని పంపారు. నువ్వు మామచాటు నుండవలసిన వాడవు, స్వతంత్రించకు. మనుష్యులకంటే చేతలు కలకాలా లుంటై. వా రందరి క్షేమం కోరుచున్నావన్నా, మా క్షేమాలు కనుక్కుంటూ ఉండి, గోనెడు కొడుకుల్ని అంకెడు కూతుళ్ళనీ కని శతాయుష్మన్నవై వర్ధిల్లండని కొడుకునూ, కోడల్ని అశీర్వదించి హితోపదేశం చేసింది. శంకరం తల్లి మాటలకు కలవరపడి "అమ్మా! నన్ను పెంచి పెద్దచేసిన మీ ఋణమెట్లా తీర్చుకోవాలి! చెప్పు, ఇట్లా నువ్వనటం న్యాయమేనా! పెద్దవాళ్లు మీరుపడే యిబ్బందులు చూచి నేను భోగాలనుభవించగలనా!" అని విన్నపోయాడు శంకరం.

అరుణాచలం శంకరాన్ని బుజ్జగించి మాకు అన్ని అనుభవాలూ అయినై. వాటినిగురించి నువ్వు విచారించకు. "కలిమిలేముల విషయం నాకు బాగా తెలుసు, నువ్వు దిగలాపడ పనిలేదు," అని చెప్పి - "అయితేఅట్లాగే నేమిటి వాడికి చెప్పాలిసిం"వని భార్యను మందలించాడు నాన్న. తల్లి

"నాయనా! నిన్ను కష్టపెట్టాలని నా ఉద్దేశం కాదురా" అని నొచ్చుకుంది. చంద్రిక ఇంటి కెప్పుడు వెళదామంది. అన్నదే కాని శంకరం ముక్కు-గోళంలోంచి బయటికివచ్చిన వేడినిట్టూర్పును తెలుసుకోలేక పోయింది. ఇంకోమాటు శంకరంతో చంద్రిక "మీ వారికోసం అంత తపన పడకపోతే వారినే మన ఊరురమ్మని మన వాటిల్లోది ఏదయినా చిన్నకంట్రాక్టు ఇచ్చి సుఖజీవనం చేయించరాదూ" అంది.

కాని నిస్తేజమై గాజుగుడ్లలాగా నిలిచిపోయిన శంకరం అక్షియుగళాన్ని గుర్తించలేకనూ పోయింది; దడదడ లాడిపోతున్న గుండె మోతనూ చంద్రిక వినిపించుకోలేక పోయింది.

౨

శంకరంలో మార్పు కనిపిస్తోంది. అందరితోనూ యథోచితంగానే ఉంటున్నాడు. ముఖ్యవిషయాల్లో మాత్రం జోక్యం తీసుకుని తక్కినవి మామగారికి వదుల్తున్నాడు. అత్తగారు "పిలిచి పిల్లనిస్తే...అన్న సామెంత చెప్పి తమ్ముడికి కూడా కొంత ఆస్తియిస్తే అబ్బాయి దుగ్ధ తీరుతుందేమో" అందిట. అట్లా అన్నట్టు శంకరానికికూడా తెలిసిందట! ఇట్లా జరిగి జరిగి ఏంకొంప మునుగుతుందోనని సదాశివనాయుడు భయపడ్డాడు. కూతుర్ని జాగ్రత్తగా సంచరించి భర్తను దక్కించుకొమ్మని సలహా యిచ్చాడు.

శంకరం ఎప్పుడూ ఉదాసీనుడుగానే ఉంటాడు. భర్తయొక్క మనోవేదనను గుర్తించుకోలేక పోతుందిగాని, తనకు అభిముఖుడై తనకు సంతోషం గలిగించేందుకు భర్తకు అనేక సేవలు చేయబోతుంది.

శంకరం కొన్ని వారాలనుంచీ జరీబట్టలుమాని, మామూలురకం బట్టలు వేసుకుంటున్నాడు. "నాకుమాత్రం ఈ చీర లెందుకు! సాదా చీరెలు తెప్పించ" మని చంద్రిక అడుగుతోంది. ఫలాహారాలు మానేసి వేళకు భోజనమే చేస్తాడు శంకరం. "మీరు తినకపోతే నాకు మాత్రం ఏం సహించి ఏడుస్తుంది! నేనూ తిన" నంది చంద్రిక.

చంద్రిక నీళ్ళుపోసుకుని రెండు మాసాలయింది. వేవిళ్లతో అన్నం తినదు. ఫలాహారం కూడా, శంకరం తిననిది తినదు. రాధమ్మగారు కూతురికి హితోపదేశము చేసింది.

శంకరం ఏదో ఆలోచిస్తూ పడకకుర్చీలో కూర్చున్నాడు. చంద్రిక ఎదురుగా వచ్చి నిలబడి ఏదో సంభాషణ ప్రారంభించి "ఏమండీ! ఎప్పుడూ ఈసురో అంటూ ఉంటున్నారేమిటి! మీ కేం తక్కువయింది? చెప్పండి!" అంది. శంకరం చివాలున లేచి కూర్చుని "మరేం లేదు. వ్యక్తిత్వం లోపించింది. మీరు కావా అనుకున్నారుట - వారు దానికి అంగీకరించారుట" అంటూ చంద్రికవంక చూచాడు. చంద్రిక మెరసిపోతూ కళ్ళతో "అట్లాగే ఉంది; అనుభవించే గీత లేకపోతే అందలాన ఎక్కిస్తే నేం; దంతసిరి ఉండాలి, దేనికైనా. అంత పాల నలత పిల్లకాయకు మళ్లే నక్కూరుపడకపోతే అమ్మదగ్గర నాలుగురోజులుండి రారాదూ! చవ్వలు మరీ ముద్దు వస్తున్నై." అని నవ్వింది.

"అట్లాగా మంచి సలహా యిచ్చావు. బుద్ధిమంతురాలైన భార్య హితాలు యిట్లానే ఉండా"లంటూ లేచాడు. రాధమ్మ గోడవతలే ఉండి ఆపుకో లేక తుమ్మింది. "ఔనా సత్యం; మంచి ఉపదేశమే. అత్తగారుకూడా యిక్కడే ఉన్నారేమిటి! భార్య అంటే భర్తకు ఇంత తోడునీడగా ఉండా"లంటూ క్రిందకు పోయాడు. చంద్రిక గడగడలాడిపోయింది. "అమ్మా! ఆయిన్ని చూడలేకపోతే క్షణం ఉండలేనే" అంటూ ఏడిచింది. రాధమ్మ గొణుక్కుంది.

౮

తూయప్రపోయేం రైలు సరిగ్గా తెల్లవారుజామున గం. 4-20 నిమిషాలకు వచ్చింది. తెల్లవారితే పంచమీ శనివారం. సదాశివనాయుడుగారి నౌకరు చాకలి సుబ్బడు పెళ్లాన్ని పుట్టింటికి పంపటానికి స్టేషనుకు వచ్చాడు. పెట్టెలన్నీ జనసమ్మర్దంగా ఉన్నై. సుబ్బడు ఎట్లాగో తన పెళ్లాన్ని పెట్టెలో ఎక్కిస్తున్నాడు. ఎవరో తన్ను తోసుకు లోపలికి పోతుంటే సుబ్బడు కోపంతో "ఏం టయ్యా! అడోళ్లు కనపట్టల్లా? అని దురుసుగా మాట్లాడబోయి "బాబూ! శంకరయ్యగారా? ఇదేందీ! ఈ పెట్టెలో ఎక్కుతుండారేం? పక్కచుట్ట లేవీ? ఇస్త్రీబట్టలు రాలేదేంటీ!" అని ఆశ్చర్యంగా ప్రశ్న పరంపరలు కురిపించాడు. శంకరం నవ్వి "అన్నీ ఉన్నై తొందర పనిమీద వెళుతున్నాను. గంట కొట్టారు; యింకా నువ్వెళ్ళమ్మా"

అన్నాడు. సుబ్బడు ఆశ్చర్య ముఖంతో శంకరాన్ని చూస్తూ బయటికి వచ్చాడు. రయిలు కదిలింది. శంకరం ముఖం జేవురించి యింత అయింది. చంద్రిక 6 గంటలకు లేచి శంకరం కోసం వెతుక్కుంది. ప్రొద్దున కోటూ, చొక్కాలూ మామూలుగానే ఉన్నవి. కాని, ఖద్దరు షర్టులు రెండూ కనుపించటల్లా, "కంపన పడ్డ కాకిలాగా" అటూ ఇటూ తిరుగుతూ ఆశోకం తలపోస్తోంది. "పేటకు వెళ్ళిపోయినాడేమో! మళ్ళీ రాడేమో! నని లోపలలోపల ఏడిచింది. కాపలా ఘూర్కావాడిని పిలిచి "మీ చిన్నఅయ్యగారు వీధిలోకి వెళ్ళటం చూచావా?" అని అడిగింది. ఘూర్కా వాడు "అమ్మా! తెల్లవారకట్ట 3-4 గంటలమధ్య బయటికి వెళ్లారుగా అమ్మా! నన్ను పలుకరించనుకూడా లే''దన్నాడు.

చంద్రిక మేడపైకి వచ్చి గదిలో పడుకుంది. తల్లి పళ్ళరసం తీసుకువచ్చి చంద్రికను పిలిచింది.

సదాశివ నాయుడుగారు కూతుర్ని పిలిచి "ఏమమ్మా మీ ఆయన అంత అర్జంటుగా ఏఊరు వెళ్లాడేమిటి? అదుర్దావిషయం ఏమిలేదుగద ?" అని అడిగాడు. చంద్రిక ఏడుస్తూ "నాకేం తెలియదు. నాతో చెప్పలే"దంది. "అదేమిటి? తెల్లవారుజామున రైలులో ఎక్కడికో వెళ్లాడుటకా. సుబ్బడు చెప్తున్నాడే" అంటూ నాయుడు క్రిందకు పోయాడు.

చంద్రిక సుబ్బడిని పిలిపించి "ఏరా! బాబుగారు ఏ ఊరు వెళుతున్నా నని చెప్పారురా?" అని అడిగింది. "అదేమిటమ్మగారు! ఒక సన్నైన చొక్కాగానీ, కట్టు పంచగానీ, పక్క చుట్టగానీ, ఆకరికి మంచి ఉత్తరీయంకూడా లేకుండా ఎళుతున్నారేంటమ్మా! మీ లచ్చిం కూతున్న పెట్టెలోనే ఎక్కారు. సేతలో మాత్రం సిన్న ట్రింకు ఉంది. చంకలో పుస్తకం కామోసుంది" అన్నాడు. చంద్రిక కళ్లు జ్యోతుల్లాగా ఉన్నై. పెదవులు మరింత ఎరుపెక్కి వణికిపోతున్నై. "ఎక్కడికి వెళుతున్నా మని చెప్పారురా?" అని వణుకుతున్న కంఠాన్ని పలికించలేక పలికించలేక పలికించింది. అమ్మా! నాకేం చెప్పలా. "అర్జంటుగా ఎళుతున్నా" నన్నారు. సూత్తే వేషం నాకేం బాగుండలే దన్నాడు. చంద్రిక సరాసరి మేడమీదికిపోయి కోట్లూ, చొక్కాలూ, పక్కలో వేసుకుని దుఃఖంలో మునిగిపోయింది.

తల్లీ, తండ్రీ, చంద్రికను ఎన్నోవిధాల ఓదార్చి ఈ విషయమంతా అరుణాచలం నాయుడుగారికి గుమాస్తాద్వారా కబురంపారు.



శంకరం విశాఖపట్నం చేరేటప్పటికి చేతులో 10 రూపాయలు ఉన్నై. తన బాల్యస్నేహితుడుగా ఉన్న శ్రీరామ శర్మతో తన విషయమంతా చెప్పి "స్వయంకృషిమీద ధనార్జనచేసి తన తల్లి తండ్రుల్ని పోషించుకుంటా" నన్నాడు. తన ఉనికి ఎవరికైనా తెలియబడింపంటే "దీక్షాభంగమయిపోతుంది. గనుక అజ్ఞాతవాసం జాగ్రత్తగా నడిపించా" లన్నాడు. శర్మ శంకరానికి తన మేడ పైఅంతస్థులో ఉన్న గదిచ్చి తన బంధుగుల షరంలో ఆడిటర్‌గా నెలకు 80 రూ. ల మీద ఉద్యోగంలో జేర్చాడు. ఒకనెల గడిచింది. 30 రూపాయిలు తన భోజన ఖర్చులకు ఉంచుకుని మిగతా 50 రూపాయిలు తన తండ్రికి కుటుంబ ఖర్చులకింద శర్మచేత మనియార్డరుచేయించి తనెక్కడ ఉన్నదీ తెలియనీయలా.

అరుణాచల నాయుడుగారు శంకరంవద్దనుంచి మనియార్డరు వచ్చినట్లునూ, అతని ఉనికిమాత్రం తెలియనట్లునూ వియ్యంకుడికి తెలియపరచారు.

సుదర్శన నాయుడుగారు మీ కోడలికి 10 రోజులనుంచీ కొంచెం సుస్తీగా ఉంది. అక్కగారూ మీరూ వచ్చి చూచిపొమ్మని తిరుగు జవాబు వ్రాశారు.

శంకరం వెళ్ళినరోజునే అతను ఖర్చేమాత్రం పుచ్చుకు వెళ్ళాడోనని చంద్రిక కోటులో పర్సుతీసి చూచింది. పర్సులో చిల్లరనోట్లు 90 రూపాయిలూ వాటిమధ్య ఒక కాగితం మడతబడా ఉంది. చంద్రిక ఆ కాగితం విప్పి చూచుకుంది. అందులో "ప్రియమైన చంద్రికా! నా మనోవేదనను నువ్వు గ్రహించలేక నీ ప్రియం కోసమూ, నీ ఆనందం కోసమూ, నన్ను ఉపయోగించుకోవాలని తలచినట్లు స్పష్టమైంది. పాపం! నేను కృత్రిమ యంత్రాన్ని కాదుగదా! ఎవరి ధర్మము వారికి ఎంతో ప్రియమని ఎవరూ ఎరుగనిది కాదు. తన కష్టసుఖముల ననుభవించని భార్యను గట్టుకొని చీకు సంసారినై యుంటకంటె ఆ జన్మాంతమూ బ్రహ్మచారిగ నుండుట

సుఖమూ, శుభమూ నని తెలియబడినది. ఇట్లు వ్రాయుటకు సిగ్గుపడుచున్నను తప్పక వచ్చినది. తరువాత – తరువాత.”
—శంకరం.

చంద్రిక ఆ ఉత్తరం చూస్తూ “చూడమ్మా చూడు, నేను నా సుఖానికీ, ఆనందానికీ తనను ఉపయోగించుకున్నానట. తా నెక్కడ కందిపోతాడో నని ఇంట్లో తన వెంటబడి తిరుగుతూ తన పనులన్నీ నేనే చేశానే. పైగా ఈ మాటలా? నాకు సంసారసుఖం రుచి చూపించి అంతలో విషప్రపండు కోరికిస్తాడా?” అని ఏడిచింది. ఏడిచి ఏడిచి పిచ్చిపిల్ల అయింది.

తల్లిదండ్రులతోనూ, చూడవచ్చిన వాళ్ళతోనూ పైపాదంతా పెంపర లెడుతుంది. తల్లి కోపపడి గదిలోకి పంపుతుంది. తండ్రి కనపడినప్పుడల్లా “నాన్నగారూ! ఆయనకోసం ఖబురంపారా?” అంటుంది, నాయుడు బయటికి రావటం మానేశాడు.

అరుణాచలం నాయుడుగారూ, సుశీలమ్మగారు కోడల్ని చూట్టానికి వచ్చారు. చంద్రిక అత్తమామల కాళ్ళకు నీళ్ళిచ్చి “మామగారూ! నా కల్ల తప్పుంటే దండించాలిగాని, యిట్లా వెళ్ళి పోవచ్చా? మీరు వెళ్ళి తక్షణం తీసుకరండి. లేకపోతే నా పరువు దక్కేటట్టు లేదు.” అంటూ ఏమేమో ప్రారంభించింది. రాధమ్మగారు వచ్చి “ఇదీవరస. ఇట్లా ఒకటే ధోరణి. రాత్రిళ్ళుకూడా నిద్రపోదు” అని కూతుర్ని అదమాయించి యింట్లోకి పొమ్మంది. చంద్రిక చరచరలాడుతూ “ఏమిటే! నువ్వెందుకు? నువ్వూరుకో నీకేం తెలియదు. ఇవన్నీ చెప్పకపోతే వాళ్ళు నేనే పంపేశా ననుకోరూ?” అంటూ తల్లిమీద తిరగబడింది.

అత్తమామలు కోడల్ని బుజ్జగించి విచ్యూంకుడికి “భయంలేదు అతడు అవివేకి కాదని ధైర్యంచెప్పి వెళ్ళిపోయారు.

## ౧౦

రంగదాసు గదిలో కూర్చుని మాట్లాడుతూ మాట్లాడుతూ విస్మయంతో “మేడపైకి వెళ్ళింది ఎవరు?” అని శ్రీరామ శర్మని అడిగాడు.

శర్మ “మన శంకరమేనోయ్” అని చెప్పి నాలుక కరచుకున్నాడు.
“ఎవరూ! చంద్రిక మొగుడేనా!” అంటూ రంగదాసు నిలబడ్డాడు.

"ఇప్పో! నీ కొండుకు ఊరుకో!" అన్నాడు శర్మ. "అ! మన కొండుకులే! అమధ్య ఇత నెక్కడికో వెళ్లాడని ఎవరో అనుకున్నారులే" అని రంగదాసు నవ్వాడు. "దాని కేదో గొడవుందిటలే. మన కొండుకు; సుక్షేమంగా అనకులే" అన్నాడు శర్మ.

కూతురు మనోవ్యాధితో సదాశివనాయుడు దిగులుపడ్డాడు. ఏంజబ్బుని ఏంమందిప్పిస్తా ననుకుంటాడు? అంతలో గర్భవతి కూడానూ. ఒకరోజు రంగదాసు సదాశివనాయుడుగారింటికి వచ్చి "బావయ్యా! చంద్రికకు ఎట్లా ఉంది?" అని ప్రారంభం చేశాడు. నాయుడు "నాయనా! కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది ఎల్లా ఉందని చెప్పను! నాలుగు నెలలమట్టీ అతనిజాడే తెలియకపోయె. ఈ 4 నెలలమట్టి తండ్రికి 50 రూపాయలు చొప్పున తాను తెలియపడకుండా పంపుతూనే ఉన్నాట్ట. ఇక్కడ ఉండే తాను రు 50 లు కాదు, 100 పంపుకో కూడదూ! నేను వద్దంటానా? ఇదంతా ఆనది కాదూ. మీ రందరూ చెప్పినట్లు మంచి మర్యాదస్థుడూ, భారిబుద్ధికలవాడే గాని దాని కర్మం అట్లా కాలింది. నాకేం తోచటల్లే" దన్నాడు.

"బావయ్యా! దీని జబ్బు విశాఖపట్నంలో నయమవుతుంది. అక్కడికి తప్పక తీసుకెళదాం" అన్నాడు రంగదాసు.

"అయ్యో! నాయనా! పిల్లకు పిచ్చాసుపత్రి చూచే ఖర్మం కూడా పట్టిందీ" అని నాయుడు కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

"కాదు! పిచ్చి ఆసుపత్రికి వద్దు. అక్కడ ఏ మందూ, మాకు లేకుండా కేవల మనశ్శక్తితోనే నయం చేసే ఘనవైద్యు డొకడున్నాడు. ఈ తెల్లవారుజాము బండిలో వెళదాం. దానికి తప్పక నయమవుతుంది. అట్లా కాకపోతే నా ప్రాణాన్నైనా యిస్తా"నన్నాడు రంగదాసు.

నాయుడుగారికి ఆశ పుట్టింది. వంటమనిషిని తీసుకుని కుటుంబంతోసహా రంగదాసు వెంట విశాఖపట్నం వెళ్ళాడు. నెలకు 40 రూపాయిల చొప్పున మేడ బాడుగకు తీసుకుని రోజూ సముద్రపు ఒడ్డుకు కుటుంబమంతా షికారు వెళతారు.

ఒకరోజు రంగదాసు శ్రీ రామశర్మను కలుసుకుని "మా బంధువుల

అమ్మాయికి సుస్తీగా ఉంటే ఈ ఊళ్ళో ట్రీటుమెంటు చేయించుకుందుకు తీసుకువచ్చారు. చూచివద్దామని తనబసకు తీసుకువచ్చాడు. నాయుడుగారిని అవతలకుపిలిచి "ఆ వచ్చినవారు డాక్టరుగారి అసిస్టెంటని" నాయుడుగారితో చెప్పి చంద్రికను పిలిపించాడు. చంద్రిక చకచకా ముస్తాబై వచ్చి ఈ డాక్టర్లవల్ల ఏమవుతుం? దన్నయ్యా! ఊరికేడబ్బు గుంజటం తప్ప – నాకేం మందూ, మాకూ – అనవసరం" అంటూ లోపలికి పోయింది.

శర్మ, దాసుతో కలిసివస్తూ మధ్య దోవలో – "దాసూ! ఆ అమ్మాయి నీకేమవుతుం దోయ్? మతిచాంచల్యం గాబోలు. ఆసుపత్రిలో చేర్పించాలని ఉద్దేశమా? పాపం– జాగ్రత్తగా ఆలోచించి మాత్రం చెయ్యి" అన్నాడు. విచారాన్ని సూచిస్తూ శర్మ. దాసు – "ఆ అమ్మాయి నాకు చెల్లెలవుతుంది. మతి చలించింది. మగడు నాలుగు నెలలక్రితం ఎక్కడికో పారిపోయాడు. ఎక్కడఉన్నదీ ఈ అమ్మాయి తండ్రికిగానీ, అతడి తండ్రికిగాని తెలియదు. గానీ ఆతడుమాత్రం తండ్రికి ప్రతినెలా ఎవరిపేరుతోనో ఎట్లాగో 50 రూపాయిలు అందచేస్తూనే ఉన్నాట్ట. ఆలోచించగా ఆ పిల్లను ఈ ఊరు తీసుకువస్తే ఘనవైద్యుడు దొరికి ఆ జబ్బు నయమగునట్లు తోచి ఇట్లా తీసుకువచ్చా"నని నవ్వాడు.

శర్మ దాసును గభాలున ఆపి 'శంకరం పెళ్ళాం ఏమిట్రా? ఈఅమ్మాయేనా? చంద్రిక' అని నివ్వెరపోయాడు. దాసు నవ్వుతూ 'నన్నడగటమెందుకూ? శంకరాన్ని తీసుకువచ్చి చూపించు! ఆ అమ్మాయి చంద్రికో, రదనికో అతనే చూచుకుంటాడుగా' అన్నాడు. 'నాకీ పరిస్థితులు అతను చెప్ప లేదుసుమా. దొంగ ఫెలో. ఇంకేం ఆ అమ్మాయికి వైద్యం అతనే చేసుకుంటాడు, తగిన ఏర్పాటుచేస్తే' అన్నాడు శర్మ.

'త్వరగా ఏర్పాటు చెయ్యి మరి' అన్నాడు దాసు.

## ౧౧

సాయంకాలం 6–30కి పునర్జన్మ సినిమాకు శ్రీరామశర్మా, శంకరం, ఇంకొక స్నేహితుడూ కలిసి వెళ్ళారు. 9–30 కి ఆట అయింది, ముగ్గురూ హోటల్లో భోంచేసి వస్తున్నారు. ఆ మూడో స్నేహితుడు శర్మనూ, శంకరాన్ని ఒక మేడముందు ఆపి "శర్మా! బెజవాడనుంచి నా ఫ్రెం

స్నేహితు డొకడు వచ్చి ఈమేడలో ఉన్నాడు. ఈరాత్రికి మనం నలుగురం కులాసాగా ఉండి పొద్దున్నే పోదాం; అతను పేరుపడ్డ కవి కూడాను; పద్యాలు నాల్గు వినికూడా వెళ్దామని పట్టుపట్టాడు. శర్మ "సరే"నని తన అమోదాన్నిచ్చాడు. శంకరం "నే నింటికి పోతా" నంటుంటే శర్మ బలవంతంచేసి సమ్మతి పరచాడు.

స్నేహితులు నలుగురూ ముందుగదిలో చేరి పేకాట ప్రారంభించారు. మహాసరదాగా పేచ్చిపోతున్నారు. శంకరం కూనరాగం తీస్తూ పేక కలుపుతున్నాడు. రంగదాసు నెమ్మదిగా తలుపు తెరచి గుమ్మంలో నిలబడ్డాడు. దాసునుచూచి శంకరం తలవంచుకొన్నాడు. దాసు "ఇంకులో దొంగెవ రేమిటి?" అని అడిగి పమన్నవాడికి మళ్లే తలుపులు మూసి వెళ్ళి పోయాడు. శంకరం శర్మతో "ఇక వెళ్ళిపోదామేమిటి!" అన్నాడు నెమ్మదిగా. శర్మ ఇంకా ఆట కానిదే! - అప్పుడేనా అన్నాడు.

దాసు చంద్రికను గదిముందుకు తీసుకువచ్చి ఏదో చెప్తున్నాడు. లోపల శంకరం ఆటమజాలో "ఇదిగో 8 వ తురుపు"అని అరిచాడు. చంద్రిక ఆదుర్దాగా 'లోపల మీ బావలాగుందే' అంది. దాసు కొంచెం నిదానించి 'గొంతు అట్లాగే ఉంది, నువ్వు చూచుకో, అన్నాడు. 'అమ్మో! గదిలో ఇంకా ఎవరో ఉన్నారులాగా ఉందిగా! ఎట్లా? అంది. దాసు నెమ్మదిగా గదితలుపులు తెరిచాడు.

చంద్రిక ఆపాదమస్తకం వణికిపోతూ శంకరంవంక చూస్తూ నిలబడిపోయింది. శంకరం చంద్రికనుచూచి నిర్ఘాంతపోయి చేతులో పేక క్రిందకు జారేసి తలవంచుకున్నాడు. రామశర్మ తక్కినవాళ్ళని లెమ్మని సంజ్ఞ చేశాడు. అందరూ బయటికి వచ్చారు. చంద్రిక ఒక గంతులో తలుపులు మూస్తూనే వెళ్ళి శంకరం ఒళ్ళో కూలబడి బావురుమని ఏడ్చింది. అతని చేతులు అతనికి తెలియకుండానే చంద్రికని చుట్టేసి ఆ పిల్ల నఖశిఖపర్యంతం ప్రాకినై.

కొంతసేపటికి చంద్రిక "ఈ నాలుగు నెల్లమట్టి సుఖంగా ఉన్నారుగదా! కళ్ళు చల్లపడ్డాయ్ - అమ్మా" అంది. దానికి శంకరం నవ్వుతూ ఏదో సమాధానం చెప్పాడు. ఆ రాత్రింతా ఒకటే గొడగొడ. వాళ్ళని ఒద్దనే వారు కానీ, కద్దనే వారు కానీ పిలిచేవారైనా లేకపోయారు. సదాశివనాయుడు దాసును పిలిచి "మా నాయనా! రేపు ఇంటికి వెళ్ళిపోదాము" అన్నాడు."

"కొడుకూ, కోడలూ సత్యనారాయణవ్రతం చేసుకుంటున్నా"రని అరుణాచలం నాయుడుగారికి పిలుపు వచ్చింది. నాయుడు కుటుంబముతో వెళ్లి ఆ యిద్దరిని ఆశీర్వదించాడు. ఆ వెళ్ళటం వెళ్ళటం అక్కడే నిలిచిపోయి మనమడిని ఎత్తుకు తిరగటం ప్రారంభించాడు.

---

# 9. ప్రేమమూర్తి



"దివి కరుగలేక బ్రతికియున్నాను – జీవచ్ఛవంబ నగుచు" ఇది 1928 వ సంవత్సరం నాటిమాట. "అప్పట్లో ఒక శీతలవాయుప్రవాహం బొంబాయి పట్టణం, పట్టణాన్నంతటినీ ఒక రాత్రి ఒక పగలూ స్తంభింపచేసిన రోజా అవి." ప్రజలు వీధులవెంట తిరుగనే లేక పోయారు.

రెండురోజులూ ఎట్లాగో గడిచి గట్టెక్కారు, ఆరోజు భానువారమే గనుక భానుడు తన శతసహస్రకిరణాలతో ప్రజలకు అభయమిచ్చాడు. భయం తీరిన ప్రజలు పార్కులకూ, సముద్రపు పంచలకూ, మలయపర్వత శిఖరాసికీ నడకలు ప్రారంభించారు.

రాజన్నా, మూర్తి ఏదో పనిమీద తమ టెక్నికల్ ఇనిస్టిట్యూట్ వైపుకు వెళ్ళి పని చూచుకుని 3 గంటలకు చౌపాటీ బీచికి చేరారు. కాస్సేపు ఏదో మాట్లాడుకున్న తరువాత నేను సుందరంతో మాట్లాడి వస్తానని రాజన్న కెనడీ రోడ్డువైపునకు వెళ్ళాడు.

మూర్తి కొంతసేపు ఆ చోద్యాలూ ఈ చోద్యాలూ చూచి, బీచి కెమ్మటే పార్కులోకి వెళ్ళాడు. ఆ అల్లిబిల్లి బాటలగుండా చిన్నదోవలగుండా తిరుగుతూ వచ్చి వచ్చి ఒక నీటి కుండీదగ్గరగా ఒక రాతి బెంచీమీద కూర్చున్నాడు. జేబులోని సిగరెట్టుతీసి అగ్గిపెట్టెకోసం అటూ యిటూ చూచాడు. ఆ కుండీ చుట్టు ప్రక్కల జనం లేరుగాని ప్రక్క పొదను ఆనుచేసుకుని ఒకాతడు కూర్చుని ఉన్నాడు. మూర్తి అతనివంక కొంతసేపు నిదానించి చూస్తూ "అగ్గిపెట్టె ఉందా?" అని అడుగుదా మనుకున్నాడు. గాని ఆ వ్యక్తి అటూ ఇటూ కదలక శిలాప్రతిమలాగ కూర్చున్నాడు.

మూర్తి రెండడుగులు అతనివైపుకు నడచి నిలబడ్డాడు. ఆ వ్యక్తి తన రెండు హస్తాలతో ముఖాన్ని మూసుకుని చలించకుండా కూర్చున్నాడు.

మూర్తి అస్పష్టశబ్దంతో ఇంగ్లీషులో "మీదగ్గర అగ్గిపెట్టె ఉందా?" అని ప్రశ్నించాడు. ఆవ్యక్తి కొద్దిగా చలించి తల పైకెత్తుతూ "నన్నే నా..." అని దుఃఖసూచకమైన కంఠంతో వెక్కి వెక్కి అన్నాడు.

మూర్తి అర్థంకాని ఆలోచనలోబడి "ఔనండీ" అన్నాడు. ఆ వ్యక్తి తల పంకిస్తూ ఎర్రబారిన తన రెండు కన్నులనూ పూర్తిగా విప్పి "నాయనా! నీవు తెలుగువాడివే! గాదూ? అని తెలుగులో అడిగాడు. మూర్తి "ఔనన్నట్టు" ఆశ్చర్యంగా తల ఊచాడు. "అయితే ఇదిగో నాదగ్గర నిప్పుపెట్టే లేదుగాని నేనే ఒక నిప్పుతో కుములుతున్న సెగడునై కూర్చున్నా! కావలిస్తే ఊది చూచుకో" అని గద్గదికంగా అచ్చ తెనుగు మనిషిలాగా మాట్లాడాడు.

మూర్తి హృదయం కంపించి- ఇతడు దేహం తెలియని స్థితిలో ఉన్నాడా ఏమిటి? కళ్ళు ఎర్రగా ఉన్నై - అనుకున్నాడు. మళ్ళీ వెంటనే హృదయం ద్రవించి అయ్యో! తెనుగువాడా? ఏమిటి పుట్టెడు దుఃఖం ఉన్నట్టున్నాడు గాబోలు. అనుకుంటూ ఏమో అడగాలనుకుంటున్నాడు.

ఆ వ్యక్తి తాను కూర్చున్నచోటునుంచి అవతలికి వత్తిగిలి "ఇదిగో! చూడు నీకు కనక తీరుబడి ఉంటే ఇట్లా వచ్చి కూర్చో. నిన్ను చూపెట్టుకుని నా హృదయ భారం తగ్గించుకుంటూ - తాపోపశమనం చేసుకుంటూ - భగవంతుడు నా తెనుగు తండ్రిని చూపించా డనుకుంటున్నా" అన్నాడు. మూర్తి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు; — "నాయనా! నన్ను పిచ్చివాడి క్రింద తలచక - నేను అట్లాగే ఉన్నమాట వాస్తవము. ఈరోజు నాకెంత దుర్దినమో అంత పవిత్రదినం కూడా - ఐతే దుఃఖావేశంలో ఉన్నానులే- దయ ఉంటే వచ్చి కూర్చో" అని దీనంగా చూచాడు.

మూర్తి దయాశీలుడు. తత్రాపి తన తెనుగువాడి కంటినీటిచుక్క- చూచి సహించలేకపోయాడు. ఇట్టే నీటికుండలోంచి దోసెడు నీళ్ళు తీసుకుని - "ఇదిగో నీటితో ముందు ముఖం - కళ్ళూ తుడుచుకో! ఇంతకు మించిన పనిమాత్రం ఇంటివద్ద నాకేముంది కనుక —" అని అతని చేతుల్లో పోశాడు.

ఆ నీటితో అతను ముఖం తుడుచుకుంటూ - "అబ్బ! నాయనా! నా తెలుగుతండ్రి చేతినీళ్లెంత చల్లగా ఉన్నైరా! ఈ క్షణంలో నా తండ్రి చేతితో నిట్టి ఉపశమనమే జరుగకపోతే ఇంతవఱకూ నాలో వేండ్రించిన దుఃఖాగ్నికి నా రక్తనాళాలు ఉబ్బి చిట చిటా చిట్లి రక్తం నేలపాలయ్యే దేమో! కళ్లు పేలిపోయి తల పగిలిపోయేదేమో! నా తండ్రీ, దగ్గరకు రా- నీవు నాకు అన్నివిధాలా బంధువుడవూ - నా కల్పతరువూ - నా కామ దేవతవులాగా కనుపిస్తున్నావు" అంటూ మూర్తి భుజంమీద తలవాల్చాడు. మూర్తి ఏదో చెప్పబోతుండగా- "నాయనా! కాస్సేపు మాట్లాడకు - ఈ పొంగు తీరనీ- నేనే మాట్లాడుతా. వళ్లు తెలిసే ఉంది- కాస్త ఉండు" అన్నాడు. ఇట్లా ఇద్దరూ 10 నిమిషాలు నిద్రిస్తున్నవాళ్లవలె కూర్చుండి స్వప్నశరీరాలతో బొందెల్లోంచి లేచిపోయారు.



ఆ పూపొదల్లో పిచ్చికలు రొద ప్రారంభించినై. కాలచక్రంలాగా ఏదో జరజరా దొర్లిపోవటం చూచినై కాబోలు.

మూర్తి కళ్ళు తెరచి చూచాడు. భుజంమీదనుంచి తల ఎత్తుతూ ఆ క్రొత్తతడు కళ్ళనీళ్లు గోళ్ళతో విదులుస్తూ ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. మూర్తి అతని కళ్ళలో చూచాడు – "ఆగు! నన్ను తొందరపెట్టకు! నా భాగ్యదేవతవే కాకపోతే నన్ను ఇట్లా ఇతరులు లాలించగలరా? కాకపోతే నువ్వు ఆవహించైనా ఉండవచ్చు. లేకపోతే ఇన్నాళ్ళ ముచ్చటలు ఈ క్షణంలో అనుభూతం కాగలవా!" అంటూ ప్రారంభించాడు. మూర్తి "బాబూ! తొందరలేదు, నెమ్మదిగానే చెప్పమన్నాడు."

"చెబుతున్నా – విను నాయనా – నేనూ తెలుగువాడినే, మాట యాసగా ఉందని సందేహిస్తున్నావేమో! మా తాతలు గోదావరి వాస్తవ్యులు. సంసారాలు చితికిపోయి జరుగుబాటుకే పోనిదై రంగూన్ చేరి అచట జీవించారట. వారితోపాటు మా మేనమామతండ్రులుకూడా వెళ్ళి ఏదో వ్యాపారంచేసి బాగా డబ్బుగడించారు. అప్పట్లో మా వాళ్లు ఒరిస్సా వర్తకులతో వ్యాపారం జరిగి బాగా ధనార్జన చేశారు.

మా తాత ఆర్జించింది మా తండ్రి వేశ్యాలోలుడై కొంత చరస్థిరాస్తుల్ని క్షీణింపచేశాడు. కొంత చిట్టెడుగింజలైనా రాని సముద్రతీరపు ఊసర క్షేత్రగ్రహణానికి పెట్టాడు. మా తల్లి అనసూయాదేవిట. ఎప్పుడూ మా నాయనమాటకు ఎదురాడక ఆయన ఏదిచేసినా పరమపవిత్రంగా ఎంచుకుని పది సంవత్సరాలు కాపురంచేసి నన్ను కని పరమపదమును బొంది ధన్యురాలయిందట. నాయనా! అట్టి తల్లి స్తన్యమైనా త్రాగ నోచుకొన లే దీ దౌర్భాగ్యుడు.

మరల మా తండ్రి యింకొక వివాహము చేసికొనెనట. పోనీ అట్టి తండ్రి అయినను పదికాలములపాటుండి తల్లిలేని నన్ను కడుపులో పెట్టికొని ఉండగూడదూ! ఔను ఎందుకు ఉండును. ఆయనగూడ నా ఆరవ ఏట గ్రామాంతరముపోయి మరణించెను. తల్లి దండ్రులను చిన్నప్పుడే చంపుకున్న నేనెట్లు బ్రతికితినో! కష్టజీవిని "అమ్మా!" అని పిలుచుకోలేని

నా నోరు మూగైనా! అయింది కాదు. మా అమ్మ ఉంటే నాకీ కష్టాలెందుకవస్తై? అన్నీ సక్రమంగానే నడచేవి. అంటూ కన్నీళ్లు పెట్టుకున్నాడు.

## 3

మూర్తి అతని భుజంమీద చెయివేసి, "బాబూ! విచారంవల్ల ప్రయోజనంలేదు. ధీరుడులాగా జీవితాన్ని నడుపుకోవా లంటారుగా" అన్నాడు.

"నాయనా! చిన్నవాడవైనా బుద్ధిమంతుడవే. వాస్తవంగా ధీరత్వంగా నడుపుకోదగిన జీవితమే ఔను. కానీ ఏం చేస్తానూ, మా మేనమామల యింట్లో ఒదిగి ఒదిగి అత్తలకు అణిగి మణిగి బ్రతికిన నేను ధీరుణ్ణిగా ఎట్లు కాగలను? భీరుణ్ణే అయిపోయినా.

మా మామలు ఒరిస్సా వ్యాపారస్థులకు పెట్టిన అప్పులక్రింద వారి ఆస్తులు కట్టుకోటం చేతనూ ఇంకా రంగూనులో గలిగిన యుద్ధ హడావిళ్ల చేతనూ ఓఢ్రదేశం చేరి పూరీ వాస్తవ్యు లయారు. వారితోపాటు నేనూ ఉన్నా. నాతో నా పిత్రియమైన కొంత ధనం కూడా మా మేనమామలతో ఉంది. మా మేనమామలు చాల ఉదారులు. మా పెద్దమామ ముఖంలో మా అమ్మగారిపోలిక లున్నవని వినటంచేత ఆయనంటే నాకు ప్రేమ మెండు. భక్తి గూడాను. ఆయన్ని చూచినప్పుడల్లా మా అమ్మని జ్ఞాపకం చేసుకునే వాడిని. ఆయనకు నామీద పుత్రవాత్సల్య మెందుకుంటుంది? ఆయనకు నలుగురు కొడుకులూ ఇద్దరు కూతుళ్ళూ ఉండే. ఆపిల్ల లేమన్నా చిలిపి పనులుచేస్తే వాళ్ళకంటే పెద్దవాడిని అవటంచేత మాఅత్త నన్ను కసురుకూ నువ్వుండే చేయించావనేది. మా మామ మాత్రం కసిరేవాడు కాదు. పిల్లలిని మామామ కొడితే "చూడవే అమ్మా! మానాన్న కొట్టాడని" తల్లితో చెప్పుకునేవాళ్లు. మా అత్త కోపపడితే నే చెప్పుకునేందుకు మా అమ్మ ఏది? మా మామయ్య ముఖంచూచుకొని కొట్టుగదిలోకి వెళ్లి కాసేపు ఏడిచివచ్చే వాడిని. మా మామ నాధనంతో కొంతమంది పెట్టుబడిదారులతో కలిసి కలప వర్తకం ప్రారంభించాడు. ధనము నాదైనా భాగం ఆయన పేరునే నడిచింది. మామామ కొట్టుపనుల్లో తిప్పేవాడు. మా అత్త వాళ్ళు ఇంటిపనుల్లో వినియోగించేవాళ్ళు. ఇంక నాకేం చదువుకవస్తుంది? చదువుకోమని చెప్పేందుకు నాన్న ఉన్నాడు గనుకనా? వెనకేసుకునేందుకు అమ్మఉంది గనుకనా?

ఎట్లాగో కొంత ఇంగ్లీషు, తెలుగు, ఒరియా చదువుకున్నా. అబ్బాయినిబిడ్డ అందరికీ తేలిక్కగా! అందరూ "అ." అనేవాళ్ళవటంచేత అడకునగా బ్రతకటం అలవాటయింది.

మామ నన్ను చదువు మానేయించి వ్యాపారంలో దింపాడు. అర్జంటు పనులొస్తే అడవిలోకికూడ పంపేవాడు. మా వాటాదారులంతా "భయ భక్తులుగల తెలివైన కుర్రవాడని" అంటూ ఉండేవాళ్లు. వ్యాపారం బాగా జరుగుతోంది. మా సంసారం పేరుప్రతిష్ఠల్లోకి వస్తోంది. ప్రతిష్ఠతోపాటు మాయధారి మిత్తి పరుగెత్తుకు వస్తోందని మాకేం తెలుసూ! కుర్చీలో కూర్చుని ఉత్తరం చదువుకుంటున్న మామయ్యగుండె ఆగిపోయి చని పోతాడని మే మేమన్నా అనుకున్నామా? అంతా క్షణాల్లో నడచి పోయింది. ఇది యిట్లానని చెప్పటానికి కూడ నోరు పలక్కపోయింది. క్షణాలమీద మా మామని ఎగరేసుకు పోయింది. చూస్తూఉండగా సంవత్సరం గడిచింది.

౪

సంసారభారమంతా మా రెండో మామయ్యమీద పడింది. ఆ సంవత్సరం లోనే అతడు అన్నకూతురు వివాహంచేసి కన్యాదానఫలం పొందాలను కున్నాడు గాబోలు. కాకపోయినా ఆ పిల్ల ఈడేరే వయసులో కూడా ఉంది. ఆ కానిదేశంలో మంచి అనువయిందీ సాంప్రదాయ శుద్ధమయిన సంబంధం దొరకలేదూ? అప్పటికీ విచారిస్తే మా కువల్లే వచ్చి స్థిరపడిన రెండు కుటుంబాలవారు తెలారుగానీ మా పేరువిని ఎక్కువ కట్నాలు అడిగారు. మా మేనమామ చనిపోవటం చేతనూ, సంసారం ఇబ్బందులలో ఉండటం చేతనూ, ఆ సంబంధాలకు తూగలేకపోయాడు. కార్యభారమంతా ఆయన మీద ఉండడం చేతను, అంతకంటె వేరే మగదక్షత లేకపోవటం చేతను, అతనుకూడా బుద్ధిమంతు డవటంచేతనూ ఆయన్ని ఎవరూ కాదన లేక పోయారు.

అటువంటప్పుడు నేనొకలెక్కా? ఆ పిల్లని నాకిచ్చి చేస్తానని ఎవరితోనో అన్నాడు. ఆ మాట మా అత్తచెవిని బడింది గాబోలు, ఏదో కల్పించుకొని పెద్దగోలచేసింది. మా చిట్టికూడా ఏడుపు ప్రారంభించింది. నాతో

మాట్లాడటం మానేసింది. నాకు అంతో యింతో ఉపసత్తి ఉన్నా, తోడూ నీడా లేనివాడిని గాదూ! మా అత్త నా మాటంటే చీదరించుకొని కసిరి కొట్టేది. తరువాత దాని కారణంకూడా గ్రహింపయింది. ఏంచేయగలం! మా మామఅంటే ఉభయులకూ భయమే అయిపోయింది. అతను రాక పూర్వము ఎంతగందరగోళం చేసినా వచ్చేటప్పటికి కిక్కురు మనకుండా ఉంటారు.

ఒకసారి మా చిట్టిని నేనెందుకో పలకరిస్తే – "పోరా విశ్వీ! నా దుంప తెంచటానికి వచ్చావ్. మా నాన్నతో పాటు నేను పోనన్నా పోయానూ గాదు. ఇక నాతో మాట్లాడ"కంది. ఇల్లా అందని నేనెవరితో చెప్పుకోనూ! తల్లా! తోడా! మా మామ లోకులకు నచ్చేటట్టుగా తన ఉదార గుణం బయటికి వచ్చేటట్టుగా నా కా పిల్లను కట్టిపెట్టి తన నెత్తిమీద భారం దింపుకోవాలని చూచాడేగాని మా యిద్దరిమధ్యా నున్న అసమతను చూడడు.

అట్లా నిర్లక్ష్యంగా ఉంటే సంబంధంమీద నాకు మాత్రం ప్రేమెంత మక్కువ ఉంటుంది? కన్నవాళ్లులేని ఏకాకినేగానీ ఇంతో అంతో చదువూ తెలివి తేటలూ ఉన్నై. కాస్తో కూస్తో ఫరవాలేదు. తినటానికి ఉంది. ఆ పిల్ల కంటే రూపసినని మావాళ్ళే అంటారు. అటువంటప్పుడు నాకీ మామ కూతురక్కరలేదు. ఇంకో సంబంధం చేసుకుంటానని అహంభావం నాకెందుకుండదూ? ఉందీ కానీ ఎట్లా నెగ్గుతుంది! ఒకసారి మా చిట్టి మా అత్తతో మాట్లాడుతూ నన్ను ఉద్దేశించే ననుకుంటా – "అమ్మా! నాకసలేవద్దే! పురిటిలోనే పిసికేస్తే నీకీబాధ ఉండేది కాదుగా" అంటూ ఏడిచింది. మా అమ్మ ఉంటే ఇంత సంకటం వచ్చేది – గాదుకదా అని పుట్టెడు దుఃఖమొచ్చింది నాకు. అది ఎట్లాగో అణచిపెట్టుకుని రాత్రి మామయ్య భోజనంచేసి మేడమీదికి వెళ్ళుతుంటే ఆయనవెంట వెళ్ళి భయంతో "మామయ్యా! నాకీసంబంధ మక్కరలే"దని ఊరుకున్నా. ఆయన వెంటనే ఏకాయెకీని పై అంతస్తుకు తీసుకెళ్లి పక్కన కూర్చో పెట్టుకుని "ఎందుచేతరా" అని అడిగాడు. "అత్తయ్యా వాళ్లకే యిష్టంలేదు గాబట్టి" అని నెమ్మదిగా అన్నా. జరిగిందేమిటో చెప్పరా! అన్నాడు. తల్లీ కూతుళ్ళకు నాయందుగల శ్రద్ధాగౌరవాలు తెలిసినంతవరకూ చెప్పా. నాయనా! అంతకన్నా ఏం చెయ్యను? – ఆయన వినీవినీ ఏదో చెప్పి చివరకు–

"ఒరే! విశ్వీ! అదీ చిన్నపిల్ల. నువ్వూ చిన్నవాడవు. దానిబుద్ధి ఎప్పుడూ అట్లా ఉంటుందనగలవా! అయితే కొంచెం పెంకిమాత్రం నిజమే. అది మాత్రం నిలిచి ఉంటుందా! ఒకచోట పుట్టి పెరిగారు. కాబట్టి చిన్న తనపుఅలుసు ఉండవచ్చు. ఇద్దరూ కలిసి సంసారం చేసుకుంటుంటే ఇట్లాగే ఉంటారనుకుంటున్నావా! ఇక వాళ్ళమ్మతో నీ కెందుకు? మేమంతా పెద్ద వాళ్ళము లేమా నోరుపయోగించటానికి! నువ్వేమీ విచారపడకు. ఇక నా ఉద్దేశం విను. ఆ పిల్లను ఇంకొకళ్ళకిచ్చేటానికి నాకిష్టంలేదు వాళ్లు ఏంకోరంటకం పెట్టి ఏడిపిస్తారోనని నా భయం. చూచాయగా మనసుబ్బాలు సంసారం. అసలే పెద్దమామకు ఈ పిల్లమీద ప్రేమ, ఇది పుట్టిన తరువాత సంసారం వృద్ధిలోకి వచ్చిందనే అభిమానంతో 4 ఎకరాలు కూడా వ్రాసి యిచ్చాడు కూడాను. అట్టిదాన్ని ఎక్కడో ఎరగనిచోట ఇచ్చి ఏదైనా కష్టం కలుగచేస్తే అన్నబిడ్డమీద అతని కేమంత అభిమానముంటుంది అని అన్నంటారేమోనని భయంపడుతున్నా. మీ యిద్దరికి చేస్తే మీ మధ్య ఏ పొరపాటులు వచ్చినా మీ యిద్దరినీ చెరో నాలుగూ అని సర్దుబాటు చేయవచ్చును. అందుచేత వేరేమాట మాట్లాడక నన్ను చూచి ఈ సంబంధం చేసుకో, నీ కేమీ చేదుమేపట్లా. అమ్మ చచ్చిపోయినప్పటినుంచీ మామలు పెంచారని కృతజ్ఞత ఉంటే, కష్టమో నిష్ఠురమో నా మాటవిని నన్ను ధన్యుడిని చేస్తావనుకుంటున్నా. ఇంతకంటె వేరే చెప్పేది లేదంటూ చరచరా దిగివెళ్లాడు. అసలే మామఅంటే నాకు భయం. మా అమ్మ ఉంది కనుకనా నా మామని రెండు మాటలేని కానూ కూడదనటానికి.

మరుసటిరోజు మధ్యాహ్నం భోజనాలయిన తరువాత మా మామ ఏదో ధోరణి ప్రారంభించి అదీ యిదీ కదిల్చి మా పెద్ద అత్తను గడుసుగా మందలిస్తూ "మనం ఇరకాటాన పడకుండా – నలుగురూ మెచ్చేటట్లు మన పిల్ల మన ఎదుట ఉండి సుఖపడాలనే తలంపుతో ఉన్నానే గాని ఎవడికో ఒకడికి అంటకట్టి బాధ్యత వదల్చుకుందామని తలచటల్లా. అట్లా మీరు అనుకునేట్టయితే మీయిష్టం వచ్చినట్టు మీరు చేసుకోవచ్చు. ఈ ప్రమేయం నాకేం లేదు. వదులుకుంటున్నా" అన్నాడు.

మా అత్త నెమరు తిప్పుకొని "ఎందుకయ్యా! ఎవరేమన్నారనీ, యింత మాంగామా! నీ కంటె నా కెక్కువ బాధ్యత ఉందిగనుకనా! నువ్వు

మాత్రం ఏం తప్పు చెప్తావు – అదీ బాగానే ఉందీ" అంది. ఎంతవరకు హృదయపూర్వకంగా అందో ఆయనకుమాత్రమేం తెలుస్తుంది?

మా ఉభయుల్నీ పులీ మేకా ఒక గాట కట్టేసినట్టు చెయ్యాలని నిశ్చయించాడు మా మేనమామ. "సరే, పోనీ యిదీ బాగానే ఉంది. మన పిల్ల బయటికి పోకుండా ఇంట్లోనే ఉంటుంది. ఇట్లా అణిగిమణిగి ఉండే అల్లుడు మాత్రం దొరుకుతాడా!" అని మా అత్తావాళ్లు అనుకుని ఉంటారు. మొదటినుంచీ నన్ను చిన్న చూపుతో చూచిన ఈ అత్త నన్ను ఇప్పుడు గౌరవించ వచ్చిందా? దానినిబట్టి మా చిట్టిమాత్రం నాకు నచ్చిన సంసారం చెయ్యవచ్చిందా? ఇది పేరుకు పెళ్ళనిపించుకొని షష్టాష్టకంగా మారుతుందని అప్పుడే అనుకున్నా. నాయనా! ఓపికతో ఇంతవరకు వింటున్నావు. నిన్ను కష్టపెట్టాలని లేకపోయినా తప్పక వస్తోంది హృదయవేదన. ఈ సముద్ర తరంగాల్లాగా ఒకదానివెంట ఒకటి పరువెత్తుకువచ్చి బయటపడుతున్నై. ఏమైతేనేం? ఒక ముహూర్తాన మా యిద్దరికీ పాణిగ్రహణం జరిగింది. ఆ లగ్నమే నాకష్టజీవితానికి నాందిముఖం కూడా అయింది.



త్వరలో గర్భాధానం కూడా జరిగింది. ఇక సంసారం ప్రారంభమయింది. అట్టి దుఃఖమయ సంసారాన్ని చెప్పుకుని చింత పడకుండా దాటుతా. నన్ను చూచి మాచిట్టి ఏమీ లక్ష్యపెట్టేదికాదు. మంచంమీద పడుకుని లేవనైనా లేచేదికాదు. మాఅత్త నన్నో వారపుపిల్లకాయలాగా చూచేది. ఎవరైనా "చిట్టీ! మగడి ఎదుటనేనా అంత నిర్లక్ష్యం" అంటే వెంటనే మా అత్త అందుకొని "ఊరుకుందురూ! పసిపిల్ల నిన్నటిదాకా ఒక కంచంలో తిని ఒక మంచంలో పండినవాళ్లకు ఇప్పుడే మర్యాదలు తెలుస్తాయిటా" అని వెటకారం చేసేది. నే నెప్పుడైనా "చిట్టీ! ఇదేదీ, అదేదీ" అని అడిగితే వెంటనే అత్త అందుకుని "ఏమిటయ్యా సీమనుంచి యిప్పుడే వచ్చినవాడిలాగా అడుగుతావు. అక్కడ నుంటరొయ్యా బొత్తిగా ఎరగకుండానే ఉన్నావా ఏమిటి" అనేది. నా భార్య నాకంటె ముందు భోజనం చేసి ఎక్కడో పడుకునేది. నే పోయి ఏదైనా కావలెనని లేపబోతే ఆపిల్ల చిరచిరలాడేది. మా అత్త సన్నగా "నీకు అదిగాని కనపడలేదా! మమ్మల్ని

అడగకూడదా ? కొంత్తానికి అల్లుడుతనం చూపుతున్నావులే" అనేది. చివరికి పెళ్ళిచేసుకున్న పాపానికి ఒకమాట అనడానికి గానీ అనకుండా ఉండటానికిగాని వీలులేకుండా పోయింది. ఇట్లా 3-4 సంవత్సరాలు గడిచింది. చివరికి మా మామయ్య ఏమీ జోక్యం కలుగజేసుకోలేక నన్నో నాలుగు తననో నాలుగు ఇంట్లోవాళ్ళనో నాలుగు తిట్టి చక్కాపోవటం సాగించాడు.

ఇట్లా సంసారం నడుపుకోటం కష్టమనితోచి ఒక రోజున తెగించి మా మామని "నా డబ్బుతో ఒక యిల్లుకొనిపెడితే ఆ యింట్లో ఉండి నా కాపురం నేను చేసుకుంటా"నన్నా. మామయ్య "సరే ఆలోచిస్తానులే" అన్నాడు. మా అత్త పెద్ద నోరు పెట్టుకుని "చాల్లే ఊరుకో! ఏమాత్రం సంపాదిస్తున్నావని వేరే కాపురం పెట్టాలని; ఇద్దరు పుడితే తెలుస్తుంది. ఇంకో యిల్లెందుకూ ఆ తెచ్చేదేమిటో పెట్టుకుని ఈ యింట్లోనే ఒక మూల ఉడకేసుకు తినండి- మాకెందుకు వచ్చింద" అంది.

నాకొకరోజున కోపమువచ్చి కూతుర్ని ఒక లెంపకాయ కొట్టానని తల్లీ కూతుళ్లు పస్తుపడుకున్నారు. చివరకు కళ్ళా-లేని ఉమియాలేని సంసారమయింది. వయసులో ఉండి ఎంతో హాయిగా గడపవలసిన నా జీవితం ఎంత వ్యధచెందిందో భగవానుడికి ఎరుక. మా అమ్మ ఉంటే మా అత్తని అట్లా ఆడనిచ్చేదా ? కోడల్ని అట్లా కమకనిచ్చేదా ?

నాకు ఏవేవో ఊహాలు - మా అమ్మ ఉంటే-చక్కటి భార్య - బాగా చదువుకున్న దీ-చలాకీగా ఉండేదీ - మంచి సమర్థురాలయిందీ - సంసారం దిద్దుకోటంలో బహు నేర్పరి - ధార్మికురాలూ - ధఃకురాలూ - నన్ను ఎప్పుడూ ప్రియత్వంగా చూచుకునే భార్య వచ్చేదని. ఆవిడ లేకపోవడం చేత ఇట్లా కలిగిందనుకునేవాడిని. రాను రాను సంసారమంటే అసహ్యమనిపించిందని కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు.

మూర్తి అతనిని ఓదారుస్తూ "విచారపడకండి, కష్టాలు కాపురాలు చేస్తూ కూర్చుంటయ్యా!" అన్నాడు మూర్తి. ఆమాట అనగానే అతను మూర్తి గడ్డం పట్టుకొని "నాయనా! అదే జరిగింది. నువ్వుచూస్తే నాదివ్యమూర్తి లాగ ఓదారుస్తున్నావు. ఆ! అదికూడా చెప్పుతున్నా. నా జీవితంలోని ఈ రంగాన్నికూడా విని మరీపోదుగాని" అని కళ్లుమూసుకుని "అబ్బా! ఏనాటిదో జ్ఞాపకం వస్తోంది - ఎంతని చెప్పను...సరే."

౬

మా గంజాం ఫరం మేనేజరు జబ్బుపడటం — మా పాటాదారులు నన్నక్కడికి వెళ్ళమనటం, తటస్థించింది. నేను వెళ్ళటానికి సిద్ధము అయినా; మా మామ బలవంతంమీదనే ఒప్పుకున్నాడు. నేను వెళ్లకుండా ఉన్నా ఇంతటితో నా కథ ముగిసేదేమో!

నేను గంజాం వెళ్ళిన రెండుమాసాలకు హోటల్ భోజనం సరిపడక జబ్బు చేసింది. మామయ్య వెంటనే చిట్టిని నాదగ్గరకు పంపాడు. అది వచ్చిన మొదట్లో ఏ పదిరోజులు సుఖముగా వండిపెట్టిందో కాని తరువాత తరువాత తనకు గుండెలో దడా— అరికాళ్లు మంటలూ అంటూ ప్రారంభించింది. ఏదో వైద్యాలు చేయిస్తున్నా. ఒకరోజు మధ్యాహ్నం "నాకిక్కడ నీళ్లు పడటంలేదు. మా అమ్మని చూడాలి, నే వెడతా" నంటూ మారా మాళ్లుపెట్టి రాత్రి బండిలో వెళ్ళిపోయింది. అది వచ్చిందిగదా, నాకు సుస్తీ తగ్గిపోతుందని సంతోషిస్తున్న నాకు విచారం కలిగించింది. నాకు దాని యందు అసహ్యం కలిగింది. దానికీ నామీద అంతేనేమో! కాకపోతే ఏ ఎండుతోనో పండుతోనో నాతోనే లోకంగా ఉండాలిసిందేగా. హోటల్ మానేసి వంటమనిషి దొరకక నేనే స్వయముగా వంటచేసుకోటం ప్రారంభించా. చేసుకోటం బద్ధకమైతే ఏవో పళ్ళో పాడో తిని గడుపుకోటం నేర్చుకున్నా. "ఈనాటి నా స్తిమితం ఆనాటి దాని భిక్ష." ఎప్పుడూ సాయంకాలపుపూట ఫరంకు వెళ్లి రెండు గంటలసేపు లెక్క చూచుకు వచ్చేవాడిని. ఒక క్లబ్బుకు పోవటం గానీ — అల్లరి చిల్లరివేషాలుగానీ— ఏమీ లేవు— చిన్నప్పటినుంచి అట్టి సాంగత్యం ఎరిగి ఉంటేగా!

ఆరు సంవత్సరాలు కాపురంచేసినా సంసారమంటే ఈప్సితా తగ్గిందికాదు. పోనీ కమ్మటి సంసారం అనుభూతమై కథా ముగిసిందీ కాదు. కోరికలన్నీ కుదించుకుపోయి నా మనసు మంచి బిగింపుమీద ఉండి ముట్టుకుంటే పేలిపోయేదో నేల టపాకాయి మాదిరిగా బిగిసి ఉన్నట్టు నాకే భయం వేసింది. ఎప్పుడూ ముచ్చటైన దాంపత్యాన్ని చిత్రించుకుంటూ నా మనసు కలలు కంటూ ఉండేది. — "ఛీ! ఈ జన్మకు ఇంకేం సౌఖ్యం, వట్టి పిచ్చిభ్రమ పడుతున్నానని విరాగం పొందేది. ఏ చిన్నపిల్లయినా సరే చివరికి—

"అన్నా" అంటూ ఇంట్లో తిరిగితేనైనా చాలు అనిపించింది. ఏదో గందరగోళం పడేది. ఇక పురాణాలు సుఖసంసారపు విశేషాలు ఏకవీర లాంటి రచనలూ చదివి సంతోషపడేది. నామనసు ఇంత బెంగపడేటప్పుడు మా చిట్టికి తన తల్లిమీదనున్న ప్రియత్వంలో పాతికవంతైనా నామీద ఉంచగూడదా? అనుకునేవాడిని. మా అత్తకు స్త్రీకి సహజమైన సంసారపు గోడుకంటె వ్యవహారపు సంత మెండు.

"పప్పులో ఉప్పెంత వెయ్యాలో తెలియదుగాని పదిడబ్బులు ఎట్లా పోగు చెయ్యాలో తెలుసు." ఆ కూతురుగూడా ఆ పాఠమే నేర్చుకుంటుంది కాబోలు. నాకు డబ్బుమీద కాంక్ష తక్కువేగాని చిన్నప్పటినుంచీ నన్ను—"నా" అనేవాళ్లు లేకపోవటంచేత మమత్వం కోసం మ్రగ్గిపోయి చివరకు అట్టి భార్యకు కూడా కరవై నాకు నేనే బరువైపోయినా — ఇక దానిసంగతి వద్దు, మరచిపోతున్నా.

౨

మా యింటికి కొంతదూరంలో మా గోదావరివారే ఉన్నారు. ఆయింటాయన బహు నెమ్మదయినవాడూ పెద్దవాడూను. అప్పుడప్పుడు దోవలో అగుపించి నా క్షేమసమాచారాలు తెలుసుకుంటూ నాయందు గౌరవము చూపిస్తూ ఉండేవాడు.

ఒకరోజు నా నౌకరు నా వేయిపడగల పుస్తకం బల్లమీద పెడుతూ "అయ్యగారూ! ఆ లలితమ్మగారు మన అమ్మగారిదగ్గర ఈ పుస్తకం తీసుకున్నారట. అమ్మగారు ఊరికి వెళ్ళేటప్పటికి పూర్తిగా చదవటం కాకపోవడంచేత ఈపదిరోజులూ అట్టిపెట్టుకున్నానని చెప్పి యిచ్చారండీ" అన్నాడు. ఆ లలితమ్మగారు ఎవరా అని విచారిస్తే మన యింటియెదుట తెలుగు ముసలాయన కోడలని చెప్పాడు. మీరు ఆఫీసుకు వెళ్ళినపుడు మన యింటికివచ్చి అమ్మగారితో పలుకాడిపోయేవారని చెప్పాడు. ఆ పుస్తకం అంత శ్రద్ధగా తీసుకువెళ్ళి చదివినందుకు మా చిట్టికంటె చాల నయమని సంతోషించా.

మరొకరోజు ఫరంనుంచి యింటికొస్తుండగా దోవలో ఆముసలాయన ఎదురై ఏవో కష్టసుఖాలు చెప్పుకుంటూవచ్చి తమకూ ఇన్సూరెన్సుకంపెనీవారికీ

కలిగిన దావాకాగితం చూచిపెట్టమని యింటికి తీసుకెళ్ళాడు. ఆ వ్యవహారం లో ఆయనకు నచ్చిన సలహా చెప్పినందుకు సంతోషించాడు. తలుపు చాటునుంచి ఆ లలితమ్మ నెమ్మదిగా "అక్కగారు ఎప్పుడువస్తారు? — నేను పంపిన పుస్తకం అందింది గాదండీ" అంది. ఆ కలుపుగోలుతనపు మాటలు చక్కగా మృదువుగా వినిపించినై. కాస్సేపు ఆగి "ఇక వెళ్ళి వంటచేసుకోవాలని" లేచా. "అదేమిటి" అన్నాడు ముసలాయన. "హోటల్ భోజనం పడకనే ఈ ఏర్పాటులెండి" అని ఇంటికివచ్చా.

మరుసటిరోజు పొద్దున ఆ ముసలాయన యింటికివచ్చి ఏదో మాట్లాడి తక్కిన రికార్డంతా చూచిపెట్టమని తమయింటికి తీసుకువెళ్ళాడు. వ్యవహార మంతా అయి లేచిరాబోతుండగా ఆ లలితమ్మగారు గుమ్మముదగ్గిర నీళ్ళు పెట్టి "లెండి, భోంచేతురుగాని, యిపుడు వెళ్ళి ఏం వంట చేసుకుంటారు గనక? మా మూలాన పొద్దుపోయింది గనుక మా యింట్లో భోంచేసి వెళ్లా"అంది. నే నసలే పుట్టెడు సిగ్గున్న మనిషిని. "నేను కాదుకూడ"దన్నా. ఆ ముసలాయనా ఇంకో ముసలమ్మా పట్టుపట్టి లేస్తేనే కాని వల్లకాదన్నారు. గత్యంతరం లేక మడికట్టుకుని వెళ్ళి కూర్చున్నా. విస్తర్లు వేసి ఆయన కోడలు వడ్డన ప్రారంభించింది. కిందటిరోజు ఆ ముసలాయన మాట్లాడుతూ తన కుమారుడు చనిపోవటం కోడలికి దత్తతచేసిన విషయం చెప్పాడు. గాని లలితమ్మ యింత చిన్నదని మాత్రం నేను ఊహించలా; ఆ అమ్మాయికి పాతికేళ్లుంటాయి. అప్పటికే నా కొడుకుపోయి 8 సంవత్సరాలయిందని చెప్పాడా ముసలాయన. అంటే ఆ పిల్లకు 16–17 ఏళ్ళకే వైధవ్యం ప్రాప్తించిందా? పాపం అని విచారం కలిగింది. చిన్నతనంలోనే వైధవ్యం రావటం చేత గాజులు, జుట్టు తియ్యలేదు. ఆ ముఖవర్చస్సు బ్రహ్మచర్యవ్రత దీక్షను ప్రకటిస్తోంది. నాకు ఆమెయొక్క దుస్థితిచూచి మనసు కరిగి దీనంగా రెండుమూడుసార్లు ఆమె ముఖం చూచినట్టు గుర్తు. భార్య సౌఖ్య మెరుగని నే నెంత దురదృష్టుడనో, భర్త ప్రేమ యెరుగని ఈ పిల్ల అంత దురదృష్టురా లనిపించింది. పైగా ఇద్దరంకూడా ఒకేవయస్సులో నున్నట్లు కనుపించింది. ఇద్దరం ఏ చెడునక్షత్రంలోనో పుట్టామేమో ననిపించింది. భోంచేస్తున్నానేగాని ఇదే ఆలోచన. ఆ ముసలాయనతో మాటలమధ్య "ఈ అమ్మాయేగా మీ కోడలు" అని అడిగా. పాపం ఆ మాటకు ఆ

పిల్ల సిగ్గుపడింది కాబోలు. తన ముసలి మేనత్తను వడ్డనకు పంపింది. ఏవో రెండు మెతుకులు తిని లేచి వచ్చేశా.

మంచి తెలివితేటలుగల పిల్లలాగా కనుపించింది. నన్నామె నిష్కపటుణ్ణిగాను అమాయకుడినిగాను గుర్తించి, ఇంతవరకు కిత్తమే మా భార్యాభర్తల వయోవ్యత్యాసను గమనించే ఉన్నది కాబోలు. ఏదో మాట్లాడుతూ "దేనికని విచారించగలం? తలొకరికీ తలో ప్రారబ్ధం" అన్నది. ఆ మాట నాకు నచ్చింది. అవును, దుష్టమార్గాలను తొక్కి చూడని నా మనసు ఆమెను దుష్టమైన కళ్ళతో చూడటం గానీ- వాక్కులు మెదల్పటంగానీ, బుద్ధులు ఊహించటం గానీ, ఎట్లా చేయగలదూ. నాదంతా అమాయకపు నడకగా తలంచి కాబోలు, ఆ లలిత చలిత కూడా అయిందట.

తన పెంపుడు కొడుకును నా దగ్గరకు ఇంగ్లీషు చదువుకు పంపింది. ఆ కుర్ర వాడిని ఆ ముసలాయన స్వయంగా తీసుకొచ్చి తీసుకెళ్ళేవాడు. నేను వాళ్ళ కుటుంబానికి అనుబంధీకుడుగా నుంటూ ఉండటంచేత భోజన భాజనాల్లో పరాయితనమే లేకుండాపోయింది. రోజులో ఒక మారైనా నన్ను వారూ, వారిని నేనూ చూచుకోకుండా తప్పేదికాదు. అట్లా మా మధ్య ఒక అవ్యక్తమైన అనుబంధ మేర్పడింది. చివరచివరకు లలితమ్మతో నేను గానీ, నాతో లలితమ్మ గానీ మామగారు ఉన్నప్పుడుగానీ- లేనప్పుడుగానీ- స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చుననే విశ్వాసం మాలో నిలిచింది.

## ౮

—" నాయనా! అంతటితో ఆచనువు ఆగినచో నా హృదయము "చేయి జారిన కుండవలె" భిన్న భిన్నములు కాకయుండెడిది గదా! నిరాశ్రయమై ఆధారముకొఱకు క్రింద పాకులాడెడు లతకు "పని అవిసిమొక్క అంది నట్లయింది". దానికేమి ఊడలు ఉంటేనా భార మాపుకొనుటకు.

ఒకనాడు పిల్లవానికేదో చెప్పుచుండగా లలితమ్మ నావద్దకు వచ్చి ఒక పెట్టెలోని రాతి ఉంగరమును తీసి "విశ్వేశ్వరులుగారూ! ఈ ఉంగరమెట్లున్నదో జిలకట్టుడని నామీద వైచెను. నేను రాతినీ, చేతనూ పరీక్షించి బాగుగనే ఉన్నదని మరల పెట్టెలో పెట్టితిని. అందుకామె నవ్వి,

'దాని బాగోగులు వ్రేలికి పెట్టుకుని చెపుతారా! అటూ యిటూ త్రిప్పి చూస్తూ చెపుతారా! నిజంగా మిమ్మల్ని విశ్వేశ్వరు డనేకంటె దామోదరు డంటే బాగుంటుంది' అంది. నాకు నవ్వొచ్చి "దామోదరుడంటే విశ్వేశ్వరుడు కాదనికాబోలు నీభావం. పై పెచ్చు కృష్ణత్వం కూడా పట్టిచ్చుదలుస్తూనూ" అన్నా. "ఏమో కృష్ణత్వం పట్టినాసరే, శ్వేతత్వం పట్టినా సరేగానీ "చిట్టమ్మగారిలో మీలో ఎవరు తినిపోని రసికులో తేలకుండా ఉంది.— ఏమిటో! పాడులోకంలో "కావలసింది కళ్ళసందు ఉంటే కళం వెంకల్కంటే కనాకష్టం.— అదే పెట్టెమీద ఉంటే మేరుశిఖరంకంటే మహాభారం—ఏమో యిటువంటివి చూడలేకా వినలేకా ఎండిపోయిన మాగుండెలు బీట్లువారిపోతై" అంటూ లోపలికి వెళ్ళింది. నా పాఠం పూర్తి అయింది. లోపలినుంచి ఒక గ్లాసుతో లలితమ్మ పాలు తీసుకువచ్చి "ఇందాకడిమట్టి నా మాటలతో అలసిపోయారేమో! నన్ను క్షమించి ఈ క్షీరాలు పుచ్చుకోండి" అంది.—"నాయనా! ఆమాటలం క్రిందటి క్షణంక్రింద అన్నట్లుగా వినిపిస్తున్నై."



శ్రీ జగన్నాథ స్వామివారి కల్యాణ మహోత్సవాలు జగన్మోహనంగా జరుగుతవని పత్రికలు పంపుతున్నారు. లలితాంబ "రేపు మేము జగన్నాథ స్వామివారి కల్యాణమహోత్సవం చూచిరావటానికి ప్రయాణం కడుతున్నాం." అంది. "మళ్ళీ ఎప్పుడు తిరిగిరావటం" అని నే నడిగేటప్పటికి "ఏమో ఎప్పుడో వస్తాం" అంటూ వినుక్కుంది. కాస్సేపు నేను ఊరుకొని "అక్కడ స్నానపానాలకు వసతులు సరిగ్గా జరుగుతవా!" అని అడిగా.—"ఏమో వెళ్ళాలని అదుర్దాపడేవాళ్ళకు సౌకర్యాలు కావాలి గాని మీకేం లాభం? మాకంతకోషే గాని" అంది. నేను నవ్వుతూ నాకక్లేమంత పాపిష్టికళ్ళా!—మీకేం! అక్కడెవరో మీకు తెలిసినవారున్నారుట. అన్ని సదుపాయాలూ చేయటానికి...నాకెవరున్నారూ!" అన్నా. ఆవిడ నవ్వుకుంటూ "మీకు మేము లేమూ" అంటూ లోపలికి పోయింది. "అబ్బా, ఆమాట నాజీర్ణసౌధానికి వెయ్యి పోటీల పెట్టయింది. అట్టి మాట వినటానికి కలలుకంటున్న నాహృదయం ఎంతసంతోషంతో ఉబ్బి

గంతులు వేసిందో నాయనా! ఇప్పుడింత చితికి దుఃఖంతో గందరగోళం పడుతూ తూలిపోతోంది. నే నాపుకోలేను" అంటూ అవురుమన్నాడు. మూర్తి నెమ్మదిగా "బాబూ, ఎప్పుడూ వెన్నెలే ఉంటుందా! తరువాత కానీ..." అన్నాడు. "నాయనా! ఔను! ఆ కల్యాణోత్సవాలకు నేను వారితో పండువెన్నెలలోనే బయలుదేరింది. ఆ ముసలివాళ్లిద్దరూ వెనకవస్తుంటే మేమిద్దరం వెన్నెల్లో విసనకర్రల్లాగా చిమ్ముకుంటూ పోయినాము. ఒక్క పురాణగాథలే గాదు, ఏవేవో గాథల్లో క్షణంలో స్నేహను చేరాం. ఆ మామగారిక్కూ మాయందు విశ్వాసమిట్టిది."

## ౧౦

జగన్నాథస్వామివారిదర్శనానికి వెళ్ళాం. జనం తండోపతండంగా విరగపడుతున్నారు. "ముసలివారిద్దరూ పిల్లవాడిని తీసుకొని జనం సందిచ్చినప్పుడే వెళ్ళి దర్శనం చేసుకుంటామని బసకు వెళ్ళిపోయారు. నే నిప్పుడే స్వామి దర్శనం చేసితీరాలి...ఎట్లామరి" అంది లలితమ్మ. "నేనున్నాగా; అంతగా కాకపోతే నే నెరిగిన పోలీసతడు కనుపించాడు. వాడిద్వారానైనా దర్శనం చేసి మరీ వెళదాంలే" అన్నా. "నువ్వుంటావనేగా నేను బయలుదేరింది! ఒకరికొకరు ఎట్లా ఉండకలుగుతామో" అంటూ నా కొంగుపట్టుకొని ఆలయం లోపలికి జనాన్ని ఒత్తుకుంటూ వచ్చింది. "ఈ అమ్మాయి మా చిట్టి కాకూడదూ!" అని నా హృదయనాళాల్లో సన్నని మోత మ్రోగింది. "ఔను నేను మీ చిట్టమ్మ నెందుకు కాకూడదూ!" అని లలితమ్మ సన్నగా అన్నట్లు వినిపించింది. నా గుండెమోత ఆమెకు వినిపించిందేమోనని నాకు సిగ్గు కలిగింది.

ఇట్లే దేవతాదర్శనంచేసి ఉత్తరద్వారాన వచ్చి మంటపం ప్రక్క కూర్చున్నాం. "పాపం నువ్వు ముందుండి జనాన్ని ఒత్తిగించేప్పటికి నీ జబ్బ లన్నీ నలిగిఉంటాయి. నేనేం చేయను" అంది. అప్పుడూ వెన్నెలే. ఎంత వెన్నెల. అబ్బా యింత చీకటికిముందు వింత వెన్నెలుండదు. "పదండి, ఆ మంటపంమీద కూర్చుని భజనలు చూద్దామంటుంది. ఏవో కొసరి కొసరి మాట్లాడబోతుంది. వెన్నెల చాలా యిదిగా ఉందంటుంది. ఒక ప్రొద్దువేళ స్వామికల్యాణం జరుగుతోంది. అమ్మవారిపీ అయ్యవారిపీ ప్రేమ

రలు ఎంతో ఆనందంగా ఉన్నై. వాటిలో విశేషాలు లలితమ్మగారు విని పిస్తోంది. నాకు తెలియని విషయాలుకూడ వచ్చినయి. చదువుకున్న స్త్రీ అని ఆమెమీద భక్తికూడా కుదిరింది. ఆ జనసమ్మర్దంలో స్వామికల్యాణ మహోత్సవం, ఇద్దరం ఇద్దరమయి చూచామా లేక యిద్దరం ఒకళ్లమయి చూచామా స్పృహలేకపోయింది.”

కొందరు అల్లరి పిల్లలు ఒక ఆడపిల్లని అల్లరి పట్టించారు. “చూచారా! ఎవరైనా ఆడది కనిపిస్తే తిరణాళ్లలో ఆదీవరస. వెళ్ళేటప్పుడు నా గతేమిటో!” అంది. “నేను మీ వెంట ఉండగానే!” అని నే నంటూ ఉండగా “మీరు ఉన్నారనే ఇట్లావచ్చి మారొచ్చికలిగింది. “ఎవరయినా ఆవిడ మీకేమవుతుందని అడిగితే మీరేమని చెపుతారో?” అంటూ అవిగో తరంబరాలు పోస్తున్నారు చూడండంది. నేను సందిగ్ధంలో పడ్డా—“అబ్బా! ఆ రోజుకోజులే కాదు ఎనిమిది సంవత్సరాలూ అట్లాగే గడచిపోయినై— “ఎన్ని తల్చిపోసుకోనూ, ఏదైనా ఒక పెద్దపెళ్లికిందపడి యిద్దరం దాగైనాపోయాం కాదు.

కుర్రవాడి కైనా పాఠం చెపుతూ ఉంటే “ఏమిటది నాకు పెంపుడు కొడుకైనా తమ స్వంత బిడ్డలాగా చూసుకుంటున్నారా! మాటా పలుకూ లేకుండా ఒకటే చదువు. ఈ ఊరొచ్చిం తరువాత బడిపంతులుతనం నేర్చుకుంటున్నారు గాబోలు” అనేది లలితమ్మ. ఆ నోటమ్మట ఏమాటవచ్చినా కమ్మగా ఉండేది.

ఆవిడ చాలా తెలివైన మనిషి. మామగారుకూడా ఆ అమ్మాయి సలహాతోనే అన్నిపనులూ చేస్తూ ఉంటాడు. డబ్బూ దస్కమంతా ఆవిడ చేతులమీదుగానే జరుగుతూ ఉంటుంది. సాలుకు రెండు మూడు వేలు వచ్చేట్టున్నై.

ఒకరోజున మామగారిఎదుట లలితమ్మ నాకు ఒక 100 రూపాయలనోటిచ్చి “ఇది మీ బ్యాంకులో మీ పరంగా ఉంచండి. అర్జంటుగా కావలిస్తే మేము పోలున తీసుకు వాడుకొనవచ్చు. మాదగ్గర ఎంత ఉంటే అంత ఖర్చుగానే ఉంది.” అని అడిగింది. నే నా నోటు తీసుకోకుండానే “నాకు బ్యాంకి దాపరికం లేదే! కావలసింది కొట్టులోంచే తీసుకుంటా. పోనీ కొట్టులో జమచేయిద్దామంటే ఏ బాపతుకింద జమ చేయిద్దామా

అని ఆలోచిస్తూ తర్కించుకుంటున్నా." వెంటనే లలితమ్మ మూతిముడుచు కుంటూ 'బాబూ! మీరేం బాధపడనక్కర్లా! మాడబ్బు మాకు బరువు కాదులెండి. ఏదో ఫరం మేనేజర్లు కనుక అదనుకు వస్తుందని ఆశతో అడిగాం' అంటూ లోపలికి వెళ్తూ 'ఇటువంటి మేనేజరు మేనేజి మెంటు- బలే...వట్టి......' అని ఏదో అంటోంది. ఆ లలితమ్మ మామ గారు పోనీలెండి, 'మీకు బ్యాంకి ఎక్కౌంటు ఉండకపోతే ఏం చేస్తాం గనుక' అన్నాడు.



నేను భోంచేసి ఫరంకు వెళ్లాలని సిద్ధమవుతున్నా. జనం రోడ్డుమీద సంద డిచేస్తున్నారు. అటుచూతును గదా రోడ్డుప్రక్క యింత అన్నం చెల్లా చెదరై పడిఉంది. ఒక కుక్క తింటూంది. కొద్ది దూరంలో ఒక మట్టి కొట్టుకున్న గుడ్డను చేత్తో పుచ్చుకుని 10-12 ఏళ్ళ కుర్రవాడు ఏడుస్తూ నుంచున్నాడు. విషయం తెలియటల్లా. ఇంతలో మా నౌకరువచ్చి "అయ్య గారూ! ఆ బాపన అబ్బాయిగారు మాదాకవళం పోగుచేసుకుని మనవీధి గుండా ఎడుతుంటే నాయుడుగారి కుక్క ఎంటపడి ఆ కుర్రాయన చేతిలో సంచిని పీలికలుగా చించి కూరలూ, పులుసూ, నేల పాలుచేసి అన్నం తింటోంది. వణ్ణం కోసం ఇద్దరు తమ్ములూ, తల్లీ ఎదురుసూస్తూ ఉంటారుట. 'పాపం! ఆ బుడ్డాయన ఒకటే ఏడుపు' అని చెప్పాడు. నాకు చాలా జాలి కలిగి ఆ కుర్రవాడిని మా నౌకరుచేత పిలిపించి ఏడవ కని ఓదారుస్తున్నా. ఆ కుర్రవాడు ఏడుస్తూ 'నా కసలే ఇది ఒకటే గుడ్డ, కుక్క కాస్తా చింపేసింది. అన్నంకోసమని తమ్ముడూ వాళ్లూ చూస్తూఉంటారు, ఇంకా నేను స్కూలుకు కూడా వెళ్లాలని' ఎక్కెక్కి ఏడిచాడు. ఇంతలో ఒకాతడు "ఏదైనా యిచ్చి పంపండి పంతూలుగారూ" అన్నాడు. వెంటనే ఆ కుర్రవాడిని లోపలికి తీసుకెళ్ళి శుభ్రంగా స్నానం చేయించి నాకు రాత్రికి ఉంచుకున్న అన్నం - కూరా తీసుకు వెళ్ళమన్నా. 'ఎందులో పట్టికెళ్ళనూ' అన్నాడు. ఎదురుగా ఉన్న ఖద్దరు ఉత్తరీయం ఇచ్చి అందులో కట్టుకువెళ్ళమన్నా. మళ్లీసాయంకాలం తీసుకువచ్చి యిస్తానన్నాడు, నేను "అక్కరలేదులే" అనేప్పటికి

'అచ్చంగా తీసుకోనా' అని అడిగాడు. నేను "ఓ" అన్నా ఎదో సంతోషంతో. అప్పుడా బుడతడి ముఖంలో కనుపించిన సంతోషం– "అబ్బా– ఇంతదుఃఖానికి – ఏంతో సుఖానికి కారణమైంది–"

'ఈకాస్త అన్నం మీ అందరికీ సరిపోతుందా, అని అడిగితే 'ఇది మా తమ్ముళ్ళకిచ్చి నేను బడికి వెళతా, నన్నాడు "నీకెట్లామరి" అంటే "మా అమ్మ, ఉందిగా" ఆవిడ ఎట్లాగో తెచ్చిపెడుతుందన్నాడు. ఆకుర్రవాడు మా అమ్మ ఉందిగా అనేప్పటికి నాకు మా అమ్మ లేదుగా, యిట్లా కడుపులో పెట్టుకునేందుకు అని దుఃఖమొచ్చింది. "అబ్బాయీ! ఈ బియ్యంకూడా తీసుకెళ్ళి వండుకుతినం"డని ఇచ్చి పంపా. 'అమ్మతో ఇదంతా చెప్పుకుంటా' నని ఆకుర్రవాడు వెళ్ళిఉంటాడు. నేను మా అమ్మను స్మరించుకుంటూ ఘరంకు వెళ్లా. మా యిద్దరినీ పంపి మానౌకరు వాకిట్లో కూర్చున్నాడు. సాయంకాలం లెఖలు తెమలక ఆలస్యంగా యింటికివచ్చా. అప్పుడు వంటచేసుకోవలసి వచ్చిందని ఇదౌతున్నా. పైన మబ్బుపట్టి వర్షంవచ్చేటట్టుగా కూడాఉంది.

"మాష్టరుగారూ! మాష్టరుగారూ!" అంటూ లలితమ్మగారి కుర్రవాడువచ్చి 'మా ముసలమ్మ మిమ్మల్ని వెంటనేవచ్చి ఒకమాట వినిపొమ్మని చెప్పి పంపిందండి' అన్నాడు. ఆతడి తాత మహాన్యాళ్ళు చేయించటానికి ఏదో ఊరికి వెళ్లాడు. ఒకవేళ ఆయన దగ్గరనుంచి ఏదైనా ఉత్తరంవచ్చిందేమోనని, "మీ తాత దగ్గిరనుంచి ఉత్తరం వచ్చిందా" అని అడిగా. నాకు తెలియదు, మిమ్మల్ని అర్జంటుగా రమ్మనమని మా అమ్మకూడా చెప్పింది అన్నాడు. వెంటనే చొక్కా తొడుక్కుని రెండు నిమిషాల్లో వారియింటికి వెళ్లా.

ఆ ముసలావిడ నాయనా! ఇంత పొద్దుపోయిందేం యింటికి వచ్చేప్పటికి చూచావా! ఆ ముసలాయన వెళ్ళి అతీపతీలేదు – ఉత్తరం కూడాలేదు. అంటూ ఏదో మొదలుపెట్టింది. కొంతసేపు లలితమ్మ గూడా మాట్లాడింది. పొద్దుపోతోంది, నేనింకా వంటచేసుకోవాలి. వీళ్ళకు నా యిబ్బంది ఏం తెలుస్తుంది అనుకొని 'అవ్వగారూ వెళతా! ఇంకా వెళ్లి భోజనం చెయ్యాలికూడాను'' అని లేచా.

లలితమ్మ "ఇప్పుడు వంటచేసుకునేగాదూ?" అంది. పొద్దుటి గొడవంతా

చెప్పాలిసివస్తుందని "కాదులెండి........." అంటూ ఉండగా "అబద్ధాలాడైనా ఒక ఆడపిల్లనైనా కందామనా(" అని నవ్వింది. "సరే లెద్దురూ! ఆనేటప్పటికి సరిలేదూ జేసిలేము. మరొకమాట మాట్లాడకుండా లేచి యిక్కడ భోజనంచేసిపొండి. ఇవిగో నీళ్లు, ఇదిగో పట్టుబట్ట అంది. ముసలమ్మగూడా 'లే నాయనా! పొద్దు వెప్పుడో భోంచేసి వెళ్లావు. వెళ్ళేప్పుడు మింగతా అన్నంకూడా ఎవరికో యిచ్చి కూడ వెళ్లావట." అంది

లేవక తప్పిందికాదు. లలితమ్మ వడ్డించింది. "ఈ గారెలూ, క్షీరాన్న మేమిటి! అనుకున్నా. లలితమ్మ నవ్వుతూ "పొద్దుట మీ ధర్మబుద్ధికి సద్యఃఫలితంగా సాయంత్రానికి భగవంతుడు మీకీ ఫలితమిచ్చా"డంది, అట్లాగతే నాకు భగవంతుడు లలితాంబగారే కామా" అన్నా. "ఆలలితాదేవికికూడా విశ్వేశ్వరుడేగా దైవం" అంది. ఆ మాటలు ముద్దులొలికినై. "నా ధర్మానికి ఇది ఫలమైతే మీ ధర్మానికి ఏం ఫలమో!" అన్నా. "నాకా ఈశ్వరుడి దయ చాలంటూ లోపలికివెళ్ళి రెండు గారెలుతెచ్చి వద్దన్నకొద్దీ వేసింది.—"నాయనా! ఆ రుచేమిటో గానీ సద్యఃఫలమే కాకపోతే ఈనాటికీ మనసు మరువకుండా ఉండగలదా! అంత ఆప్యాయమైన భోజనం.

మెరుపులు ప్రారంభమై వర్షం ప్రారంభమైంది. గాలి హోరుమంటోంది. ఇంటికి ఎట్లా వెళ్ళటమా అని ఆలోచించుచున్న నావెనుక ఆ లలితాంబ నిలువబడి "విశ్వేశ్వరంగారు! ఇంటివద్ద పాలకు ఏడ్చే పిల్లలు లేకుండా ఉంటే ఆ గదిలో పరుపుమీద పడుకొని ఉదయం వెళ్ళవచ్చు" అంది. ఆ మాటకు వత్తాసే చేసేందుకు ముసలమ్మగారు గాఢనిద్రలో ఉండి లేకుండాపోయింది. మళ్ళీ కాస్త ఆగి "మీ కేదైనా యిబ్బంది ఉంటే ఇంటికే వెళ్ళండి. బలవంత మేమీ లేదు" అంది. ఎట్లా వెళ్లేదీ! గొడుగూ లేదు. వర్షం అంతకంతకు అధికమవుతోంది. చివరకు "సరేలెండని" వెళ్ళిపడుకున్నా. బయట జిమ్మని ఈదురులేస్తుంటే లోపల నేను ముసుగు పెట్టుకొని వెచ్చగా పడుకుని యిట్టే తెల్లవార్చుకున్నా — అదే నాజీవితంలో మధురమైన రాత్రి, "కాని నాయనా! నా జీవితమట్టా తెల్లవారింది కాదు" — తెల్లవారింది వర్షం వెలిసింది. కాని వెలిమబ్బులు తుండా

ఉంగా కళ్ళుమూసుకుంటున్నై. వసారాలో 'అత్తా! రాత్రి నేను స్వర్గంలో తిరుగుతున్నట్టు కలవచ్చిందే" అని లలితమ్మ ముసలమ్మతో అంటుంది. చాలా సార్లు పోయినట్లుగ పడుతున్నావు." నేను లేచి సరాసరి యింటికి వచ్చేసా.

౧౨

మహానూళ్లు చేసుకుని ముసలాయన యింటికొచ్చాడు. నాకు 15 రోజులు జ్వరం పట్టుకుంది. ఒంటరిగా ఉండటంచేత 'మీకు పత్యపానం సరిగ్గా జరగట్లేదు కనుక మా యింట్లోవచ్చి యుండమంటాడు ముసలాయన. లలితమ్మకూడ ముసలావిడను వెంటబెట్టుకొని వచ్చి మా యింటికి వస్తేనే గాని వీలులేదని బలవంతంచేసి తమ యింటికి తీసుకువెళ్ళింది. ఎంతో సేవచేసింది. దగ్గరెవరూ లేకపోతే చెయ్యి ఊతయిచ్చి వరండాలోకి గదిలోకీ తీసుకువచ్చేది. నారింజరసం బత్తాయిరసం ఇచ్చేది. వంటపని అంతా ఆ ముసలావిడమీద పెట్టేసి. నా దగ్గరే ఉంటూ ఉండేది లలితాంబ. మందూ మాకూలేని నా స్వంత వైద్యం. హృదయపూర్వకమైన ఆమె పరిచర్యా, యింకేం కావాలి! రోగం పెనకాడి పోయింది.

ఇంటికి వచ్చేయమని మామ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. 'వెళ్లటానికి వీలులేదని లలితఅన్నది. పత్యం పంటు పడుతోందని ఉత్తరం వ్రాయించింది. మామ చిట్టిని పంపించాడు. లలితమ్మ నాకు బత్తాయిరసం ఇస్తూ తోచిన సేవ చేస్తుంటే మా చిట్టికంట పడింది. "చిట్టెమ్మగారూ? నాకేం కావాలో చూడండి" అని లలిత అంటే "ఎంతమంది" చూడాలి అంటూ దీర్ఘం తీసింది. సరే అయితేనని లలిత కంటి రెప్పలాగా నాకు కనిపించింది. చిట్టి మూతి బిగించుకు పడుకునేది.

జ్వరం పూర్తిగా నయమయింది. మామూలుగా ఫరంకు వెళ్ళివస్తున్నా. లలిత మధ్యాహ్నము పూటవచ్చినా దగ్గర కూర్చుని చిట్టితో ఏదో ప్రసంగం మొదలుపెట్టేది. చిట్టి ఒకప్పుడు ఇష్టంగా మాట్లాడుతూ ఒక్కొక్కప్పుడు మూతి ముడుచుకునేది " నువ్వు మూతిముడుచుకున్నా సరే పొడుగు చేసుకున్నా సరే నా పరమావధి నాకు నిశ్చయమే" ననేది" లలితమ్మ. చిట్టి రవ్వంతకూడా తాను మారక, మనసు మార్చుకోక, నా మీదికి యుద్ధసన్నాహంలో ఉండేది. లలితమ్మ నా చుట్టూ కోటలుకట్టి "నా విఘ్న

పృథివీపతిః" అన్నట్టు పూజించేది. జయాపజయాలు నా భుజాలమీద తాండవించేవి. చివరకు చిట్టి చెప్పా చెప్పకో మామయ్యద్వారా సాధించాలని తల్లి దగ్గరకు వెళ్ళిపోయేది. మళ్లీదాడిచెయ్యడానికి వస్తూ ఉండేది పచ్చికాయో - పెచ్చికాయో రాళ్ళతో రాలకొట్టుకుని తినాలనుకునే అల్లరిపిల్లకాయవంటి దయింది చిట్టి. ఆకాశమమ్మట అటూ యిటూ ఎగురుతూంటూ వచ్చి వచ్చి ఇమ్మని వాసనలను కనిపెట్టి పచ్చటాకులసందున నక్కి దోరపండుకాయలతో పొట్టనింపుకునే చిలక పడుచయింది లలిత. వీరిద్దరికీ నీడయిచ్చి నిలుచుంది గున్నమామిడి. తనఫలాలు ఇద్దరికీ అందించుకుంటూ!... నాయనా! ఆ మామిడన్న నిలూనా ఎండిపోగూడదూ! బాధలు లేకపోనుగా! ఇదిగో యిక మునిగిపోయింది. నావ మునిగిపోయిం"దని కన్నీరు కార్చాడు.

మూర్తి ఓదారుస్తూ అన్నిరోజులు మనవెందుకవుతై...అన్నాడు. "ఔను! నాయనా! అటువంటిరోజేవచ్చింది. తన మర్యాదకు భంగం రానిచ్చింది కాదు. నామర్యాద పోనిచ్చిందికాదు. ఎన్నో యాత్రలకు నావెంట నడిచింది. ఎంతో దానిని ప్రయాసపెట్టి ఆమె ఉసురు పోసుకున్నా. అయినా నాకు తగల్లా. ఒక యాత్రలో మధ్యారణ్యప్రదేశంలో నిశీధిలో ఆగలివస్తే, నాకు మెత్తటి ప్రక్కచూపి వెచ్చటి సెగడుపెట్టి నాసంతోషన్ని చూచుకొని తాను ఆనందించుకుంది. చిట్టి ఆ సెగడువేడికి ఎండిపోయిందేమో, బండలాగే పడుకుంది. ఆమె కాస్తున్న వెన్నెల్లో ఏదేదో మాట్లాడుతూ ఉంది లలితమ్మ. నాయనా! నాచూపులు చదువుకుని చేతలు చేసుకుంది. తనకు జారిపోయిన ప్రియత్వాన్ని ఆ విధంగా పూర్తి చేసుకుంది. నాకు దూరమైన మధురక్షణాన్ని పిలిచి పెట్టింది నాయనా! ఆ తల్లి ఏదీ? తాను నిలువుకో లేకపోయింది. అబ్బ! నాకు నిలువ లేకపోయింది. ఆ ఎనిమిది సంవత్సరాలే ఎనిమిదిరోజులుగా మార్చింది. ఏమని చెప్పనూ! ఎంతని చెప్పనూ.

## ౧౩

అది శ్రావణమాసం. మామామ రమ్మని ఉత్తరం వ్రాశాడు. వెళ్లాను, పని కూడా అయిపోయింది తిరిగి గంజాం రాకూడదూ! ఎట్లా రాగలనూ?

మొదటినుంచీ దురదృష్ట బ్రతుకే నాది, ఏదో మధ్యలో నా జీవితకలశంలో రెండు అమృతబిందువులు రాలినాయి గాని మా చిట్టీ - అత్తా నన్నే సాధించటం మొదలుపెట్టారు. గంజాంలో వద్దు, ఇంకెక్కడన్నా ఉండమంటారు. మా మామ అట్లాగే అంటాడు. "అక్కడ యిల్లు కట్టుకునే ప్రయత్నంలో ఉన్నాను గనుక అక్కడే ఉండాలి" అంటూ నేను, "నువ్వు వెళ్ళొద్దు - నేను రానూ రాను" అంటుంది చిట్టి. నా సాధు స్వభావాన్ని చిదిపి నేలపాలు చేస్తుంది. లలిత దీనిని సువర్ణపాత్రలో కత్తి తేర పెడుతుంది.

నేను బయలుదేరకలసిందే మా కొట్టులెక్కల తనిఖీకి మృత్యువులాగా ఒక గవర్నమెంటు ఉద్యోగివచ్చి కూర్చున్నాడు. రోజులు గడిచినై. నా కేదో భయం కలిగింది కారణం కనిపించదు. ఎవరో ఆకాశాన విమానంలో ఎగిరిపోతూ ఏడుస్తున్నట్లూ, లలితాంబ పెద్ద నది ఒడ్డున నిలబడి నన్ను పిలుస్తూ "నన్ను దాటించు విశ్వం గారూ" అంటూ బతిమాలుతున్నట్టూ స్వప్నమొచ్చింది. "నాయనా! తాను స్వప్నములో దర్శనమిచ్చి నన్ను రక్షించమంది గాని నేనేం చేయగలిగానూ? చెయ్యన్నా అందించగలిగానా? కలలో ఇంత గందరగోళం పడ్డా, లేచి ఊరుకున్నా, ఆరోజు అన్నమి. క్రిందటిరోజు నా తల్లి లలిత, మెట్లమీదపడి నెత్తురు కక్కుకొన్నదట. స్పృహపోయినది. ఏదో వైద్యం చేశారుట. రాత్రి తెలివివచ్చిందట. "అబ్బా నాయనా! ఇక చెప్పలేనోయ్" అంటూ దుఃఖాన్ని ఆపుతూ లలిత తన అత్తను పిలిచి నెమ్మదిగా "అత్తా! విశ్వం గారిని పిలిపించుతావూ, చూడాలని ఉంది. నేను బ్రతక'నందిట. ఆ మాటలతో ముసలామెకు మతిపోయి ఊరుకుంది. ఇంతలో లలితకు మగత వచ్చింది. మళ్ళి నెత్తురు ప్రవాహం బయటికివచ్చింది పెద్దడాక్టరుని తీసుకువచ్చారు, "అంతా క్షణాల్లో ఉంది, ఎవరైనా తమ నెత్తురు ఆవిడకు ఇస్తే బ్రతుకుతుందన్నారు, మా లలితకు మళ్లీ స్పృహవచ్చి "అత్తా! ఆయనవచ్చారా?" అని కళ్ళువిప్పి నెమ్మదిగా అడిగిందిట, నాయనా! అప్పుడు నేనుండగూడదూ! నా నెత్తురేమిటి - ప్రాణాన్నిచ్చి బ్రతికించుకోనూ, అంటూ పెద్ద ఏడుపును మింగేశాడు- ముఖం పాలిపోయింది- కొంతసేపు చేతసత్వం లేకుండాపోయింది- మూర్తి నాడావిడితో కుండలో నీళ్లు ముఖాన జల్లాము- విశ్వం మళ్ళీ కళ్లు తెరిచాడు, 'ఏదీ లలిత'

అన్నాడు- మూర్తి నివ్వెరపోయాడు- "ఇప్పుడువచ్చి ఓదార్చిందిగా !" అన్నాడు- నాయనా ! ఒక పిశాచంగానైనా అయి నన్నావహించి నన్ను తనలోకి తీసుకోకూడదూ- ఎందుకు చంపుతుంది- ఇంటిమీద ఈగనైనా వాలకుండా వెయ్యికన్నులతో చూచిన తల్లి-"

ఆమె మరణానంతరం నేనెట్లా బ్రతికానో! నన్ను ఓదార్చేవారెవరున్నారు! నా చిట్టివచ్చి నన్ను ఓదార్చకూడదూ, రాదు, దానిపగేమిటో! నా తల పగిలిపోగూడదూ! దాని గట్టితనమేమో! అయిపోయింది. ఇంకేం చెప్పుకోనూ, ఆ రెండోరోజు వెళ్ళా, ముసలమ్మ అవునుమంది. నా కన్నీళ్ళు ప్రక్కలో పడుకోనికుళ్ళిపోయినాడు, నాకు మైకం వచ్చింది. ఆ తెరలో లలితమ్మ స్పష్టంగా కనుపించి నవ్వుతూ నుంచుంది. నాకు వళ్ళు తెలిసింది. "నీకు సంతోషంగా ఉంటే నే నెందుకు దుఃఖించాలని తోచింది." ఆ సాయంత్రం ఆ స్మశానాలలోకి వెళ్ళి ఆ చితిని చూచుకున్నా. మళ్ళీ లలిత స్ఫురించింది, ఇంత బూది తీసుకున్నా. "ఏం చెయ్యగలనూ? మా చిట్టి చాలా. భారం ఎట్లా తగ్గుతుంది. దేశాలవెంబడీ తీర్థాలవెమ్మటీ తిరుగుతున్నా! నాయనా! ఈరోజు ఆ పవిత్రదినం. క్రిందటి సంవత్సరం ఈరోజునే ఈ ఘడియల్లోనే లలిత వెళ్ళిపోయింది" అంటూ మూర్తి భుజంమీద వ్రాలాడు... ... ... ...మూర్తి సంభాళించి కూర్చున్నాడు- విశ్వేశం మళ్ళీ లేచాడు- "నాయనా ! నీకు పొద్దుపోయింది, నాకు నిశిగా ఉంది- ఇంతకుముందు గాధ ఈ చెట్లతో చెప్పుకుంటున్నా, ఇంతలో నాతండ్రివి నువ్వువచ్చావు- ఇక వెళ్ళు, నేనూ వెళ్ళుతున్నా" నని లేచాడు. ముఖం గాంభీర్యించి ఉంది. మూర్తి "ఎక్కడికి!" అని అడిగాడు—"ఎక్కడికో! ఇంకా ఇక్కడ ఉండనే—ఎంతో దేశం విశాలంగా ఉందంటూ—"అమ్మా! అమ్మా!" అంటూ లేచాడు—

మూర్తి "బాబూ! భార్యా పిల్లలను ఏంచేస్తావు?" అన్నాడు. "నాయనా! నేను ఇంతవరకూ భరించలా, అసలు నాయనన్న ఆశ్రయిస్తేగా! నా ఆశ్రయం పోయింది. చీకు సంసారం వద్దు. పెద్దల ఆశ్రమమే శరణ్యం. నా తల్లి పోయీగూడా నాకు పరమసాయం చూపింది. అదేంవ్యక్తో? దివ్యశరీరి. ఇక నాకు సెలవు ఇప్పించు- నా భారం తగ్గించిన నిన్ను భాగ్యదేవతగా తలుస్తున్నా- ఈ బ్రతుకు కథ నీ వొక్కడవ్వా చెప్పుకోవన్నావాడా" అంటూ లేచి నమస్కారంచేసి పొదల్లోదూరిపోయాడు-

# 10 రైతు కుటుంబం

## ౧

సుందరశర్మ బి. ఏ., బి. యిడి. డిగ్రీ పుచ్చుకొన్న ఒక అగ్రహారీకుల చిన్నవాడు. 50 యకరాల అగ్రహారం ఉంది. బొంబాయిలో ఒక బ్యాంకి తరఫున పనిచేసి కారణాంతరాలచేత అక్కడ మానేసి మద్రాసులో ఏదో వ్యాపారం సాగించాడు. ఇంటి విషయాలన్నీ తల్లి చూసుకుంటుంది. పొలంపాటు విషయం పెంకుడికి చూసుకుంటాడు. శర్మ పూలరంగడులాగా వ్యవహరిస్తున్నాడు, ఇట్లా జరిగిపోతుండగా దైవానుగ్రహంగా అగ్రహారం భూముల అక్టు పాస్యయింది.

అగ్రహారీకులంతా తాళ్ళ విరగతొక్కుకుని భూములు స్వాధీనం చేసుకొని స్వంతకృషి సాగించారు. సుందరశర్మకు భూమి గుదిబండయిపోయింది. పట్నవాసానికీ ఉద్యోగాలకూ స్వస్తిచెప్పాలిసొచ్చింది.

చదువుకున్నవాడు గాబట్టి పల్లెవాసానికి జీవితాన్ని అనుకూల పర్చుకుని సేద్యంలో ఉన్న మహాత్తును కూడా అనుభవం చేసుకోవాలని నిశ్చయించాడు. తనవిజ్ఞానాన్ని తనభూమిలో పండించాలని తలచాడు, తన భూమినంతా తొక్కి చూస్తున్నాడు.



ఒకనాటి సాయంకాలం పసపుటి గరువు పరీక్షిస్తున్నాడు. పొలం మధ్య పాల సమ్మగాడి 70 ఏళ్ళ ముసలితల్లి కందిమొళ్లు పీకి వల్లెపంచీలో వేసుకుంటోంది. అది నడుము వంగిన ముసలిదాని తాపత్రయాన్ని విమర్శించుకుని "మాణిక్యం అంత మూటతో ఇంటికి పోగలవటే? నీ తాపత్రయం కూలిపోనూ" అన్నాడు.

మాణిక్యం:— బాబూ! వాటిజోలి కెందుకుపోతా! ఆ చెక్క - బాగు అక్క మీ తాతగారి పైనుంచి వదిలేశారట! అబ్బో యిప్పటి మాటా!! నేను తోలంబరంగా ఈ ఊరు కాపరానికొచ్చిన కొత్తలో మీ తాతగారు కొత్తగా ఎగసాయంలోకి వచ్చారు. మన కో తెల్లపెయ్య ఉండేది. అది నాగులదిబ్బకాడ తిరుగుతూ వుండగానే పురుగుముట్టి పడి పోయి నురుగులు కక్కుతోంది. అప్పుడు మీ తాతగారు ఎంతమంది చెప్పినా మంత్రం మందూ వేయించుకోకుండా దిబ్బదగ్గరకెళ్ళి నుంచొ హృత్పూర్వకంగా వేడుకొన్నట్టుగా "మీరు మా కళ్ళపడుతున్నా చంప నీయకుండా మా భూమిలో కొంత చోటిచ్చి చవితిరోజుల్లో పాలు పోయించి మిమ్మల్ని దైవాలుగా చూసుకుంటూంటే మీతోపాటు తిరిగే పసువును కఱచి చంపుతారా! సరే కానియ్యండి. ఈ పడి పోయిన పెయ్యని ఇక్కడనుంచి తీసుకెళ్ళను. బ్రతుకుతుందా యింటికి కొస్తుంది. చస్తుందా యిక్కడే పూడుస్తా"నని నాగులమీద అలిగి యింటి కొచ్చారు.

ఇదేం పిచ్చితనమని ఊళ్ళో అసామీలంతా నవ్వారు. కంకణమంటి పెయ్యని నిష్కారణంగా చంపుతున్నాడు బ్రాహ్మడన్నారు. మరికొస్తే కొందు ఒతికించుకుంటా మన్నారు. తాతగారు ఎవరేమన్నా సరే. మనివాళ్ళకూడా ఆ దిబ్బచాయలకన్నా వెళ్ళొద్దన్నారు. ఆ మహానుభావుడిలో ఏం శక్తి ఉందో, ఆ నాగుల్లో ఏం సత్యముందో తెల్లవారేప్పటికి పెయ్యొచ్చి దొడ్లో గాటిదగ్గర మేస్తోంది. విన్నావా! అవి అంత సత్యంగలవి. వాటిజోలికి పోకు. అవి ఏనాటివో.

"నువ్వు చెక్కబాగుచేసి దానిమీద పొగాకు వేద్దామని పెద్దోడితో చెప్పావంటగా బాబూ! నేను సదువుముక్కలు రానిదాన్నిగానీ — ఆ పంట మనకు తిండికొత్తుందా? మన పసువులకు తిండికొత్తుందా? చెప్పు. కాదు మనం లాభం గడిద్దామంటావా! మనం తినే కూరపాదులు పళ్ళచెట్లూ పెడదామని తోచకూడదూ? ఎందుకా ఎదవ పొగాకు పంట? కూరలేసుకుంటే అంతలాభం ఏందుకురాదు? మన భూమిలో ఎందుకూ పనికిరాని ఆ పాడుపంట పండించి మన భూమిని ఎందుకు నిస్సారం చేస్తావని కర్మకంకణం కత్తి చూసింది,

ఆమాట లెంతవాడినైన దూహాన్ని తొల్చివయ్యాగాని శర్మ హృదయ మధ్యంలోకల్లా దూసుకుపోయినై. అంతరంతకూ తనలో గూడుకట్టుకొని శాంతిగా నిలిచియున్న ఊహాలన్నీ పెద్దగాలితాకిడికి చెదరిపోతున్న దూది మబ్బులు లాగా స్థాయితప్పి సందేహాస్పదాలయినై. శర్మ వెంటనే లేచి "మాణిక్యం! పొద్దు వాటారుతోంది. ఇంకా నువ్వు ఇంటికి వెళ్ళు. నే నిట్లా పోతా"నని బయలుదేరాడు.

గనుములు దాటుతున్నాడు. కానీ "మన భూమిలో ఎందుకూ పనికిరాని ఆ పాడు పొగాకుపంట పండించి మన భూమి కెందుకు నిస్సారం చేస్తా"నన్న ఆ మాణిక్యం మాటలు తను నడుస్తున్న ఆ గట్లమీద పెద్ద అక్షరాలతో చెక్కినట్లు కనబడుతున్నై. ఆ అక్షరాలను ఎట్లా తొక్కనని వెనకాడుతూ నిలబడి పోతున్నాడు శర్మ.

"మన భూమా?- అంటే నా ఒక్కడిదీ కాదూ! మాణిక్యంనీ దాని కుటుంబానిది కూడానా? నాయుళ్ళకి మా తాత కొంతభూమి విడదీశాడా? ఈ పాడు పుగాకెందుకు? మన భూమిలో కూరలు వేయమని మాణిక్యం సలహా యిస్తుందా!" ఇదంతా నేను శాంతిగా కూర్చుని అర్థం చేసుకోవాలని గ్రహించి వెనక్కి తిరిగి ఆ ప్రక్కగనుము పట్టుకుని యింటికొచ్చాడు.

౨

"ఏటి ముంపతేగ; కూరకాయలకు కరువొచ్చింది. అసలే కావిళ్లు రావటం మానేసినై. ఆ వచ్చిన వంకాయల కావిడి ముండాకొడుకు వీసె ౧-౮-౦ కు తక్కువివ్వనన్నాడు. కూరాకుమ్మ కనపడటంలేదని" శర్మతల్లి వంటింట్లో గొణగొణమంది. "ఎట్లాగో చేతిలో పని మనుషు లున్నారుగా! ఆ దిబ్బమీద ఇన్ని వంగలూ బీరలు పాదుయ్యించ కూడదూ" అని శర్మ భార్య గదిలోంచి చిన్న సలహాయిచ్చింది.

శర్మ సాయంత్రం పడమటిపొలం చూసుకుంటూ పిల్లకాలువమ్మటి తుమ్మల బీట్లో కొచ్చాడు. ప్రక్కడొంకలో చిన్నపోట్లాట జరుగుతోంది. శర్మ నిలబడి చూస్తున్నాడు. ఇద్దరేకమై ఒకడిమీద పోట్లాడుతున్నారు. వారి మధ్య ఒక పచ్చగడ్డిగంప ఉంది. ఆ వొంటరిగాడు బిగ్గరగా "మీ అయ్య

౪

ఇదికలలో శర్మతోపాటు పొగాకు వేసి లాభం తీద్దామని ఉల్లాసపడుతున్న ఒక స్నేహితుడు బస్తీనుంచి శర్మదగ్గరకొచ్చాడు. కొంతసేపు భూముల మరమ్మత్తువిషయం మాట్లాడి— "ఇదిగో ఇంపీరియల్ టుబాకో కంపెనీ వారి దగ్గరనుంచి నీ పేర వచ్చిన ఉత్తరం— ఒక యకరం దొరపొగాకుకి ఎంతో లాభమిస్తారుట. అవసరమైతే నేను బ్యారన్లు ఖర్చు భరిస్తా"నని స్నేహితుడు శర్మ చేతికి కవరిచ్చాడు.

శర్మ:- నిరాదరంగా చేతిలోకవరు అడ్డంగానూ నిలువుగానూ చించి "ఇంకా దొరపొగాకూ లేదూ — దొరసానిపొగాకూ లేదు — ఆ మాటెత్తక మనకు ఉపయోగించే పంటవిషయమై ఆలోచించు" అని ఊరుకున్నాడు. స్నేహితుడు తెల్లబోయాడు.

వాకిట్లోంచి కమతగాడితల్లి — మాణిక్యం —— "దొరసానిగారూ ! ఇవిగో బీరకాయలూ, వంకాయలూ, దిబ్బమీంచి కాసిన్ని బచ్చల దుబ్బులకూడా పీక్కొచ్చా ! లోపల పెట్టండమ్మా" అని కేకేసింది.

శర్మ:- వాటిని లోపలికి తీసుకొచ్చి ఇన్ని అలచందలు చేటలో తీసుకెళ్ళి మాణిక్యం ముందుపెట్టి "తంపశేసుకుని తినమన్నాడు."

మాణిక్యం:— "మా బుడ్డబాబుగారికి ఎంతో ప్రేమ, ఇంటికొస్తే ఒట్టి చేతులతో పోనియ్యరుగందా —ఇంకా ఏమీ అక్కరలేదు దొరగారూ నీకడుపున రెండు పిందెలు కాస్తే చూచుకుని సంతోసంగా చచ్చిపోతా"నని దీవించింది.

బస్తీనుంచి వచ్చిన స్నేహితుడు ఆపూట భోంచేసి "బచ్చలాకు పులుసు బలే రుచిగాయుంది. భూమి సారాన్ని బట్టికూడా యుంటుం"దన్నాడు. బచ్చలాకు పులుసు బాగుంటుందో పొగాకుపచ్చడి బాగుంటుందో చెప్పమని శర్మ వేళాకోళం చేశాడు. స్నేహితుడు "నన్ను పొగాకు మాటెత్తవద్దని నువ్వెందుకు మాట్లాడా"వన్నాడు. శర్మ క్షమాపణ కోరాడు.

శర్మ తన స్నేహితుణ్ని గొడ్లకోసం కొత్తగా వేసిన పెంకుటిపాకలు చూపించటానికి తీసుకెళ్ళాడు. నేలంతా రాయిపరపించి స్లోపుగా ఉంది.

కమతగాడు గొట్టంతో కారపునీళ్లు పట్టాడు. మంగలివైద్యుడు వచ్చాడు. గిత్త ప్రాణాలు విడిచింది. కమతగాళ్లిద్దరూ దానితోపాటు చెరి రెండు ప్రాణాలు వదులుకుని ఏడుస్తూ కూర్చున్నారు. శర్మవచ్చి వాళ్ళని ఓదార్చి తరువాయిపని చేయించాడు.

ఒకరోజు మధ్యాహ్నం— "చూడండీ! ఊళ్లోకి కంచి చీరలు అమ్మకానికి వచ్చినై. నాకు కొనిపెట్టరూ!" అంటూ శర్మభార్య శర్మను అడిగింది. శర్మ— "ఎంతలో యున్నై" అన్నాడు. "ఇరవై రూపాయలేనండీ" అని ఆ అమ్మాయి చెప్పింది. "నువ్వు ఏం చాకిరీ చేశావని ఆ ధాన్యం అమ్మకం దగ్గర్నుంచి 20 రూపాయలు కోరుతున్నావో చెప్పు"మన్నాడు. భార్య కాస్సేపు ఆలోచించి— "సరే, అయితే నన్నుకూడా సాయం పొలం పని చెయ్యమంటారా?" అంది. "నువ్వు తోటపని చేయవచ్చు. కమతగాడి కూతురుతోపాటు పాదులకు నీళ్ళుపెట్టి కులాసాగా తోట సమాయిషీ చేయవచ్చు. అప్పుడు ఈ వచ్చే సొమ్ము [illegible] వస్తుం"దని నవ్వాడు. భార్యకూడా బిగ్గరగా నవ్వుతూ— "ఓ అట్లాగే, నాకు మాత్రం తోటపని చేతగాదనుకున్నారేమిటి? ఇట్లా విప్పి చెప్పకుండా లోపల స్వయంపాకంగానుంచే నాకేం తెలుస్తుంది. అట్లా అయితే పూలమొక్కలుకూడా తెప్పించండి, మల్లెపూలుకూడా వేయిస్తా"నని కులాసాపడింది. రెండు ఒంగోలు ఆవులను కొని పెడితే పాలు, వెన్న, మీగడ మీ కిస్తాను. దానికి పుట్టే కోడెదూడల నాకివ్వండి" అంటూ గదిలోకి వెళ్ళింది.



# బలే పెండ్లాము

## ౧



సూర్యనారాయణరావుగారు గతించి నాలుగు సంవత్సరాలయింది. తండ్రి పోయాడనే విచారంతో నైతేనేమి హెడ్మాష్టరుగారు కక్షపెట్టి పరీక్షకు పంపలేదనే కోపంతో నైతేనేమి మరుసంవత్సరమే చదువుకు స్వస్తి చెప్పాడు ఆంజనేయులు.

సుబ్బాయమ్మ పువ్వులాంటిమనిషి. పోపిడి చెరిగినా ఓర్చుకోలేనిది. సాలుకు ఇన్ని చీరలని లెక్కాగాదు. వచ్చిన చీర అప్పుడప్పుడు తెప్పించుకునుగాని కట్టుకు సంతోషించాలిసిందే. కొత్తరకపు వంటకాలు ప్రతినిత్యం తయారు చేస్తుంది. మితిమీరిన పోకళ్ళకు సూర్యనారాయణగారు పెత్తిన నోరు పెట్టుకుని ఏడ్చి ఏడిచి చచ్చిపోయాడు. ముప్పది ఎనిమిదవఏట తనకీ దుస్థితి సంభవించినందుకు చాలా విలపించిందావిడ.

సంసారం చుక్కాని లేని పడవయ్యింది. గాలి ఎట్లా విసిరితే అట్లా నడుస్తోంది. అంజనేయులు అబ్బ లేని బిడ్డయినా రాజాకొడుకుగా పెరిగి పోయాడు. సుబ్బాయమ్మగారికి వైధవ్యంతోపాటు స్వతంత్రత కూడా కలిగింది.

రైతులు 20 పుట్ల ధాన్యం సాలీన తీసుకొచ్చి కొట్లు నింపుతారు. పెట్టె పైరులు కూడా వస్తె. మేడభాగమంతా తామే ఉంటున్నా క్రిందభాగాలకు రు 100-0-0 వస్తవి. తల్లీ కొడుకే. మూడో విస్తరిలేదు. భోగం తరగని పదవిగా ఉంది.

అంజనేయులు 15 ఏళ్ళకే చదువు మానేయటం తల్లికిష్టంలేదు. చెప్పినమాట వినేటట్టు కనపడట్లా. విసిగి ఎప్పుడైనా చదువూ సంధ్యా లేక పోతే ఎట్లారా అని తల్లి కంఠశోష పడితే కలకత్తా యూనివర్శిటీకి ప్రయివేటుగా చదువుతున్నానని సాకు చెపుతాడు. పొద్దున్నే భోంచేసి ఏదో ఇంగ్లీషు పుస్తకం పట్టుకుని ఊరిమీద వెళ్లటం, మళ్ళీ భోజనం వేళకు గానీ రావటం; యింతో అంతో ఆరగించటం, అమ్మ చేసిన ఫలహారాలు పుచ్చుకుని మళ్ళీ ఊరిమీదికి వెళ్ళటం సాగించాడు. క్రమంగా చెడు స్నేహాల్లోకి దిగాడు. మందలించేవాళ్లు లేక చుట్టలూ సిగరెట్లూలు మొదలైనై. పేకాటలో దిగి రాత్రిళ్ళు కూడా అప్పుడప్పుడు ఇంటికి రావటంకూడా ఎగేశాడు. ప్రతి సినిమాకు స్నేహితులతో హాజరై రోడ్లు కాయటం సాగించాడు. సంవత్సరన్నర గడిచింది. అమ్మతో పరీక్షకు రాత్రింబగళ్లు చదువుతున్నానని చెపుతున్నాడు.

౨

సుబ్బాయమ్మగారు కుర్రవాడు చదువుకొనేందుకు వెళ్ళటంచేత ఏమీ తోచక స్నేహితురాండ్రను పిలుచుకొని వైకుంఠపాళీ ఆడటం, నవలలు చదవటం, సంగీత సాహిత్యాలతో కాలం గడిపింది. తరువాత తరువాత బ్రహ్మసమాజానికి వెళ్లి రావటం సమాజకురాండ్రని ఇంటికి పిలుచుకొని విందుచేయడం రాచకీయాలు చర్చచేయటం, వీటిలో పడి తాను అగ్రస్థానాన్ని గడించానని భ్రమపడి కొడుకు విషయం చూట్టం మానేసింది. అందులో కొంత వేదాంత ప్రకర్ష కూడా పెరుగబెట్టి బ్రహ్మసమాజం బాగుందని ఆర్యసమాజం బాగులేదని యింకొకటియింకొకటని చదువు ప్రారం

భించింది. డబ్బు పుష్కలంగా చేతిలో ఆడి మగవాడి పెంపకంలో ఉన్న బిడ్డలాగా వృద్ధి పొందుతోంది.

అంజి, నీతి నియమాలకు దూరమై అ స్తమానం డబ్బుకు వేధించడం మొదలు పెట్టాడు, తల్లి ఈ ఖర్చేమిటిరా? అని నిష్కర్ష చేసింది. కొడుకు ఎదురు తిరిగి ఈ సమాజాలకూ వింటూనూ, నువ్వు చేసే ఖర్చుమాత్రం ఏమిటన్నాడు. తల్లి మొండం పెట్టి కిక్కురు మనకుండా డబ్బిస్తోంది.

అంజి తల్లియొక్క కీలకం కనిపెట్టి యథేచ్ఛగా డబ్బు గుంజి వ్యయం చేస్తున్నాడు. ఇద్దరూ ఖర్చుదారు లైనారు. తల్లి తన లోపాలచేత కొడుకుని కాదనలేక పోయింది. తక్కిన అర్థసంవత్సరం గడిచింది. ఒక రోజున అంజి జ్వరంతో పడుకుని గజ్జల్లో బిళ్ళలకు వేసిన పట్టీలు సర్దుకుంటున్నాడు. సుబ్బాయమ్మగారు చూస్తూనే హడిలిపోయి యింతవరకొచ్చావటోరీ! నాయనా! అని ఏడిచింది. క్రమేణా ఒకటి రెండు బయట పడినై. ఒకటిన్నరవంద రూపాయలు ఖర్చుచేసి చికిత్స చేయించింది. అంజి ఆ దెబ్బ తినడంతో నలిగిపోయి కుత్తుకుత్తు మంటున్నాడు.

అంజికి పెళ్లి సంబంధాలు రావటం మొదలు పెట్టినై. కట్నం కానుకలు తృప్తిగా లేక సుబ్బమ్మగారు సంబంధాలు తిరగకొట్టడం ప్రారంభించింది. చివరకు రాను రాను అబ్బాయి గుణగణాలు వ్యాప్తమయి సంబంధాలు వాటంతటవే రావటం మానేశాయి. "కోడలువస్తే తన ఆటలు సాగవని కొడుక్కి పెళ్లిచేయకుండా బ్రహ్మచారి ముద్దులాగా ఉంచదలచింది సుబ్బమ్మనటం" ప్రారంభించారు. ఆవిడకు మతిలేని దుఃఖం కలిగింది. ఎవరైనా సరే పిల్లనిస్తానని వస్తే చాలు. వివాహంచేసి బయటపడతానని దేముడికి మొక్కుతోంది.

## 3

అదూళ్ళోనే మిడిల్ స్కూలు మాస్టరు విశ్వపతి శాస్త్రి అనే ఆయనవున్నారు. ఆయనకు బిడ్డలు పోయిపోయి కమల అనే కూతురు నిలిచింది. విశ్వపతిశాస్త్రి కమలను తనదాంకొనుకుని కొడుకుకంటే ఎక్కువగా ప్రేమించి విద్యాబుద్ధులు నేర్పాడు. అమ్మాయికి 13 సం॥ వెళ్లి 14 సం॥ వచ్చింది. శాస్త్రి

బీదవాడవటంచేత అమ్మాయికి అంతకాలకు అనువైన సంబంధం కుదర్చలేక పోగాడు. ఇక ఆగటానికి వీలులేదనుకున్నాడు. భార్య కాళ్ళకింద మంటలు పెడుతోంది. తల్లి ఒకరోజున శాస్త్రిని పిలిచి "అబ్బాయీ, యింత వయసు కమల వివాహవిషయంలో తలపెట్టక ఊరుకున్నావే- నీ ఉద్దేశ మేమిటి? వివాహం కాకుండా రజోదర్శన మయిందంటే మన ఏడుతరాల పితరులు నీపేరుచెప్పుకుని ఘోరాంధకార నరకంలో పడిపోతారుసుమా" అని దండించింది. శాస్త్రి కళ్లనీళ్ళు తెచ్చుకుని తల్లికి సాష్టాంగ దండ ప్రణామాలాచరించి "తల్లీ! నాలుగురోజులలో కమలను ఎవడికో ఒకనికి కట్టిపెట్టి మన పితరుల యావన్మందిని ఎగరేసుకొని స్వర్గానికి పంపకపోతే నేశాస్త్రినిగానని ప్రతిజ్ఞ చేశాడు.

స్కూలుకు సెలవుపెట్టి సంబంధానికై ఊళ్ళమీదకు బయలుదేరాడు శాస్త్రి. ఆ మధ్యాహ్నమే ప్రక్కయింటి స్త్రీ సీతామహాలక్ష్మిగారు శాస్త్రిగారి భార్యతో మాట్లాడుతూ "సుబ్బయ్యమ్మగారు అందమైన పెద్దపిల్లగా దొరికితే కట్నకానుకలు లేకపోయినా సరే కొడుక్కు చేసుకునేందుకు సిద్ధంగా ఉంది. మీ అమ్మాయి నచ్చుతుందేమో మాట్లాడుతోందండి." శాస్త్రిభార్య మీరు మాట్లాడి పెడితే చాలా సంతోషిస్తాం, కావలిస్తే పిల్లనుకూడా తీసుకెళ్లి చూపమని— బ్రతిమాలుకుంది.

సుబ్బయ్యమ్మగారు కమలను కోడలుగా గ్రహించటానికి అనుమతిని సూచించింది. శాస్త్రి ఇతర సంప్రదింపు లేకుండానే మూడురోజులలో వివాహం నిశ్చయించటం చేయటం కూడా జరిగింది. శాస్త్రి తల్లి "నాయనా! మన పితరుల అనుగ్రహంతో యేపాటి కట్నం లేకుండా కమలకు ఎటువంటి సంబంధమొచ్చిందో!" అంది. కుటుంబమంతా సంతోషించారు. కమలం తండ్రిని "నాన్నగారూ! మీ అల్లుడు అనారోగ్యులులాగా ఉన్నారు, మీరు చూడలేదేమిటి?" అంది. శాస్త్రి చిన్నబుచ్చుకున్నాడు. నాయనమ్మ "ఎప్పుడూ జబ్బుగా ఉంటాడా? జబ్బులు వాళ్లు-మనకోసం మరచిపించుకుంటారా? అదే నయమవుతుం"దంది. ఆ నెలలోనే మంచి ముహూర్తాన కమలం రజస్వలకూడా అయింది.

అంజనేయులు కళ్లు నులుముకుంటూ దొడ్లో కొచ్చేటప్పటికి కమలమ్మ బల్ల మీద కూర్చుని ఉంది. అంజి చకితుడైపోయాడు. కమలం లేచి వినయంగా తలవంచుకుని కన్నీటిని చీరచెరగుతో అద్దుకుంది. అంజి ఏదేమిటన్నాడు— "ఇంతకాలానికి దర్శన మిచ్చిందని......" నిన్న మా అమ్మ చూసిందా? అన్నాడు. చూచాను. నే నొచ్చి ఒక గంట అయిందంది.

౫

నా కష్టపురోజులు వెనకపడ్డై, ఇక చూడండి నా పురోవృద్ధి ఉన్నట్టు ఒక్క సకిలింపు సకిలించి మీ వాళ్లతో పోట్లాడి రాలేనుగదా? అన్నాడు. నా యింటికి నేనొస్తుంటే మా వాళ్లెందుకు పోట్లాడాలి? అంది కమల. సరే—జాగ్రత్తతో ఉండు అని చెబుతూ దొడ్లోకి వెళ్లాడు అంజి. ఎప్పుడూ గట్టిగానైనా మాట్లాడలేని దాన్ని యింత సాహసంగా వొచ్చి భర్తా—అత్తగార్లకి తడుముకోకుండా ఎట్లా సమాధానం చెప్పగలిగానో అని ఆశ్చర్యపోయింది కమలం.

మా అమ్మ చెప్పినంతగా కమల కురూపిగాను, వెంకిగానూ తోచటంలేదే! అనుకున్నాడు అంజి. అబ్బాయి కుస్తీ విషయం తెలిసికూడా వాళ్లు కాన్యం కాని నిక్కాట్లా పంపారో నా కర్థం కావటంలేదే! సరే బచ్చా పుగదా యివాళ్యుండు. రేపు తీసుకువెళ్ళి దిగడుస్తానంది సుబ్బమ్మ.

అంజి ఆరోజు ఎక్కడలేని హుషారుతో ఏటికెళ్లి స్నానం చేసొచ్చాడు. తల్లి భోజనానికి లేవమంది. అమ్మా! పట్టుబట్ట ఏ పెట్టెలో ఉంది? అన్నాడు అంజి. కమలా! ఆ తోలుపెట్టెలో పట్టుబట్ట యిట్లా కట్టాయి అంది సుబ్బమ్మ. నిమిషంలో భోంచేసి గదిలో సామానులు ఇక్కడివి అక్కడ, అక్కడివి ఇక్కడ హడావిడిగా సర్దుతున్నాడు అంజి.

కమలా! నీకు కూడా విస్తరేసి పెడ్తున్నా, లేచి రావే! అంది అత్త. కమలం సిగ్గుదిగా ఆ కంచంలోనే భోంచేస్తా, విస్తరెందుకు వేస్తారు అత్తయ్యా! అంది. వాడంటే జబ్బుమనిషి. వీడన్నా ముట్టుకుంటే అంటే మీవాళ్లు నాగొంతు కోయి పిసకటానికా? అందులో వద్దులే, లేచిరా. అంది అత్త. సరే

పోనియ్యండి నిన్నటితో 5 ఉపవాసాలు, ఇవాళ్ళ 6 వ దవుతుంది. పోనీ లెండంది కమల.

అంజి గుమ్మంలో నుంచుని సిల్కుషర్టు తొడిగి క్రాఫింగు దిద్దుకుంటూ " నాకు జబ్బంటావేమిటే, యివాళ్ళ చాలా బలంగా వుంది. నిన్నటితో జబ్బు వదిలిపోయింది. నా కంచంలో భోంచేస్తా నంటుంటే అడ్డం చెబుతా వెందుకన్నాడు. సుబ్బమ్మ కొడుకుని ఊరిమిమూచి అప్పుడే వెనకేసుకు రావాలిటా) నాయనా! నన్ను తెలివి తక్కువదాని క్రింద కట్టేశావంది. " మనిషి నాకు పనికొచ్చి ఎంగిలి కాగటవుతుందా! అత్తగారూ! ఆ కంచంలో పెట్టండంది" కమల. సరే నాకెందుకొచ్చిందని ఏదో గొణిగింది సుబ్బమ్మ.

గదంతా శుభ్రంచేసి ఫోనుమీద శకుంతలానాటకం రికార్డులుపాడిస్తూ పడక కుర్చీలో కూర్చుని నవమన్మథుడిలా గాతోచుబడి అవుతున్నాడు అంజి. రికార్డు పాటయిపోయి ఊరికే తిరుగుతున్నదికూడా గమనించకుండా కూనరాగం తీస్తున్నాడు.

కమలమ్మ తన భర్తగారి కూనరాగాలు ఆలకిస్తూ భోజనానికి కూర్చున్నట్టే మరిచిపోయింది. ఒక కర్తమానికి ఫోను ఆగింది. కమలా లేచింది. ఇంతలో సుబ్బమ్మగారి స్నేహితురాలొకావిడ సంతోషవార్తతో తీసుకొచ్చి సుబ్బమ్మగారిని మేడమీది గదిలోకి తీసుకెళ్ళింది.

ఈ సందట్లో కమలమ్మ పక్కగదిలోకి దారి పట్టింది.

అంజనేయులు నాకుకు కూర్చున్నట్టు ఇంత వక్కపొడి కమలచేతిలో పోశాడు. దంపతు లిద్దరూ తాయమార్ర పోయారు. మెట్లమీని చప్పుడువిని కమల ఒక్కమూకున వంటయింట్లోకి పోయింది. ఆ రోజు గడిచింది.

మరునటిరోజు సాయంత్రం కమలా! పద మీ యింట్లో దింపివస్తానంది సుబ్బమ్మ. నిన్న నేగా వచ్చింది. వెళ్ళ బుద్ధికావటల్లే దంది కమల. మళ్ళీ రేపు పండుగకు తీసుకువస్తాలే పదమని నిష్కర్ష చేసింది అత్త. నాకు వెళ్లటానికి ఇష్టంలేదంది కోడలు. అయితే ఏమంటావంది అత్త.

"ఉంటానంటుంది గామున్న గోడక,—సరే ఉండనీ. దాని పని నే చెప్తకాలే

నవ్వాయతో వున్నాడు కొడుకు గదిలోంచి. సుబ్బమ్మగారు కోపంతో చరచరా క్రిందకు పోయింది. కమల బరబరా గదిలోకి పోయింది.

అదిగో యిదిగోనని నెల గడిచింది. జబ్బుపడి లేచిన మనిషికి మరబియ్యం పెట్టకూడదట చూచారా! ఈ పత్రికలో వుంది. ఇక దంపుడుబియ్యం తెప్పించమని అత్తతో మారాం చేసింది కమల. సుబ్బమ్మగారు "చాల్లే వడ్డకూడదు తినేజాతండి"- పోనీలేవే కొన్నిరోజులు అవీ తిని చూద్దా మన్నాడు అంజి. ఒకప్పూటయినా ఆవకాయి వెయ్యమంటాడు అంజి. కమల ఒకరోజు మధ్యాహ్నం అటకమీది జాడీలోంచి ఆవకాయితీస్తూ "అయ్యో అత్తయ్యా! జాడీలో ఎలికపిల్లపడి చచ్చిందండి బాబోయ్" అని అరిచింది. సుబ్బమ్మగారు గుండె బాదుకుంటూ మూతపెట్టటం మరిచిపోయానులాగుందే, నా తెలివి తగలబడా. సంవత్సరం గ్రాసం గోతిపాలయిందే, యింకేం చేతునే. జాడీ దించవే అని వచ్చిన పాడిబర్రెను ముందు పెట్టుకుని ఏడ్చి నట్లేడ్చి యీ సంవత్సరం ఎట్లా గడుస్తుందే ఎవరిని దేవిరించనే అని ఏడ్చి వాళ్లకీ వీళ్ళకీ పంజారం చేసింది. కమల లోపల సంతోషించింది.

ఒకరోజు నిమ్మ ఊరగాయబాన ఉత్తి పుణ్యానికి అలమరలోది అలమరలో ఎవరోచేచేతులా పగలగొట్టినట్టే విచ్చిపోయి ఊటంతా పలామ అయింది. సుబ్బమ్మ కొంపకేదో అనర్థకం పుట్టిందని ఏడ్చింది.

కమలం ఆంజనేయుల్ని పిచ్చి పత్రికల్ని ఆపేసి ఆరోగ్యాన్ని బోధించే పత్రిక తెప్పించమంది. రానురాను వంటలో కూడా జోక్యం కలుగ జేసుకుని అట్లా చేయండని ఇట్లా చేయండని అత్తగారికి అడ్డం తగలటం మొదలెట్టింది. రెండుపూట్లా ఏదో కూరవేసి పెట్టుతూ పచ్చళ్ళు చేయటం మానెయ్యండి. మీ కొడుక్కి జబ్బు నిశ్శేషంగా పోతుందని కమల నిక్కచ్చి చేసింది. ఆంజనేయులు కమలయొక్క నడతతో చాలా సంతోషించి కమల వచ్చి నప్పటినుంచీ తనకు కలిగిన ఆరోగ్యానికి ఆమెయందు విశ్వాసంతో వర్తించా లనుకున్నాడు.

ఒక రోజున సుబ్బమ్మగారు "కమలా! నావంటు మీకు పనికిరాక పోతే ఆ వంట పని మీయంటే వదులుకుంటున్నా. నువ్వే చేసుకున్నా సరే. నాకు కావలసినవి మాత్రం నాకు చేసిపెట్టమంది.

## ౬

కమలం అత్తింటి కొచ్చి సంవత్సర మైంది.

ఒకరాత్రి సాగర్ ఫిలింవారి 360 రోజుల సినిమాజూచి ఖుషాహాగా అంజనేయులు కమలం నడిచి వస్తున్నారు. కథానాయకుడు బాగా నటించాడంది కమల. ఏమో నాకు కథానాయికే బాగా అభినయించి నట్టుంది. మన కథలోలాగా అంటూ నవ్వాడు.

ఏమంటారూ! అంది కమల. ఆ! ఏమి లేదులే, నిజంగా ఆ డాక్టరుగారు జమీందారు ఆరోగ్యానికి ఎంతో తోడ్పడ్డాడు నువ్వు నాకు ఏర్పడినట్టుగా. మన కథకు ఆ కథలో ఛాయలున్నాయనుకో అన్నాడు అంజనేయులు.

ఆ! నేనుచేసిం దేముందండీ - నేనేం డాక్టరునా? "మనమిద్దరం ప్రకృతి మాతకు కృతజ్ఞులమై యుండాలి" అంది కమల. అనేగదా ఆ ప్రకృతి వైద్యులు చెప్పింది అన్నాడు అంజి.

వారు చెప్పారులెండి, చెప్పినట్టు నడుచుకున్న మీపై మనోబలాన్ని చెప్పకోరద్దూ అంది కమలం. అదికూడా నీ సమర్థతవల్లనే నాకు గలిగిందంటే నువ్వు విశ్వసించాలి అన్నాడు అంజి. చాల్లెండి గాని వచ్చిన కొండట్లో మీతో ఎట్లా నిగ్రహించగలనా అని భయపడ్డాను సుమండీ అంది కమలం. కాదూ మరీ నీ నిగ్రహమే నన్ను రక్షించిందనుకో - ఎట్లాగయినా చదువుకున్న దానివిగా, కమలా! సినిమా కథలో జమీందారు ఆ డాక్టరును సత్కరించి బహుమతి యిచ్చినట్టుగా నీకేం బహుమతిచేద్దామని ఆలోచిస్తున్నా నన్నాడు అంజి.

బహుమతి యిదివరకే చేశారుగా ఇంకేం చేయాలంది కమల సిగ్గుతో.

ఓహో అందుకనా! సంతోషంతో అన్నం తినటం మానేసి వాంతులు సాగించావ్ కమలా! అన్నాడు అంజి.

ఊరుకుందురూ ఎవరన్నా వింటారు. నాకోక శిశుపోషణ పుస్తకం తెచ్చి యివ్వరూ! ఈ సంవత్సరములో నేను మీకొక బహుమతి చేస్తాను. ఎవరిది విలువగలదో చూద్దామని కమల నవ్వింది. కూడా సమీపించింది.



# 12· ఆడతోడు



౧

ప్రజల పాదఘట్టములతో నలిగి చూర్ణమైన ఆ బాటలోని ధూళి లేచి

నాటి మధ్యాహ్నపు సుడిగాలి సూతగొని భూమ్యాకాశముల మధ్యకు లేచి అందరి నెత్తిమీదా రాలి కూర్చుంది. కళ్లల్లో దూరి కళ్లు తెరచి తేరిచూడ లేకుండా చేసింది.

ఏ మహాతల్లి తన ఏ మహాశక్తితో తన గర్భంలోంచి వేండ్రాన్ని కుమ్మరించి జంతుజాలాన్ని తహతహలాడించి స్తంభింపచేసిందో; ఆ తల్లే ఆ వేడిని పొద్దు తిరిగేవేళ్లకు తన లోనికి మింగుకొని చల్లని పిల్లవాయువుల్ని ప్రజల మీదను నడిపించింది. దేహాలు చల్లబడ్డాయి. అందరూ ఆ ప్రకృతిమాత దోసిలిలో సోలిపోయారు. వేగుచుక్క పొడిచింది. ఉషఃకాంత గగన వీధులలో రంగు రంగు ముగ్గులు పెట్టింది. తెల్లవారింది.

బ్రహ్మవధానులు ఊళ్ళోకి వచ్చేటప్పటికి కాకులు కూసినై. ఇల్లాళ్లు కసువులు చిమ్మి కళ్ళాపులు చల్లుతున్నారు. సుందరమ్మగారు బయటపని పూర్తి చేసుకుని దొడ్లో పనికి వెళ్ళింది.

అవధాన్లు “సుందరమ్మక్కా! సుందరమ్మక్కా!” అంటూ దొడ్లోకి వెళ్ళి మునగచెట్టుకింద వేసిన మంచంమీద కూర్చున్నాడు. “తలవటం తోనే తలగడప్రక్కనుంచున్నట్టు” అనుకుంటుండగానే వచ్చావు. ఇదిగో వాళ్లు కదులొక్కరా బుల్లాడా! మరదలూ పిల్లలూ కులాసాగా ఉన్నారా! మొన్న చంటివాడు ఒంట్లో బాలన్నారు. కులాసాగా ఉన్నాడా!” మొందలయిన ప్రశ్న పరంపరలు కురిపించింది సుందరమ్మ.

అవధానులు అన్నిటికీ సమాధానం చెప్పి “అక్కా! బావేడీ! ఊళ్లో ఉన్నాడా!” అని పశువుల పాకవేపుకు చూచాడు. “ఏదో వ్యవహారం మాటుగట్టుకు వచ్చావులాగుందే” నాకు చెప్పవూ! అంది అక్క. “నీకు చెప్పకపోతే ఎట్లాగు గానీ ముందు బావేడీ” అన్నాడు అవధాన్లు.

ఈమధ్య మేము పాడికి బహు ఇబ్బందిపడ్డాంలే! ఎరుగుదువుగా మా బావ పనులు. ఊళ్లో తూరుపువాడిదగ్గర గేద ఉంటే దాన్ని వదలుకుని పాలెంలో కమ్మాయనదగ్గర గేద ఉంది. అది పాలవృష్టి కురిపిస్తుందని సలహా సంప్రదింపులేకుండ 80 రూపాయిలకు కొనుక్కొనివచ్చారు. ఆ బర్రె వచ్చినపూట ఏం పాలిచ్చిందో అంతే. మరుపూట తన్ని ఎగచేపింది. బాబూ! ఈబర్రెతో నా కక్కరలేదు. తిరిగి తోలివెడతా నంటూరీయన. ఏంతోలి కొన్నా అంతే యింకా తిరిగి తీసుకోనంటాడు ఆ కమ్మాయన. దాని విషయంలో

పంచాయితీ చేయిస్తానని వెళ్లాడు. "ఎరుగుదువుగా చేసి పస్తాయిస్తూ ఉంటారు. మీబావ" అంది సుందరమ్మ. సరే బాగానే ఉందిగాని ప్రస్తుత విషయమేమిటంటే శివుడికి సంబంధాలు వస్తున్నై. బుధవారం నాడు ఒక పోలీసు ఇన్స్పెక్టరు తన పిల్లను వచ్చి చూచిపొమ్మని వర్తమానం చేశాడు. ఇంకా ఏవో రెండు మూడు సంబంధాలు తిరిగిపోతున్నారు. ఒత్తిడికూడా చేస్తున్నారు. మీకు చెప్పకుండా అక్కడ ఏమీ అనటానికి సావకాశం లేదుకదా? ఆశ్వయుజంలో తప్ప తరువాత లగ్నాలు లేవు గదా! మీ మరదలు కూడా ఏదో సెటిల్ చేయండి అంటోంది. బావ ఉంటాడేమో అన్నీ మాట్లాడుకు పోదామని వచ్చా. మీరూ పిల్లని అడగటానికి వీలు లేదుగదా! ఆయన రావటంతో మీరు సంప్రదించుకుని ఆయన్ని అక్కడకు పంపించు. నేను వెళ్ళివస్తా. అగ్రహారములో ఇంకోక పనికూడా ఉంది, అని అవధాన్లు లేచాడు.

"ఏమిటోరా నాయినా ఒక కాలు బయటా మరొక కాలు ఇంట్లో, ఉండగానే ప్రయాణం ప్రయాణం అంటావు. అగ్రహారంతో నీకెప్పుడు పని లేకుండా ఉంది. బారెడు దూరములో ఊరికి పోలేక పోవులే. బావరాక! మాట్లాడే పోదుగాని. అయితే శివుడు ఈ సంవత్సరం ప్యాసయినాడా?"

అవ — ఒట్టి ప్యాసు కాదు. ఫస్టుక్లాసు ప్యాసయినాడు. లెక్కలు శాస్త్రం మీదే ఫస్టు మార్కు వచ్చిందట.

సుందరమ్మ — పైచదువు గుంటూరులో చదివిస్తారా?

అవ — మనయిష్ట మేముందే – వాడు ఏం చదువుకున్నా చెప్పించవలసిందే. మొన్న కొత్తగా వచ్చిన మా మరదల్లుడూ మనవాడు కలిసి బి. ఏ. పట్నంలో చదువుకుందామని అనుకున్నారట. ఏదో వాళ్లిష్టం. మన మల్లా డబ్బువాళ్ళ మేగదా! పైన వాళ్ళయిష్టం.

సుంద — అయితే శివుడి మీద నీ అదుపు లేదా ఏమిటిరా! మొన్న రాజ్యం పెళ్ళిలో ఆ ఆటకాయతన మేమిటి! అసలే మా ధర్మవరము ఒకళ్ళ చేత మాటపడేది కాదు తనలో ఇంతయినా తప్పు ఉంచుకోదు. ఎంత మేనత్త కూతురైనా ఆషామాషీకి హద్దుండాలి. ఎప్పుడో పెళ్ళా వుతుందని యిప్పటినుంచీ మగడితనం చూపాలా? పెళ్ళినుంచి వచ్చిన తరువాత నాల్గురోజులు అన్నం సరిగ్గా తినలా. మాట్లాడితే పెళ్ళికి

నన్నెందుకు పంపారంటుంది. శివుడూ చిన్నవాడే అనుకో! తను నలుగురిలో దాన్ని వానపాముని - తారఅనీ - వెంగుడితో కాపరం చేసేట్టు కనబడదనీ - తానే అంటే నలుగురికీ - నవ్వుకాదూ నువ్వే చెప్పు:

అవ—ఇది నీదాకా వచ్చిందీ? నలుగురు పిల్లకాయలు చేరినప్పుడు ఇట్లాగే అల్లరిగా ఉంటారు. అందులో పెళ్ళివాడా విడి. పెళ్ళికొడుకు వాళ్ళమీదనే పోట్లాడుతుంటే నేనే సర్ది చూడ లేకానుకూడా!

అంటూఉండగా భ్రమరం గదిలోనుంచి డేగ పిట్టలాగా రయ్యిన వచ్చి అవధాన్లు పక్కగా నిలబడి కోరచూపు జూచింది.

“అదిగో మేనకోడలు పిల్ల” అని చెప్పి అన్నాయ్! “మామయ్యని చూచావుటే” అంది సుందరమ్మ - భ్రమరం మామమీది చూపు మెరపమడి మీదికి త్రిప్పి చూడకేం చూస్తూనే ఉన్నా. అంటూ ముఖం కడుక్కోటెందుకు నూతిమీదికి వెళ్ళి కూర్చుంది. తల్లి తాటాకు నీళ్లు ఇచ్చి వచ్చింది. అవధాన్లు లేస్తూ “ప్రొద్దున్నే అభ్యంతరం పెట్టకే అక్కా!” రేపు తప్పక బాబును పంపించు. వస్తే యిద్దరం కలిసి మళ్లీ వస్తాంలే అంటూ బయలు దేరాడు.



బ్రహ్మవధాన్లు మధ్యాహ్నంపూట వెంకటేశం ఇంటికివెళ్లి “నాయనా! వెంకటేశం! మన శివుడు నాయెదుట మాట్లాడటానికి భయపడతాడు. కాని ఇంతకంటె మంచి సంబంధం రాదు-అక్కడే మగపిల్లలూ లేరు. మంచి సుక్షేత్రమైన పొలం. ఆ పిల్లవాటా 4 ఎకరాలు వస్తా. దగ్గరలో పని. బంధుత్వంలో బంధుత్వం. ఆపిల్లని అంత ఆస్తితో మంచి స్థితిమంతులే చేసుకుంటారు. అది మనవాడి కవటం అదృష్ట మన్నమాటే. ఆ పిల్ల తను కోరినట్లు లేదంటాడు. ఏమన్నా కాళావికృతమా? అంగవైకల్య మేమన్నా ఉందా? నల్లగా ఉంటే యింకా పనికిరానిదేనా? వయస్సు వచ్చినకొద్దీ అదే అందంగా ఉంటుంది. నువ్వు నిజంగా వాడి స్నేహితుడవైతే తప్పక ఈసంబంధం చేయించగలుగుతావు. చేయకపోతే వాడి స్నేహితుడవే కావని నిష్ఠూరాలాడాడు. వెంకటేశం తన శక్తివంచన లేకుండా ప్రయత్నం చేస్తానన్నాడు.

## 3

మండువాలో రామయ్యగారూ సుందరమ్మగారూ కూర్చుని సంబంధ విషయం సంప్రతించుకుంటున్నారు. భ్రమరాంబ మంచంమీద పాటల పుస్తకం తెరచి పాటలు చదువుతున్నట్టు కూర్చుంది. క్రమంగా పిల్లముఖం ఎర్రబారుతోంది. సుందరమ్మగారు చివరకు "దానికేంలెండి మన కయిన సంబంధం - గుమ్మంలోకి వచ్చిన సంబంధం - చేతికీ నోటికీ అంటు లేని వాళ్లు. కట్న కానుకల్లో ఇబ్బంది పెట్టేవారు కూడా కారు. అయినా పాలం బట్రా ఆడపిల్లలదే నని వారికి మాత్రం తెలియకుండా ఉంది కనుకనా!" అంది.

"కాదుమరీ? ఎంతకట్నం ఇస్తే మాత్రం అయిన సంబంధం వంటి దవు తుందా? కుర్రవాడు బుద్ధిమంతుడూ - తెలివైనవాడు...అంటూ ఉండగా భ్రమరం, భ్రమరం మాదిరిగా చంగునలేచి "అదే మీకు తెలియంది" అంటూ మంచందిగింది. రామయ్య "ఏమిటే తల్లీ! తెలియక పోవటమేమిటే పిచ్చితల్లీ!" అంటూ బిక్కరుమని చూచాడు. భ్రమరం "తల్లీ లేదు! పిల్లీ లేదు! అంటూ నూతిదగ్గరకు వెళ్లి తొట్టెడు నీళ్ళలో కాళ్లుముంచుకు గట్టు మీద కూర్చుంది.

సుందరమ్మ "ఏదో చిన్నతోరివి - వాడూ చిన్నతోరివాడేగా! మొన్న పెళ్ళిలో దీని నేదో అన్నాట్ట. పెద్దపిల్ల వాజమ్మగాని, దీనది వెఱ్ఱి పౌరుషం. మాటవస్తే నరుక్కుని చావాలిసిందే.

రామయ్య—వా డెవడూ?

సుంద—ఇంకెవడూ! కాబోయే అల్లుడు శివుడు గాడే!

రామయ్య—ఏమన్నాట్టా?

సుంద—వాడిముఖం "ఎవరో అదిగో నీ పెళ్ళామంటే మేనత్త కూతురు కాబట్టి చనువుగా, "ఛీ! దీనిని చేసుకోను, నల్లగా ఎలికగొడ్డిలాగా ఉంది. అంతగా బలవంతంగా కట్టారంటే కృష్ణవొడ్డున పాక వేసి అందులో ఉంచుతా, అంతే ఈ నల్లదాని ఖర్మం" అన్నాట్ట. ఇక చూచుకోండి! మీ కూతురు పరితాపం. పెళ్ళికూతురు దగ్గరనుంచి బ్రతిమాలించుకుని ఆనాల్గు రోజులూ ఉండేటప్పటికి వాళ్ళ పెద్దలు దిగివచ్చారట.

రాము—అయితే వాడంత ఎఱ్ఱిగా పుఱ్ఱిగా ఉన్నాడని గర్వమా? ఎక్కిరించటానికి. నా పిల్లకు సంబంధం రానప్పుడు చూస్తానులే.

సుంద:— ఏమిటీ వాడికంటే చిన్నవాడవుతున్నారు. కాబోయే పెళ్లాం గదా అని సరాగం మాట్లాడాడేమో! అందరి పిల్లల్నీ అనబోయాడా? ఆ మాటలూ నాకు ముచ్చటగానే ఉన్నై.

రాము:— సరే! వాటికేంగాని, రేపు పొద్దున మేనల్లుడు సత్యనారాయణను తీసుకువెళ్లి తథాస్తూ అని తాంబూలాలు పుచ్చుకొని వస్తాం. మాండెప్పుడో పిల్లకు ఇచ్చుకునేదీ పెట్టుకునేదీ యిప్పుడు చెప్పటమెందుకూ? కట్నం వెయ్యినూటపదహార్లూ, 2 వందలు లాంఛనాలూ, 5 రోజులూ పెళ్లి అని స్థిరం చేసుకొని వస్తాం.

సుంద:—అంతే యింకేమీ మాట్లాడకండి— అన్నీ మేనల్లుడు నారాయణకు తెలుసుగా. తరువాత అన్నీ సంప్రదించుకుందాం అని సంప్రదింపు ముగించారు.

౪

విందుభోజనాలయినై. తాంబూలాలు పుచ్చుకునే సమయానికి నలుగురు పెద్దల్ని పోగుచేశాడు బ్రహ్మన్నశాస్త్రి. మేనమామా మేనల్లుడు అరుగు మీద ఏదో మాట్లాడుకుంటున్నారు.

లోపల శివుడు తల్లితో తగవు పెట్టుకొని "నా కీపెళ్లి వద్దంటుంటే చేస్తున్నారుగాదూ జరగాలిసిందేదో జరుగుతుందిలే" అంటున్నాడు. సత్యనారాయణ చివాలున లోపలికి వెళ్ళి చనవుగా "శాంతం పిన్నీ! ఏమిటీ శివుడి గడబిడ! కట్నం చాలదంటున్నాడా ఏమిటి? నాతో చెప్పడూ నే తీరుస్తాగా" అన్నాడు. శివుడు విసపు బిగ్గతో "మీకు ఆ పిల్ల సుఖంగా కాపురం చెయ్యాలని ఉంటే ఈ పెళ్లి మానుకోండి — యింతకంటే ఉపన్యాసం అనవసరమని" తలుపు చాటుకు వెళ్లాడు. "ఇట్లా అంటా వేమిటి? పిన్నీ! అని" తెల్లబోయినాడు సత్యనారాయణ.

"సుఖం లేదన్నాయ్ — ఊహా వచ్చి రాని ఏడ్పు, బి. ఏ పాసయి పెళ్లి చేసుకుంటానంటాడు. అంతటివీ అపూర్వమైన సంబంధాలు కూర్చుంటాయా?

తన పెత్తండ్రి కొడుకు అత్యుణంగా పెళ్లిచేసుకుని బి. ఏ. ప్యాసయి నూరు నూటపాతిక తెచ్చుకోటల్లా! వాడి మొఖం లెద్దూ! ఎద్దునడిగి బండి కడతావూ ఏమిటి? చిన్న సన్యాసి లెద్దూ!" అంది. "ఔను ఎద్దునడిగి ఎందుకు కడతావు బండిని! తల్లక్రిందుగా బోల్తాకొట్టిస్తే లభోయి లెత్తుతావు గానీ!" అంటూ శివుడు దొడ్లోకి దూకాడు.

సత్యనారాయణ తప్పుడు దోవలో పడ్డాడు. "పిన్నీ - మనవాడు పెళ్లి ఎప్పుడు చెయ్యమంటే అప్పుడే చేద్దాం. కట్నంవిషయంలో గూడా వాడు గునవక్కరలేదు. ఇంకా ఏమన్నా ఉంటేకూడా చెప్పమన్నాడు.

శాంతమ్మగారు నవ్వుకుంటూ "మరేంలేదు గానీ కట్నమే 15 వంద అనిపించు. లాంఛనాలూ, వప్పగింతలూ, వేరవేరనే సుమా! అట్లా చేయించు" వాడికి గుణుపు లేకుండా పోతుంది నారాయణా! అంది.

రామయ్యగారు మేనల్లుడిని పిలిచి-"ఏరా! నారాయణా! మరదినాడు అట్లా అంటుంటే మన మేమీ తొందర పడటల్లేదుగదా! అన్నాడు. నారాయణ "ఏమిటి మామా! అట్లా ఇదవుతావేం మేమంతా లేమూ! కట్నం లాంఛనాలు కాకుండా 15 వంద అనేద్దాం. ఇక గొడవ లేకుండా పోతుంది. అని మేనమామని వప్పించాడు. పెద్దలు తథాస్తు అని లగ్ననిశ్చయంచేశారు.

౨౮

శివుడు లగ్నం తప్పించి పారిపోతానని పెంకతనంతో చెప్పాడు. ఆ విశేషం నెమ్మదిగా అవధానులుగారి చెవిసోకా డీసంగతి. అవధాన్లు గారా మండలాన లేచి శివుడిని కూర్చోపెట్టి "నేను సంపాదించిన ఆస్తి నీకు రానియ్యననీ- చదువుకు నెందుకు డబ్బు పంపననీ ఏమైనా సరే లేచిపోయి- బ్రతకాలిసిందేననీ - నాలుగు ఎకరాలతో వచ్చేపిల్లని చేస్తుంటే నీకు తీపరం వచ్చిందనీ - నీ బ్రతుకు కుక్కలుగూడా పడవనీ యింకేమేమో బెదరించాడు" తల్లికూడా బెదరించేట్టు చేశాడు. ప్రతిమాటలోనూ 4 ఎకరాలను చూపిస్తాడు.

పైన తెల్లనుసి కప్పుకొని లోపల కణకణలాడే చింతనిప్పు కణంలాగా ముఖం వెలవెలబోతూ కూర్చున్నాడు శివుడు. "ఇదిగో ఈడబ్బుతో చక్కటి

చొక్కాలూ, ధోవతులూ, కోట్లూ కొనుక్కోమని 10 అయిదురూపాయిల నోట్లూ అవధాన్లు శివుడు ముందుకు విసిరాడు. శివుడు లేచివెళ్లి స్టాండర్డు బట్టల దుకాణంలో 4 చొక్కాలు 2 ధోవతులూ, 2 కుళ్లు, కొనుక్కొని తెచ్చి తండ్రిముందు పెట్టాడు. తండ్రి సంతోషించాడు.

౬

భ్రమరాన్ని పెళ్లికూతుర్ని చేశారు. బొట్టుపెట్టుకుందామని అద్దంమీద పెట్టుకున్న వెండి కుంకుమభరిణిని పొరపాటున క్రింద పడతోసుకుని, ఒలికి పోయినకుంకాన్ని గుట్టు చప్పుడు కాకుండా భరణిలో నింపుకుంటుంది భ్రమరం.

—“ఏడుస్తూ ఏరువాక సాగితే కాడిమోకులు దొంగలు దోచేశారట”. అంటూ కొడుకుని కోపపడుతూ రమణయ్య బజారులోకి వచ్చాడు.

పెళ్ళి జనంతోనూ, మేళతాళాలతోనూ ఊరు శోభాయమానంగా ఉంది. లగ్నం వేళ అందరూ చేరారు. తెరపెళ్లాతీసి కుర్రవశిష్ఠు “శివయ్యా! అమ్మాయి ముఖం ఒకసారి చూడు” అన్నాడు. శివుడు చిరునవ్వుతో “ముఖం చూడటంకేంగా! ఒకసారేం పదిసార్లు చూస్తా, త్వరగా నీహడావిడి కూడా ముగించు” అన్నాడు. ఆమాటలు వింటున్న భ్రమరం నిస్తరంగ మహోదధి లాగా శ్వాసలు బిగబట్టుకు దేహంమరచి ఒకక్షణం కూర్చుంది. పెళ్ళికళ ఫెళ ఫెళలాడిపోతోంది. ఊరేగింపుకు పల్లకీ ఎత్తారు. పెండ్లి కూతురూ పెండ్లికొడుకూ ఉదయాద్రి పశ్చిమాద్రులు లాగా కూర్చున్నారు. చిన్నపడుచులు పెళ్లికూతుర్ని ఎకసక్కాలు ప్రారంభించారు. ఊరేగింపై వచ్చారు. పిల్లలు తలుపుదగ్గర పాటలు పాడారు. ముత్తయిదువలు పేర్లు చెప్పాలండని హాస్యోక్తులు ప్రారంభించాలనుకుంటున్నారు. శివుడు గబుక్కునలేచి బిగ్గరగా “భ్రమరాంబా సమేతవచ్చాము. ఇక లోపలికి పోనియ్యండన్నాను. భ్రమరాంబకూడా మెల్లిగాలేచి శివుడుగారూ సమేతవచ్చాం పోనియ్యండని” వసంతకోకిల లాగా స్థాయి పెంచి పేర్లు చెప్పింది, ఆ తగూ కొందరికి అర్థమై మొహం మొత్తింది. పేర్లు కొసరి చెప్పించాలనుకున్న వాళ్ళకు నిరుత్సాహం కలిగింది. కొందరు మళ్లీ చెప్ప

మన్నారు. ఎన్నిసార్లు చెప్పుకున్నా ఈ పేర్లేగా! మళ్లీ రేపు చెప్పుకుంటూ లెండి అంటూ శివుడు కదిలాడు. భ్రమరంకూడా కదిలింది.

భ్రమరానికి అత్తవారు అందమైన రాళ్ళ నగిషీ నాగరత్నా, రాళ్ళ చేమంచి పువ్వూ, చంద్రహారం పెట్టారు.

సదస్యంరోజుకు శివుడి స్నేహితు లిద్దరు వారికి ఆహ్వానం లేకపోయినా గుంటూరునుంచి వచ్చి పిలవకపోయినా నీ పెళ్ళికి వచ్చాం చూచావా! అని సరసాలాడి శివుడికి ఒక పార్కర్ కలం, ఒక వెండి పూలబుట్ట భ్రమరానికీ బహుమతి చేశారు. ఇట్టి పెళ్లికి ఎట్లా ఆహ్వానించాలో తెలియక పోయినందుకు క్షమించమని స్నేహితుల్ని కోరాడు.

— “ పిల్ల అనాకారి అన్నావే! నీకు దృష్టి మాంద్యం వచ్చినట్టు ఇప్పుడు తెలుస్తోందని యింకో స్నేహితుడన్నాడు.

౨

శివుడు బి. ఏ. లో చేరాడు. మామగారు పెళ్లి దీపావళికి రమ్మని బ్రతి మాలగా, తండ్రి ఎంతో కసరగా శివుడు ఆ పక్క రోజూ అత్తగారింట్లో ఉన్నాడు. సుందరమ్మ చనువుతో ఎన్ని మాటలన్నా వాటి కన్నిటికీ సమా ధానంగా “మీరు చెయ్యాలిసింది చేశారుగా” అన్నాడు. తెల్లవారి పొద్దున్నే చెప్పకుండానే గుంటూరుకి వెళ్ళాడు. పరీక్షలు కావటంతో ఇంటికి వచ్చాడు. మళ్లీ రామయ్యగారు వెళ్ళి మా యింట్లో నాల్గురోజులు ఉండి పొమ్మని కోరాడు. అల్లుడు అదిగో యిదిగో నని శెలవలు కాస్తా అయిపోవటంతో సరాసరి గుంటూరు వెళ్ళి నాల్గో సంవత్సరంలో చేరాడు. ఒకరోజు భోజనాలయిన తరువాత భర్తతో ఆ ఖబుర్లూ ఈ ఖబుర్లూ చెపుతూ కాంతమ్మగారు, “మీ వియ్యపురాలు 5వ నెల గర్భిణీట; మీ కొడుకు పాదం వృద్ధిగల పాదమే” అని ఊరుకుంది. “వియ్యపురాలా! సుందరమ్మనా! ఎవరు చెప్పారూ” అంటూ అవధాన్లు ఉలిక్కిపడి లేచాడు. “నిన్న ఆ డాక్టరుకు చూపించారుట. అవిడ కడుపేనని చెప్పా డటకూడా” అంది కాంతమ్మ. “మంచిదేగా” అంటూ వెల్లకిలలుగా పడు కున్నాడు అవధాన్లు.

నెలలు క్షణంలో గడచినై, తనకు బాలుడు కలిగాడని 10 వ రోజు భారసాలకు తప్పక రావలసిందని శివుడికి ఇంగ్లీషు పరీక్షనాడే శుభలేఖ వచ్చింది. శివుడు చాల సంతోషించి స్నేహితులందరికీ ఈ వర్తమానం వినిపించాడు.

అవధాన్లు ఏదో పనిమీద గుంటూరువస్తే "ఏమయ్యా 4 ఎకరాలు వస్తుంది; 4 ఎకరాలు వస్తుంది అన్నావ్, అంతా నీచేతుల్లోనే ఉన్నట్టు మాట్లాడావు ఏదీ ఎక్కడనుంచి తెస్తావో తీసుకురా! అని అవహేళన చేశాడు శివుడు. అవధాన్లు చిందులేస్తూ "మొదటనుంచీ ఒకటే ఏడుపు; నీ ఏడుపే నీకు కొట్టిందిలే పో; దురదృష్టపు ముండాకొడకా – అని" లేచిపోయాడు.

౮

శివుడు గుంటూరులో ఉండగానే వర్జ్యదోషమున్నా నుంచి నక్షత్రము లో భ్రమరాంబ రజస్వలయింది గనుక వెంటనే వచ్చి శాంతి చేయించు పొమ్మని మామగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. శివుడు ఆ ఉత్తరం చూస్తూనే కార్డును రెండుగా చించి లాంతరుకు అంటించి కాల్చాడు.

పదిరోజులుగడచిన తరువాత శివుడు ఇంటికి వచ్చాడు. తండ్రీ కొడుకులు ఎడముఖం పెడముఖంగా ఉన్నారు. తల్లి మాత్రం "ఏరా! శివుడూ! ఈ నెలలోపల ఆ శాంతి ముక్కూడా తీర్చుకోద్దాం. ఏమంటావ్" అని అడిగింది. "శాంతి లేదు వాంతి లేదు. ఆ ప్రస్తావన యిక ఎత్తావంటే నే వెళ్ళిపోతా" నన్నాడు శివుడు. "శాంతి చేసుకోకపోతే నలుగురూ ఉమ్మేస్తా" రన్నాడు అవధాన్లు. వెంటనే వచ్చి శాంతిచేసుకు వెళ్ళమంటున్నాడు వియ్యంకుడు. శివుడికి ఒత్తిడి ఎక్కువగుతోంది. ఇట్లా లాభంలేదని తెల్లవారకట్ట ఎవరికీ చెప్పకుండా కాళహస్తిలో ఉద్యోగంలో ఉన్న పెద బావగారి యింటికి వెళ్ళి అక్కగారితో ఈ గొడవేమీ చెప్పకుండా నెలరోజులున్నాడు,

బి. ఏ. వాళ్ల పరీక్షలు తెలిసినై. శివుడు ఫస్టుక్లాసులో ప్యాసయినాడు. శివుడికి రోజువిడిచి రోజూ జ్వరం వస్తోంది. చాలా నీరసించాడు. రజస్వలా దోషానికి వెంటనే శాంతి చేసుకోనక పోయినందుకు ఇట్లా ముంచిగిందని

అవధాన్లు గ్రహజపాలు చేయించాడు, జపాల సమారాధనకు శివుడి మామ గారు కుటుంబముతో సహా వచ్చాడు.

శివుడికి కొంచెం కులాసాగానే ఉంది. శాంతి చేసుకోవలసినదని మామ గారు వచ్చిన బంధువు లందరితోనూ చెప్పించాడు. శివుడు సమాధాన మియ్యలా. అత్తకు అంతులేని ఆగ్రహం వచ్చింది. అందరూ భోజనాలు చేస్తూఉండగా వచ్చి "ఏమర్రా! మేమూ సాయంకాలం బండికి యింటికి వెళతాం. శాంతి చేసుకోకుండా వాయిదాలు వేయటంలో మీ కథ మా కర్థం కావటల్లా, తేల్చి చెప్పండి, మేము సిద్ధంగా ఉంటా"మని సుందరమ్మగారు గట్టిగా అడిగింది. వెంటనే శివుడు అందుకుని "మా కథలూ గీథలూ మీ కనవసరం. మా యిష్టం వచ్చి నప్పుడు శాంతిచేసుకుని తెచ్చుకుంటే తెచ్చుకుంటాం, మానుకుంటే మానుకుంటాం. మళ్ళీ ఆ విషయం గురించి ప్రస్తావన లేకుండా ఉంటే అందరికీ మర్యాద" అన్నాడు. "అయితే మానుకోవటు మేమిటి......" అని సుందరమ్మ అంటూఉండగా కాంతమ్మగారు అడ్డువచ్చి "వాడితో నేనా ఏమిటి? నాన్న మాట్లాడాలిసింది: నలుగురూ నవ్విపోతారు; చాల్లే యిక ఊరుకో" అంది. "నవ్వుతూనే ఉన్నారు; ఎవరిచేష్టలు వారికి బాగానే ఉంటై" అంటూ సుందరమ్మ వెళ్ళిపోయింది. "అత్తా అల్లుడికి చిటపటలు ప్రారంభించినై" అంటూ వారూ వీరూ చెవులు కొరుక్కోటం ప్రారంభించారు. శివుడికి ఫస్టుక్లాస్ మార్కులు రావడంచేత అడిగిన కాలేజీలో అల్లా సీటువచ్చింది. యం. ఏ. చదువుదామా – డాక్టరు చదువుదామా అని ఆలోచనలో ఉన్నాడు. తన జబ్బు నయంచేసిన వైద్యుడు 5, 6 మాసాలు విశ్రాంతి తీసుకోమ్మని సలహా యిచ్చాడు. "నేను ఇక డబ్బు పెట్టలేను. ఏ రైల్వే యిలాకానో ఉద్యోగం చేసుకుని నీ బ్రతుకేదో నువ్వేడు; లేకపోతే మీ అత్తగారినైనా యెవరినైనా ఆశ్రయించి చదువుకో" అని అవధాన్లు సన్నాయి పన్నం ప్రారంభించాడు. "ఇప్పుడైనా అత్తగారిని మంచిచేసుకోకుండా ఎవరిచంక నాకుతాడో చూస్తామని" నారాయణ అన్నాట్ట. అది విని శివుడు చాలా మనోవేదనను పొందాడు.

"అందరి చంకలూ నాకటానికి నాకేం ప్రారబ్ధంపట్టలా? నా బ్రతుకు నే బ్రతికి నా జీవితాన్ని నే గడుపుకోవటానికి ఏదో ఒక డిగ్రీ ఏడిచిందిలే;

అత్తవారి ఆశ్రయింపులో ఉండాలని ఈ సంబంధం చేశారా? నాకూ స్వయంగా నిర్ణయించుకునే శక్తి ఉంది” అని తల్లిమీదా తండ్రిమీదా లేచాడు శివుడు.

డబ్బు లేకపోతేనేం, డాక్టరు సలహాతో నైతేనేం, ఆ సంవత్సరం మీన మాసాలు యిక్కడా అక్కగారి యింటికాడా గడిపాడేగాని మామ గారింటిని తొంగైనా చూడలా. రామయ్యగారు శివుణ్ణి కలుసుకుని “నీ చదువుకు ఎంతడబ్బు కావాలో చెప్పమన్నాడు. శివుడు వికటంగా నవ్వి, “అయ్యా! యింతకాలకు మీరు చాలా నష్టపడ్డారు. ఇంకా ఎందుకు బాంధవ్య పడతారు. మీ పిల్లా నాకక్కరలేదు, మీ డబ్బూ అంతకంటే అక్కర లేదు. ఇక దయచేయండన్నాడు.” రామయ్య యింటికి వెళ్ళి భార్యతో ఈ సంగతి చెప్పాడు. సుందరమ్మ దుఃఖపడుతోంది. భ్రమరాంబ కత్తులు సానపట్టేవాడిని పిలుచుకునివచ్చి “అమ్మా! కత్తిపీట సానపట్టించవే. బండగా ఉంది. సానపట్టేవాడిని తీసుకువచ్చా” నంది. సుందరమ్మ లేచి వెళ్ళింది.



శివుడికి యూనివర్సిటీ ఫస్టుమార్కు రావటంచేత స్కూలుఫైనలు మాస్టరు ట్రెయినింగుకు సీటూ వచ్చింది. ప్రయివేటు స్కాలరుషిప్ కూడా యిప్పిస్తా. వచ్చి చదువుతే నని ప్రిన్సిపాలు కూడా వాగ్దానం చేశాడు. తల్లితో మాత్రం చెప్పి శివుడు రాజమండ్రి వెళ్ళి కాలేజిలో చేరాడు. డిబేటులలో మంచివక్త అనిపించుకున్నాడు. డి. యి. ఓ. అల్లుడితో మంచి స్నేహం కుదిరింది. చదరంగంలో మంచిఆట ఆడవటంచేత క్లబ్‌లో పెద్ద ఉద్యోగులతో పరిచయం కలిగింది.

శివుడు పరీక్షల్లో పాసయినాడు. డి. ఇ. ఓ. సిఫార్సుమీద గుంటూరు కాలేజి హైస్కూలులో పర్మనెంటు లీవులో మాస్టరుగా చేరాడు. కాలేజిలో ప్రవేశిస్తుగా వెళ్ళే ఛాన్సులు కూడా కనపిస్తున్నై. మాస్టరుగా చేరిన మూడోమాసంలో శివుడు అమ్మవారి పూజచేసి స్నేహితులకు విందు చేశాడు. తల్లి దండ్రులకు బట్టలు పెట్టాడు. అందరూ వెళ్ళిపోయినతరువాత అవధాన్లు శివుణ్ణిపిలిచి “కార్యం ఎప్పుడు చేసుకుంటా” వనిఅడిగాడు.

శివుడు కనుబొమ్మలు ముడిపెట్టి "నాలుగెకరాల మాట నువ్వేం చెప్పగలవో చెప్పమన్నాడు." అవధాన్లు శివుణ్ణి తిట్టటం ప్రారంభించాడు. కాంతమ్మ గారు లోపలినుంచి వచ్చి భర్తను అనునయించి కొడుకును లోపలికి తీసుకు వెళ్ళింది. ఆమాటలూ ఈ మాటలూ చెప్పింది. ఆ మాటల సందర్భంలో నాయనా! మీనాయన అడగటంలో అర్థముంది. నీకు కార్యం చేసి కోడలిని తీసుకురాలేదని అయినవాళ్ళూ కానివాళ్ళూ మమ్మల్ని పొడిచి చంపుతున్నారు. ఇదిగో పరీక్ష అయిన తరువాత అనీ– ఉద్యోగంలో చేరినతరవాత చేసుకుంటాడనీ చెప్పుకుంటూ వస్తున్నాం. మా మర్యాదలు కాపాడి మమ్మల్ని ఇతరులు తిట్టకుండా చెయ్యమని బ్రతిమాలింది.

శివుడు విసివిసి నిష్కర్షగా "అమ్మా! ఈ విషయంలో నువ్వేమీ నాకు చెప్పవద్దు. నాకు ఆపిల్ల వద్దని గోలపెడుతున్నా ఊహ రాని చిన్న పాడకట్టి అని నవ్వా, నాలుగెకరాలు వస్తవని ఆయనా, ఆ పిల్లని నాకు కట్టారు. మీరెంత చెప్పినా, ఆ పిల్ల నాకు నచ్చనూ నచ్చదు. అవసరమూ లేదు. ఇంకా కంఠశోషపడక"ని ఓదార్చాడు.

తల్లి బెంగపడి "నాయనా! నువ్విట్లా అంటే మేమేం చెయ్యాలిరా! అంది. "అమ్మా! ఆ పిల్లకు రెండో పెళ్ళి ప్రయత్నం చెయ్యండి. వాళ్ళనికూడా ప్రోత్సాహం చెయ్యండి. నేను కూడా సంబంధం వెతికి పెట్టి పెళ్ళికి హాజరవుతా. తీసుకున్న కట్నకానుకలు తిరిగి వారికిచ్చివేద్దాం. ఇది నా మనఃపూర్తి అయిన ఉద్దేశం. నీకు కోడలికోసం తరువాత విచారించుకుందాం" అన్నాడు. "ఇది ఎక్కడన్నా ఉందిట్రా అని? తల్లి నిట్టూర్పు విడిచింది. "ఇది చాలా జాతుల్లో ఉంది. అది తప్పు కాదు కూడాను" అన్నాడు శివుడు. తల్లి ఏడుస్తూ నాయనా! మనకుటుంబ మర్యాదల్ని ఆలోచించుకొని మరీ ఏదన్నా చెయ్యి. ఇక నేను వెళుతున్నానని కాంతమ్మ లేచింది.



సుందరరావు హిస్టరీమాస్టరు. శివుడికి మంచి స్నేహితుడు. శివుని సంసారపు గొడవంతా విని చాలా విచారపడతాడు.

ఒక ఆదివారంనాడు సాయంకాలం వస్తూ చదరంగం ఆడుకుని షికారుకు వెళ్ళారు, ఎన్నో ముచ్చట్లయిన తరువాత "శివా! ఇటువంటి నీ జీవితం

పాశం నశ్చట్లా. సంసారం లేకుండా ఎంతకాలముండాలనీ, ఏమిటీ నీ ఉద్దేశమని" అడిగాడు.

శివుడి కళ్ళల్లో నీళ్లు క్రమ్మినై. తలవంచింది. "మెల్లమ్మదిగా మా వాళ్లూ, దాని వాళ్లూ కూడా పలుకున్నాని మా యిద్దరి జీవితాలూ పాడుచేశారు. అర్థం శుభం ఎరుగని ఆ పిల్లను దుఃఖపెట్టి నేనుసుఖించాలనుకునేటంత పశువును గానని నీ వెరుగుదువు. కాని నేనేం చెయ్యను? ఆపిల్లను కలకాలము నా కయిష్టంగా ఉంటుంది, ఆబుద్ధి నేను మార్చుకోలేక పోతున్నా; పైగా నాకు మావాళ్ళు కలిగించే ఒత్తిడితో ఆపిల్లమీదనే కాకుండా సంసారం మీదనే విరక్తి కలుగుతోందని వ్యసన పడ్డాడు.

రావు:— ఆ పిల్లలో లోపమేమిటనీ;

శివుడు:— అదే చిత్రం, నా పూర్వసంస్కారమేమిటో గాని సుందరమైన విగ్రహాలూ, బొమ్మలూ, ప్రకృతి దృశ్యాలూ, కమ్మటి సంగీతాలూ, సాహిత్యకళ్ళైతే నా భావాలు అట్లాగే పెరిగి మంచి రూపురేఖలూ కలిగి అందమైన పిల్లను పెండ్లాడాలని, బుద్ధివచ్చి నప్పటినుంచి కోరిక. పిల్లని నేనే స్వయంగా చూచి చేసుకుంటాననికూడా చెప్పేవాడిని, కాని ఏం చేస్తానూ! ఈ పిల్లలో ...... నేను భావించే ఒక్క సంపద కూడా లేదు.

రావు:— పోనీ అప్పుడే చెప్పెయ్యక పోయినావా!

శివుడు:— వద్దని చెప్పక పోవటమేమిటీ? వద్దని ఏడిచా కూడాను.

రావు:— అయితే యింతకంటె కట్నకానుకలతో వచ్చేపిల్ల మీ వాళ్ళకు కనపడలేదేమో?

శివుడు:— వాళ్ళకు మగసంతతి అప్పటివరకూ లేక పోవటంచేత ఆస్తివస్తుందని మా వాళ్ళు భ్రమించారు. కాని నా పెళ్ళయిన రెండుసంవత్సరాలకు వాళ్ళకు ఒక మగపిల్లవాడు కలిగాడు. మా నాయన నిరాశ పొందాడు. నేను మొదటినుంచీ ఆ పిల్లమీద విముఖుడనుగానే ఉన్నా. ఎంత ప్రయత్నించినా నా మనస్సు నా స్వాధీనం కాకుండా ఉంది, మా అమ్మ ఎంతో బతిమాలుకుంటుంది. నేనేంచెయ్యను! మనసు రాయిఅయింది బాబోలు.

రావు:— అయితే ఆ పిల్లమీద సుతరాం నీకు ఇష్టంలేదా!

శివుడు:—భగవత్సాక్షిగా లేదు. ఆ పిల్ల మళ్లీ పెళ్లిచేసుకుంటే గూడ చాల సంతోషిస్తా.

రావు:—సరే. ఆ పిల్ల సంసారముమాట విచారించావు. బుద్ధిమంతుడవే. ఇక నీ సంసారం విషయమేమా?

శివుడు:—నే కోరినపిల్ల అభిస్తే చేసుకుందామనే ఉంది. వారిట్లా మాట్లాడుకుంటుండగా దుమారంలేచి వర్షచిహ్నం అగుపించటం, స్నేహితు లిద్దరూ ఇళ్లకు వెళ్ళటం తటస్థించింది,

## ౧౧

వారంరోజులు గడిచింది. ఒకరోజు పొద్దుటిపూట సుందరరావు 40-45 సంవత్సరాల ముత్తయిదువను వెంట పెట్టుకుని శివుడియింటికి వచ్చి "వీరు మాయింట్లో కాపురమున్నారు. సాంప్రదాయకులు, వీరి అన్నగారు పెద్ద కుటుంబీకులు, బందరులో సంగీతం పాఠాలు చెప్పుకుంటున్నారు. అయన గారి పెద్దకుమార్తె రత్నంలాగా ఉంటుందట. కట్నం కానుక లివ్వి వివాహం చెయ్యలేక తిరుగుతున్నారట. "నీసంగతి మాయింట్లో అనుకుంటుండగా విని" ఆ పిల్లవాడిని చూచి, నాకు నచ్చితే మా అన్నయ్యతో మాట్లాడి ఆ పిల్ల నిప్పిస్తానని "వీరు నిన్ను చూడటానికి వచ్చారు". ఆ విషయం మీ యిద్దరూ మాట్లాడుకోవచ్చు నన్నాడు రావు.

శివుడు నవ్వుతూ "ఆమెగారిని చూడమనోనీ మాట్లాడుకుందాం" అన్నాడు. "నాయనా! పెళ్లి సంప్రదింపులు మీవాళ్ళతో చెయ్యాలా? లేక నీతోనే సరిపోతుందా? కట్నంమీద ఆశ ఏమన్నా ఉందా!" అని అడిగింది, శివుడు "అన్నీ మన సుందరరావుకు తెలుసులెండి". "సరే పిల్లనుకూడా చూచుకుంటావు గాదూ" అంది. శివుడు అట్లాగే నన్నాడు. ఆవిడ బయట నుంచుంది. రావు "మా యింట్లోవాళ్ళు చెప్పారుగా పిల్ల స్ఫురద్రూపిట. మంచి తెలివిగలదిటా కూడాను. ఏదైనా ఉద్యోగములో ఉన్నవాడి కిచ్చి చెయ్యాలని తండ్రిచూస్తున్నాట్ట. నీకివ్వటానికేమీ అభ్యంతరం ఉండదు," ఇక చూచుకో అన్నాడు. "సరే నాసంగతి చూచి పెట్టావుగదా. వేడిలో వేడి మా నల్లపిల్లకుకూడా నువ్వే ఎవరినో చూచిపెట్టు"మని శివుడన్నాడు. "అది నాచేతగాదు. దానికి నువ్వే ఉన్నావంటూ" సుందరరావు వెళ్ళిపోయినాడు

## ౧౨

సుందరమ్మ పడిత్రి తొట్లోకి నీళ్లు తోడుకుంటూంది. రామయ్య చీట్లాటకు క్లబ్ పాకలోనికి వెళ్ళాడు. భ్రమరం శ్రీకృష్ణతులాభారం చదువుకుంటోంది. సుబ్బక్క కొత్తిమీద ముసుగు సర్దుకుంటూ, సుందరం! సుందరం! అని పిలుచుకుంటూ దొడ్లోకివచ్చి నూతిపళ్ళెంమీద కూలబడింది.

సుంద:—రావే అక్కా! సుబ్బిగాడి పెళ్లి నిశ్చయం చేశారటే!

అక్క:—అయ్యో! ఏం పెళ్ళో ఏం లోకమో! చేసినవి యింతవరక్కా అఘోరించిన్లై కదా! ఇక కొత్తవి.

సుంద:—అదేమిటి?

అక్క:—అదేమిటే తల్లీ! భ్రమరాంబ తల్లిసంసారం భగ్గయిందే నాయనా! ఏంచెప్పను......

సుంద:—అయ్యో! అయ్యో! అదేమిటే? శివుడు కులాసేనా?

అక్క:—అయ్యో! వాడిక్షేం మాయరోగమే! పోతులాగా ఉన్నాడు.

సుంద:—అయితే అదేమిటో! త్వరగా తేల్చు.

అక్క:—వాక్కా అదటల్లేదే! వాడమ్మకడుపు కాలా. రెండో పెళ్లి చేసుకు తగలడ్డాడే! భ్రమరం కొంప తీశాడే తల్లీ!

అంటూ శోకం ప్రారంభించింది. సుందరమ్మ ఎద గుండెపడి "అయ్యో తల్లీ! చేతులారా నీగొంతు కోశామే భ్రమరమ్మ తల్లీ! అంటూ పాకలోనికి వచ్చి భ్రమరాంబప్రక్క చతికిలబడింది. కూతుర్ని ఒడిలోకి తీసుకుంది. భ్రమరం బిగాలుపడి ఇదేమిటో నని గ్రహించటానికి ప్రయత్నిస్తోంది. "అయ్యో! ఎంతపని చేశావురా శివుడూ!" కూతురు కొంపతీశావుగదరా! రెండో పెళ్లి చేసుకోవలసినంత విషం ఏం పోశారురా ! నాయనా!" అంటూ సుబ్బక్క దొడ్లోంచి యింట్లోకి వచ్చింది. భ్రమరం గదిలోకిపోయి ఏడ్పు ప్రారంభించింది రామయ్యకు ఈసంగతి సూరయ్య చెప్పాడు. ఇంటిల్లిపాదీ దుఃఖపడ్డారు. కొంతసేపటికి "అక్కా! ఈ సంగతి ఎవరుచెప్పారే?" అని సుందరమ్మ అడిగింది.

సుందరమ్మ "తల్లీ! నేనే కళ్లారా చూచానే. సముద్రస్నానానికి మొన్న బందరు వెళ్లా, మన మామగాడుకు రామణ్ణి బందరు బదలాయించారుగా –

సరాసరి అక్కడికే వెళ్లా, వాడి పెళ్లాం హడావిడిగా ముస్తాబు చేసుకొని వెండి చెంబులూ పీటలూ పక్కవారింటికి చేరేస్తుంటే "వాళ్లింట్లో యివాళ్ళ ఏమిటే?.నని ఎరక్కపోయి అడిగా". అది ఆకుని అందకుండ పోకను పొందకుండా "పెళ్ళి హడావిడికే - వాళ్లు మాకు స్నేహితులు. వాళ్ళ పెద్దపిల్ల పెళ్లి" అంది. "లోకమో పాడో నని ఏ ఊరిస్తున్నారని" అడిగా. "గుంటూరిస్తున్నారు - కాలేజీ మాస్టరు చిన్నవాడే" అంది. అనేప్పటికే నాగుండె దడదడలాడి శివుడుగాడు కాదు గదా! అనుకున్నా. రాముడు పెళ్లాం ఒకనిమిష మాగి "ఆ సంబంధం చాలా [illegible]మైందే గానీ పెళ్లి మీద పెళ్లి. అదే వంత" అంది. "ఇక నాకు కాళ్లు చల్లబడ్డాయి. యిక్కట్లో లగ్నం వేళ ఎల్లిచూతును గదా శివుడుగాడే ప్రత్యక్షమై స్నేహితుల్తో నవ్వుకూ పేల్తూ పీటలమీద కూర్చుని అర్ధరాత్రి అర్ధరాత్రి దొంగపెళ్లి కాస్తా దూ- దూ- అనిపించుకు వెళ్లాడు. పిల్లమాత్రం చంపను చారెడు కన్నూ అదీ బాగానే ఉంది. ఈ కటికిముండాకొడుకు నాలుసరిది. పీటల మీద కూర్చుంటే శోభన పెళ్లికూతురులాగుంది. సన్నగాజాడిన జొంద పాప లాగానే ఉంది" అంది. సుందరమ్మ ఏడుస్తూ "అక్కా..! యింకా చెప్పకే నేను వినలేనంటూ" ఏడిచింది.

ఆ యూరి కరణంగారూ- షావుకారు అంజయ్యా సుందరమ్మను ఓదార్చి శివుడి దుంపతెంపి దొంగపెళ్లి రద్దుచేయించి బ్రహ్మాండభాండాలు బద్దలు కొడతా మని శివుడికి వర్తమానం పంపారు.

స్నేహితుల హితోపదేశముతో నైతేనేం - అంతరాత్మ ప్రబోధంతో నైతే నేం తనకు అప్రియం తలచని భ్రమరాంబను ఏదోవిధంగా ఒకకంట కని పెట్టుకుఉండాలని నిశ్చయించుకున్న శివుడు ఈ పైవాళ్ళ దాష్టీకంతోనూ అత్తమామల హడావిళ్ళతోను మనసు విరుచుకుని కట్నంగా డబ్బుతో తండ్రి కొనియిచ్చిన యకరం భ్రమరాంబపేర సర్వహక్కులతో రిజిష్టరుచేసి "మీకేం చేయదలచినాసరే నా సమాధానమిదే నని ఆ డాక్యుమెంట్లు ఒక స్నేహితుడి చేతికిచ్చి పంపాడు.

"చూచారా! యింతచేస్తే ఆ ఎకరం రాలిందని కరణం ప్రగల్భాలు కొట్టాడు." నన్నా ఎకరం ఉద్ధరిస్తుందా? ఈ ఒక్కపొట్టను ఈశ్వరుడైనా పోషిస్తాడు. ఎట్లా కావాలో అట్లాగే అవుతుంది. ఆ కాగితాలు తిప్పి పంప మని భ్రమరం తల్లిని కొక్కింది.

## ౧౩

రోజులూ వారాలూ గడచిన్నై, భ్రమరం పొద్దున్నే లేచి పనిపాటలు చేసి స్నానం చేసి తులసమ్మదగ్గర కళ్లు మూసుకు కూర్చుంటుంది. పని చలాకీగానే చేస్తుంది. గాని ఎప్పుడూ మౌనంగానే ఉంటుంది. పేరంటానికి కూడా పొరుగింటికిపోదు.

భ్రమరం పెత్తండ్రికూతురు చిట్టక్క కలకత్తానుంచి వచ్చింది. భ్రమరాన్ని ఓదార్చింది. నువ్వు పెళ్లినాడు చేసినట్టు గాకుండా ఈ నాడు ప్రేమస్వరూపంగా గౌరీ పూజచెయ్యి. నీకు న్యాయం జరుగుతుంది. సాహసంకూడా వినియోగించు. నేను తోడుగా ఉంటా నని ఊతమిచ్చింది. మధ్యాహ్నం గుంటూరువెళ్లి మర్నాటిరోజు సాయంత్రంబండిలో తిరిగివచ్చి భ్రమరంతో గదిలో ఒక గంటసేపు మాట్లాడి వెళ్లిపోయింది.

భ్రమరం రెండు పెద్దచీరెలు తోలుపెట్టెలో సర్దుకొని తల్లిని నగలూ పాతిక రూపాయిలూ యిమ్మంది. సుందరమ్మ "అయ్యో! అదేమిటే ఏమన్నా అప్రతిష్ఠ తెస్తావేమిటే! ఇక్కడికే తలెత్తుకోలేకుండా నే చచ్చిపోతుంటే" అంది. భ్రమరం శాంతంగా "అమ్మా! కుటుంబానికేమీ అప్రతిష్ఠ రానియ్యను, మీరు పాపం నాకు మగణ్ణి కట్టారే గాని అతణ్ణి తీసుకరాలేక పోయారు. నేను ఆపని తంటాలుపడి పూర్తి చేసుకుందామని చూస్తున్నా, నాపని సఫలమవుతుందా అందరికీ సంతోషమే. లేకపోతుందా ఆ పైవిషయం నే చెప్పలేను. నగలకు వచ్చిన ఫరవాలేదు. చిట్టక్కయ్య వెంటనే ఉంటుంది. దిగులుపడకండని తులసికీ తల్లికీ నమస్కారం చేసింది,

## ౧౪

శివుడికి బందరునుంచి పిన్నత్త కొడుకు వివాహానికి అహ్వానం వచ్చింది. పరీక్షలు జరుగుతూ ఉండటంచేత శివుడికి శలవుదొరకలా. అందుచేత రెండో పెళ్లాం పద్మావతిని ఏణ్ణర్థం కొడుకుని గుంటూరులో తెల్లవారకట్ల బండిలో ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కించి బందరు పంపుతున్నాడు. బెజవాడ స్టేషనులో రైలు ఆగటంతోనే భ్రమరాంబా చిట్టక్కయ్యా ఆడవాళ్ళ పెట్టెలోనే ఎక్కి పద్మావతికి చెరిఒకవైపునా కూర్చున్నారు.

వీళ్ళకంటే భాగ్యవంతులని పద్మం ఒదిగి కూర్చుంది. పద్మావతి చేతిలో ఉన్న కుర్రవాడిని చూచి బిక్కమొఖం వేసింది భ్రమరం. చిట్టక్కయ్య ముఖం చిట్లించి కన్ను మలిపింది. భ్రమరం గొంతు సర్దుకుని కళ్ళు తుడుచుకుంది.

ఒకటి రెండు స్టేషన్లు దాటినతరువాత పద్మావతికీ భ్రమరానికీ మాటలు కలిసినై. బెజవాడలో కొన్న మల్లెపూలచెండ్లు తానూ చిట్టక్కా చేరి ఒకటీ పెట్టుకొని పద్మావతికికూడా ఒకటిచ్చింది. భ్రమరం చిన్న మాల ఒకటి కుర్రవాడి మెడలో వేసింది. పెట్టంతా మల్లెపూవు వాసనతో పరిమళించింది. పద్మిని యిద్దరిమధ్యా విస్తరించి కూర్చుంది.

రైలుపోగింది. పద్మావతి "అక్కగారూ! ఆ నాగవత్తు ఎంతయిందని?" అడిగింది: భ్రమరం నవ్వుతూ "బాగాఉందా! మూడువందలయింది. పచ్చటి మీచేతికి ఇది ఎంతో బాగుంటుందని చకచకా తన చేతినుంచి జార్చి పద్మావతి దండచేతికి తొడిగింది. పద్మావతి మొగమాటంపడికూడా నగమీద ఉండే మోజుతో ఊరుకుంది. చిట్టక్క పద్మావతిని చూచి "బాగున్నావమ్మా" నిన్నుబట్టి ఆవస్తువుకు అందమొచ్చిందిగాని దానివల్ల నీకు రాలేదంది. పద్మిని నవ్వి ఊరుకుని ఆ నగను చూచుకుని మురుస్తూ, "అక్కగారూ మీపేరేమిటని" పద్మిని అడిగింది.

నాపేరు తుమ్మెద, అని భ్రమరం నవ్వి మీ పేరేమంది. తుమ్మెద 'ఏమిటీ! నేనెప్పుడూ ఈపేరు వినలా, తమాషాలాడుతున్నారుగాబోలు, నా పేరు పద్మిని అంది. చిట్టక్కయ్య నవ్వుతూ సరే రెంటికీ జతకూడా కలుస్తుంది. ఇంకేం. నువ్వు పద్మానివి, అది తుమ్మెద. రంగులుకూడా తేడా లేదంది, ముగ్గురూ నవ్వుకున్నారు.

పద్మిని అల్పసంతోషి. నిష్కపట హృదయం, దేహమెంత సుకుమారమో మనసంత వికాసం. ఆ రెండు మూడు గంటల్లో భ్రమరానికీ పద్మానికీ ఎంత సంబంధమో అంత సన్నిహితం వారిద్దరికీ కలిగింది. భ్రమరం నవ్వుతూ "ఈ నాగవత్తూ చంద్రహారం ఇస్తాగానీ" నీకొడుకుని ఎప్పుడూ నన్ను ఎత్తుకోనిస్తావా?" అని పద్మినిని అడిగింది. చిట్టక్క నవ్వుతూ "నువ్వుకూడా శివుణ్ణి ప్రార్థించూ, నీకు ఒక కొడుకునిస్తాడు, అంతవరకూ ఈ పిల్లాడిని ఎత్తుకోనిస్తుంది. ఔనా! చెల్లెలా!" గంగా పార్వతుల్లాగా మీ యిద్దరికీ తగూవస్తుందా!" అంది పద్మిని. కిటికీలోంచి పచ్చని చెట్లవంక కాస్సేపు

చూచి ఏమో మీ మాటలు సార్థకం కావటంలేదంది. ఇంతలో రైలు బందరు చేరింది. పద్మావతి తమ్ముడు బండీ మాట్లాడుకు నుంచున్నాడు. "మీరూ పేటకి రావాలిగా, మీ రామమూర్తిగారి యిల్లు మా యింటి పక్కనే, బండిలో ఎక్కండంది" పద్మిని. నలుగురు ఎక్కారు. రామమూర్తిగారూ ఆయనభార్యా మాకు తల్లీ తోడుగా ఉంటారు అంది పద్మిని. "వాళ్ళ బంధువులంగాబట్టి ఇక ముందు నువ్వు మాకు తల్లీ తోడు లాగా ఉండాలి" అని చిట్టక్కయ్య అంది. పద్మం కాస్సేపేదో ఆలోచించి "మీ మాటలు సార్థకం కావు" అని అంది. ఏదో ప్రసంగం ప్రారంభించారు.

బండి ఆగింది. రామమూర్తి యింట్లోకి భ్రమరం వాళ్లూ వెళ్లారు. పక్క గుమ్మంలోకి పద్మావతి వెళ్ళింది. రామమూర్తి ఆఫీసు గదిలోంచివచ్చి "సవతులిద్దర్నీ కలిపి తీసుకొచ్చావేమిటే! చిట్టక్కా! "అంటూ బాబా మీదకు తీసుకువెళ్లాడు." "భ్రమరం సంసారం పొత్తు పడుతుందని నమ్మకం కలుగుతోందంది చిట్టక్క." "సంశయం లేదన్నాడు రామమూర్తి." రామమూర్తి భార్య ఇద్దరకు ఘట్టాలు ఏర్పాటుస్తోంది.

౧౪

పద్మిని భోజనం చేసివచ్చి రామమూర్తిభార్య దగ్గర కూర్చుంది. భ్రమరం వచ్చి పద్మినిపక్క కూర్చుంది. రామమూర్తిభార్య యిప్పుడే వస్తానని లేచి వెళ్ళింది. పద్మినీ భ్రమరాంబలు లోకాభిరామాయణం ప్రారంభించారు. సంసార తాపత్రయాల్లోకి దిగారు. "పిల్లవాడికి మంచి పాలూపళ్లూ, తమకు విరివిగా కూరలు దొరక్క ఒకటే ఇబ్బంది పడుతున్నాం పాపం రోజులంది పద్మిని. భ్రమరం తలవంచుకొని "నాకా బాధలేమీ తెలియవంది" మీరు భాగ్యవంతులు గనుక మీకేం బాధలు తెలుస్తై? అంది పద్మిని. "కాదు నేనసలు సంసారం చేస్తుంటేగా ఆ బాధలు తెలియటానికి! మాతండ్రే చూచుకొంటూండంది" భ్రమరం.

పద్మిని ఆశ్చర్యంగా "ఏమిటక్కగారూ! రైలు ఎక్కినప్పటినుంచీ మీ మాటలు తమాషాగా ఉంటున్నై. పేరేమో తుమ్మెదా; మీకు సంసారం లేదు. సార్థకం కావటంల్లా, నాకేదో యింకొక భారం తోస్తోంది కాని అడగటానికి భయపడుతున్నా. పోనీ గానీ మీ అత్తవారేయూరు చెప్పరూ." అని

నొక్కి నొక్కి అడిగింది పద్మిని. భ్రమరం తలవంచుకొని చెయ్యి అడ్డం పెట్టుకుని కుడిచేత్తో పమిట చెంగు మెలి పెడుతోంది.

పద్మిని జాలిగా "ఏమిటదీ అక్కగారూ! అందులో కూడ దాపరికం ఏముంటుందీ? అని యింకా దగ్గరగా వచ్చింది. భ్రమరం పెద్దనిట్టూర్పు విడుస్తూ పమిటలోనుంచి పసుపురాచిన పాత కాగితపు మడతను తలవంచుకుని కుడి చేత్తో పద్మిని కందించింది. పద్మిని అందుకుని వివాహ లగ్నపత్రిక అని చదివి మిగతాది లోపల లోపల చదువుకుంది. రక్తంతో ఎఱ్ఱగా ఉన్న ముఖం తెల తెల బారింది. 5,6 నిమిషాలాగి "నువ్వు భ్రమరాంబవా! —నల్లనిపిచ్చి దంటారేం— మా తులోకం — తుమ్మెద అంటేనూ భ్రమరం అంటేనూ ఒకటేగా" అని పద్మిని ఆగి ఆగి మాట్లాడుకుంది. భ్రమరానికి అపుడో లేనంత దుఃఖం వచ్చింది.

పద్మిని; భ్రమరాంబను సమాధాయించాలనుకుంటుంది. కాని ఎట్లాగో తెలియటల్లా. ఎవరూ యింట్లో ఉన్నట్టు అలికిడి లేదు. కాని అక్కడనుండి లేచిపోవటానికి బుద్ధి పుట్టటల్లా. ఇంతకుముందు స్నేహితురాలు, కాగితం చూచిన తరువాత సవతి. పద్మిని ఉక్కిరి బిక్కిరి అవుతోంది. పావుగంట గడిచింది. భ్రమరం; ముఖం తుడుచుకుని హీనస్వరంతో "అమ్మాయీ! నువ్వు అనుర్ధా పడకు. ఎవరి కర్మం వారిది. అయన మగరాజు. ఇంకో పెళ్ళి చేసుకుంటే మాత్రం ఎవరేమన గలరు? దానికేంగాని; నామీద తనకంత స్పర్ధ ఎందుకు? నేను తన కేం అపకీర్తి తెచ్చానని? పేరన్నా చెవిని బడకుండా ఉండాలో! చెప్పు. భర్త కొట్టనీ తిట్టనీ ఆడది అతనితోనే ఉంటేనే గౌరవంగాని పుట్టింట్లో ఉండవచ్చా? నాకు తను వస్తువాహనాలిచ్చినా ఎకరాలు వ్రాసియిచ్చినా తను ఒక్కమాట మాట్లాడి సరసంగా ఒక్క నవ్వు నవ్వినట్లవుతుందా! మగడి పరామర్శలేని ఆడదానిజీవితం ఎంత హైన్యమో నీకు తెలియదు గాని మానవంతురాలు ఆజీవితం గడపలేదు. అవతోడువుగనుక చెపుతున్నా. అయన తగిన కారణం చూపి నన్ను వదిలేస్తే ఈ పాడుబ్రతుకు బ్రతకను. నాదోషం లేకపోతే ఇంట్లో ఉండి మీ పిల్లల్ని ఎత్తుకుంటూ మీకు వండి పెడుతూ అపఖ్యాతిలేని జీవితాన్ని గడిపేటట్టు చెయ్యి. ఇది నీచేత అవుతుందో కాదో చెప్పమని" పద్మిని రెండుచేతులూ పట్టుకొని ఎక్కి ఎక్కి ఏడవటం ప్రారంభించింది. పద్మినికూడా సవతితో దీను

రాశై వ్యసనపడి భ్రమరాన్ని ఓదార్చలేకపోయింది. చిట్టకొక్క పళ్లెంలో ఆనాసముక్కలూ, చక్కెర కలుపుకువచ్చి "ఓసి పిచ్చిపిల్లల్లారా! ఏడిచి సంసారాలు సుఖవంతం చేసుకోగలరటే? సుఖసంసారానికి సిమెంటు బాట లున్నై. ఆ రోడ్లమీద మీ ముగ్గురూ చెట్టాపట్టాలు పట్టుకు తిరగండి. అది దుమారం లేగనిచోటు. దానికి ప్రయత్నం చెయ్యండి. లెండి. లెండని పళ్ళు తినిపించి పార్కుకు తీసుకు వెళ్ళింది.

## ౧౬

శివుడు పద్మినిని విడిచి ఉండడు. అతన్ని ఆమె రూపమెంత ఆకర్షించిందో అంతకంటే ఆపిల్ల త్యాగశీలం ఎక్కువగా ఆకర్షించింది.

బందరునుంచి చెప్పిన రోజులోపలనే వచ్చేసింది పద్మిని. వచ్చినప్పటినుంచీ యథోచితంగా ఉంటోంది. పూర్వపు ప్రేమాతిశయాలు ఎక్కువగా కనబర్చదు. పద్మినిలోని మార్పును గ్రహించటానికి శివుడు ప్రయత్నిస్తాడు గాని అంతు దొరకదు. ఎందుకో "నువ్వు కట్టి అబద్ధాలరాయుడవౌతున్నావేమని" శివుడు పద్మినితో సరాగమాడాడు. పద్మిని లేనినవ్వును తెచ్చుకొని "అయ్యో! ఆడవాళ్లు అబద్ధమాడితే బ్రతుకు తెరువుంటుందా? పరమ పురుషులకు సద్దుకుపోతోంది. కాని మేము తమ దాసురాండ్రమూ. తమ కటాక్షంతో ఉంటాయి మా జీవితాలు" అంటూ మీద చెయ్యివేసుకుని ప్రక్కన కూర్చుంది. విశాలమైన పద్మిని కళ్ళు ఒక్కసారిగా తెరుచుకొని సగం మూతపడ్డాయి. శివుడు ఆ రెప్పపాటులోనే ఒక కంట్లో వెచ్చటి చూపునూ యింకో కంట్లో ప్రియమైన ప్రేమముద్రికనూ చూచాడు. సుముఖురాలను చేసుకోవాలని ప్రయత్నం చేస్తున్నాడు.

ఆ రాత్రి డి. వి. సుబ్బారావుగారి చిత్రనళీయ నాటకం. పద్మిని నాటకానికి వెళదామని మగణ్ని ప్రోత్సాహము చేసింది. శివుడు భార్యను నాటకానికి తీసికొనివెళ్లి ఆడవాళ్ళచోట కుర్చీలో కూర్చోపెట్టాడు. నలుడు దమయంతిని అడవిలో విడిచిపెట్టి పోతున్నాడు. శివుడు పద్మిని వేపు చూచాడు. పద్మిని తనకు ఇరుప్రక్కలా ఉన్న యిద్దరు ఆడవాళ్ళతో ఏదో ప్రసంగిస్తోంది. దమయంతి తండ్రియిల్లు చేరిందని సంతోషించి రెండో వివాహం చేసుకుంటుందని ఆవేదన పడుతున్నాడు నలుడు,

పద్మిని; తన పక్కనున్న యిద్దరు స్త్రీలతో కలిసి సోడాలూ చెరుకురసం తాగుతోంది. శివుడు తన భార్య ఆ పక్కవాళ్ళతో కలిసి మెలిసి మెలగటం చూస్తూ సంతోషించాడు.

బాహుకుడుగా ఉన్న నలుడు దమయంతిచే గుర్తింపబడ్డాడు. దమయంతి నలుడికి నమస్కారం చేస్తుంటే నలుడు సిగ్గుతో తల పక్కకు త్రిప్పుకుని నమస్కారం అందుకోలేకపోతున్నాడు. ద్వితీయ స్వయంవరమంటే యిదేనని దమయంతి తండ్రి చెబుతున్నాడు.

శివుడికి ఆ నలదమయంతుల సమాగమానికి ఆనందాశ్రువులు కమ్మినై. పద్మినివంక చూస్తున్నాడు. పద్మిని పక్కనున్న పిల్ల నిలబడి శివుడువంక తిరిగి నమస్కారం చేస్తున్నట్టు కనపించింది. ముఖం తేరిచూచాడు. "ఆ పిల్ల భ్రమరంలాగుందే" అనుకుంటున్నాడు. పద్మినిమీద చెయ్యివేసుకు మాట్లాడుతోంది. భ్రమరమని నిశ్చయమయింది. శివుడికి ఆశ్చర్యాన, ఆదుర్దాలతో గుండె గబగబలాడింది.

నాటకమయింది. శివుడు ఆడవాళ్ల గేటువద్ద పద్మినికోసం నిలబడ్డాడు, పద్మినీ- భ్రమరం- చిట్టక్కయ్యాలు కలిసివస్తున్నారు. శివుడు స్తంభపు పక్కకు తప్పుకుని "యిటురా! యిటురా!" అని, పద్మిన్ని పిలిచాడు. పద్మిని "పోకనగా అంత ఆదుర్దాగా పిలుస్తారెందుకూ? ఈ పిచ్చిపిల్ల కరుస్తుందని భయమా?" అంటూ స్తంభం దగ్గరకు వచ్చింది. భ్రమరం స్తంభం వైపుకు తిరిగి నమస్కారంచేసి వెళ్లింది.

శివుడు సిగ్గుపడ్డాడు. ఎట్లాగో యిల్లుచేరారు. పద్మిని మాట్లాడిస్తుంటే హృదయం విచ్చి మాట్లాడలేకపోతున్నాడు. నిద్రపట్టక లేచికూర్చుని ఏదో చదువుకోటం ప్రారంభించాడు. పద్మిని అతని చేతులో పుస్తకంలాక్కుని "పడుకోండి నిద్రలేకపోతే భారం చేస్తుంది" అని పడుకోబెట్టబోతుంది. శివుడు పద్మిన్ని దగ్గరకు తీసుకుని- "అది భ్రమరమేనా?" అని అడిగాడు. పద్మిని నవ్వుతూ ఆ నాటకం దగ్గిర పిల్లేనా? భ్రమరం కాదట తుమ్మెదట. ఆ పిల్లకు పెళ్లికాకటంతో పిచ్చెక్కిందట- ఆ పిచ్చిపిల్ల నాకొద్దని ఒక ఎకరం ఆ అమ్మాయికిచ్చి మొగుడు రెండోపెళ్లి చేసుకున్నాట్ట. ఇప్పుడు పిచ్చి నయమైందట. ఆ యెకరం మొగుడికిచ్చి అయన్ని చూస్తు

ఉంచామని వచ్చిందిట. రిజిస్టరీ కాగితాలు నాదగ్గిర దాచియిచ్చింది. చూడండని పరుపుక్రింది కాగితాలు తీసి చూపించింది.

శివుడు హిమాద్రిలాగా కూర్చున్నాడు. పద్మిని వెటకారంగా "ఆ రెండో పెళ్ళాం ఎర్రగా బుర్రగా ఉందని ఉంచుకున్నాడేమో గాని కర్మం చాలక ఏ హిస్టీరియారోగో ఏ మశూచియో వచ్చి పాడయి పోయిందంటే దానిని కూడా వదలి ఇంకొక పిల్లను చూచుకునే ప్రబుద్ధుడేమో ఆమగడు" అంది.

శివుడు మంచినీరు త్రాగాడు. చేతిలో కాగితాలు పద్మిని చేతులో పెట్టి "అతడెంత ప్రబుద్ధుడైనా ఆవిడదగ్గరకు వచ్చి లాలించేటప్పటికి కరిగిపోయి యిగిరిపోకుండా ఉండగలడూ? ఎవడో పాషాణితప్ప. పురుషుడెప్పుడూ పరమ పురుషుడే. స్త్రీ కాళికాశక్తిగాని. ఎంతమంది మగవాళ్ళయినా కలుస్తారుగాని మూడుకొప్పులు కూడవట అనేదేముం" అన్నాడు. పద్మిని నవ్వుతూ "శ్రీకృష్ణభగవానుడు ఎంతమంది స్త్రీలనో కలుపుకోలా? ప్రేమ హృదయం తెరిస్తే చాలు" అంది. భళ్ళున తెల్లవారింది. వారంరోజులు గడిచింది. డిప్టీమాస్టరు, సుందరరావు ఇంటికివచ్చి "ఏమోయ్! మీ స్నేహితుడు శివుడు ప్రథమపత్నితో ఈ బండిలో దిగాడే. స్టేషన్‌కు ఆహ్వానించటానికి రాలేదేం" అన్నాడు సుందరరావు సంతోషంగా. జాబులు మహ్వాళ్లానుగా ఏంజరిగిందో చెపుతూ అన్నాడు. ఆ పిల్లవెంట మామూళ్ళు కుర్రవాడొకడు వచ్చాడు. వాడు చెప్పాడు.

మీ శివుడు తెల్లవారేప్పటికి ఆ ఊరు వెళ్ళేటప్పటికి చూచి ఆ ఊరివారందరూ ఆశ్చర్యపడ్డారుట. అత్తగారు పలకరించకుండా లోపలికి వెళ్ళిపోయిందట, పెళ్ళాము వచ్చి కాళ్ళు కడుక్కోటందుకు నీళ్ళిచ్చి గదిలోకి సరాసరి తీసుకు వెళ్ళిందట. ఇంతలో మామవచ్చాట్ట. "పిల్లని పంపమని" యితను అడిగేప్పటికి నాకు తెలియదు మీ అత్తను కనుక్కోమన్నాట్ట. అప్పుడు అవిడదగ్గరగా పిల్లను తీసుకువెళ్ళి ఆ ఎకరం నగలూ ఊడలాక్కొని పంపిస్తే దానికి దిక్కేమిటి? గనుక మీ నాన్న చేత వ్రాసి యిప్పించి తీసుకు వెళ్ళితే. మా అభ్యంతరం లేదందిట. కరణం, సాహుకారు అంజయ్యా అందుకు మధ్యస్థం చేశారుట.

ఆపిల్ల అంతమందిని తోసేసి నామగడువచ్చి రమ్మంటుంటే మీ అంగీకారాలెవరికి కావాలీ? అని మగడికంటె ముందు నడిచి వచ్చిందిట."

సుందరరావు సైకిలెక్కి— "గంగాపతే - గౌరీపతే - కైలాసవాసు శివా! గరళభక్షకా!" అంటూ శివుడి యింటికి వెళ్లి "శివా! శివా! కైలాసపతీ" అంటూ శివుణ్ణి పలకరించాడు. శివుడు సంతోషంగా సుందరరావును లోపలికి తీసుకువెళ్లి గ్లాసెడు పాలిచ్చి చదరంగం బల్ల పరిచాడు.



# కమ్మనివలపు



## ౧

నరసింహం జూదరి, జూదంలో "పిత్రియా"మంతా పోయి తనూ, భార్యా, ఇద్దరు ఆడపిల్లలు, ఒక కొడుకు మిగిలారు. సీతమ్మ భార్య. నరసింహాన్ని

జూదపు వ్యసనములోనుంచి తప్పించాలని ప్రయత్నించి విఫలమయింది సీతమ్మ. చివరకు నరసింహం జూదమాడేందుకు అమ్మటానికి ఏదీ కనపడలా. ఆలోచిస్తూ కూర్చున్నాడు. "నాన్నా! ఆకలవుతోంది, నిన్న పొద్దున తిన్న తిండి. బియ్యం పట్టుకురావా?" అంటూ ఎదురుగా నిలబడ్డ పెద్ద కూతురు సుబ్బులు కనపడింది. బాగుంది. దీన్ని అమ్మదామని ఊహ కలిగింది నరసింహానికి.

నైజాము నుంచి ఎవరో ఒకాయన పిల్ల కావాలని వచ్చాడని విన్నాడు. సాయంకాలానికి ఆయన్ని కలుసుకుని, భాగ్యవంతుడైన ఒక కుంటి ముసలాయనకు వెయ్యిరూపాయిలు తీసుకుని పిల్లనియ్యటానికి స్థిరం చేసుకుని పెళ్లాంతో తనకు నిమిత్తం లేకుండా పొద్దుటి బండిలో పిల్లని తీసుకువెళ్లి దిగడ్చి వెయ్యిరూపాయిలు తెచ్చుకుని జూదంలో పెట్టాడు నరసింహం.

మళ్లీ ఏదయినా అమ్మదామని ఆలోచించగా రెండో చిన్నపిల్ల శాంత కనబడింది. ఈ చిన్న పిల్లని ఎవరు కొంటారని దిగులుపడి చివరకు తరువాత హాక్యూలో తాకట్టుపెడదామని ఆలోచించాడు. మళ్ళీ నైజాం వెళ్ళాడు. ఒకాయన తన దత్తపుత్రుడికిస్తే మూడువందల రూపాయిలు ఇస్తానన్నాడు, ఆ కుర్రవాడు అడంగి లేకివాడని ఆ ఊరివాళ్ళు ఎంత చెప్పినా వినక మూడువందలూ పుచ్చుకుని శాంతని వాళ్లవశం చేసి వచ్చాడు.

లక్ష్మి చంచలం గనక ఆ మూడువందలూ రెండు, మూడు కిత్తాల్లో జూదాల్లో ఓడి యింకా మిగిలి ఉన్న కొడుకుని దత్తత అనే పేరుతో అమ్మదామా, భార్యని అమ్మదామా అనుకుంటుండగా మాయిధారిమిత్తి వచ్చి నరసింహాన్ని ఎత్తుకు చక్కాపోయింది.

౨

పసితనంలో శాంత అత్తగారియింటికి పంపబడటంచేత "మగడు, అత్త, మామ అనే జ్ఞానం లేకుండా తాతయ్య అమ్మమ్మ అనే సంబంధములో పెరిగింది. అప్పుడప్పుడు గారాబం చేయటం మొదలుపెట్టింది. అల్లరిచేసేది. ముద్దుగా బళ్ళోకి పంపారు. పెంకిపిల్లయినా మంచి తెలివి తేటలయిన పిల్ల". అని మాస్టర్లు మెచ్చుకున్నారు.

ఆటల్లో తోటివాళ్ళల్లో మేటిగా ఉండేది. బొమ్మల పెళ్ళిళ్ళు చేసేది అత్తమ్మ నేడిపించి ఫలహారాలు తెచ్చి పిల్లలకు పంచేది.

నూరీడు దత్తపుత్రుడు. శాంతకు కాబోయే మగడు. పెంపుడుతండ్రి ఎన్ని బడుల్లోకి త్రిప్పినా అక్షరం అంటకపోగా ఆడపిల్లలతో ఆటలవల్ల ఆడంగి రేకితన మబ్బింది. కాలం గడుస్తూ నూరిగాడికి 20 ఏళ్ళు వచ్చినై. శాంతకు 12 ఏళ్ళు వచ్చినై. నూరిగాడి ఆడంగితనానికి శాంత సిగ్గుపడుతూ వాడిని అసహ్యించుకుని తన చుట్టుపట్లకు రానిచ్చేదే కాదు.

ఎవరైనా "శాంతను పెళ్లి చేసుకుంటావురా? నూరిగా!" అంటే పెద్ద పెట్టున గోల పెట్టి "ఉవ్వే చేసుకో నాకొద్దు" అనేవాడు.

ఎవరైనా శాంతని "నీ మొగుడు నూరిగాడంటే" పైకి నోరుముయ్యి. అనలేకపోయేదిగాని పత్తికాయల్లాగా కళ్ళెర్రచేసి మళ్లీ అట్లా అన్నావా అంటే చంపేస్తానని భావం చూపేది,

శాంత- నూరిగాడికంటే కొన్నిరెట్లు తెలివిగలపిల్ల అన్నారు. శాంత ఉన్న ప్రాంతాల్లోకే పోయేవాడు కాదు నూరీడు. ఇట్లా కొంతకాలం గడిచింది.

"నాకు పెళ్లి వద్దు మొర్రో" అని నూరిగాడు ఏడుస్తుండగా—"నాకీ ఆడంగిరేకివాడు మొగుడేమిటి! దేవుడా!" అని శాంత ఏడుస్తుండగా ఆ దత్తపితరులు ఒకానొక శుభ ముహూర్తమున ఆ దంపతులకు వివాహం చేశారు. ఆ సంఘపెద్దలు— బంధుమిత్రపరివారం యావన్మంది ఆ శుభ ముహూర్తమునకు విచ్చేసి 5 రోజులు విందులారగించి ఆ వధూవరుల్ని అనేకములుగా దీవించి ఎవరి త్రోవను వారు చక్కా పోయారే కాని——

## 3

శాంత రజస్వలయింది. అది ఘోరమైన వార్తగా చెవిని బడగానే నూరిగాడు రాత్రిరాత్రే పలాయనమై 2 సం॥ ఎక్కడున్నదీ కనపడకుండా చివరకు హైదరాబాదులో ఎవరింట్లోనో వంటలవాడుగా ఉన్నట్లు తెలిసినది.

నూరి వెళ్ళటంతో శాంత పడక విప్పింది. శాంత ధాటికి అత్తమామలు ఆగలేకపోయారు. చివరకు పుట్టింటికి పంపారు, అప్పట్లో శాంత తల్లి —

సీతమ్మ చాలా హైన్యంగా ఉండి ఒక ఉద్యోగి యింట్లో వంటకత్తెగా ఉండి జీవిస్తోంది. ఆస్థితిలో కాంతను భరించటం చాలా కష్టమయింది. వయస్సులో ఉన్న కాంతమీద ఉద్యోగి కన్నుపడింది, సీతమ్మ గిలగిల లాడింది. కాంత హుంకరించింది. ఉద్యోగి పట్టుపట్టాడు. ఆ ఉద్యోగి స్నేహితు డొకాయన ఈ గ్రంథంచూచి "కాంత చాలా తెలివిగలపిల్ల. గనుక స్కూల్లో చదివించి విజ్ఞానవంతురాల్ని చేసి ఆనందించమని" మధ్య పెట్టాడు.

వందరూపాయిలు ఖర్చుచేసి అనాధ శరణాలయంలో విద్య నభ్యసించటానికి చేర్చారు. సంవత్సరం గడిచింది. తన జీవితంమీద వీచిన ప్రచండ వాయువు విద్యావ్యాసంగం మీద నడిచింది. సంస్కృత భాషలో అభిరుచి గలిగింది. కొంత సంగీతజ్ఞానం సంపాదించింది. 8 సంవత్సరాల్లో కావ్యాలు కొన్ని చదివి విదుషీమణి అవుతానని తలంచింది.

కళాశాలాధికారి కాంతయొక్క విద్యాపిపాసకు సంతోషించి ఉచితంగా విద్యచెప్పించి కూతురులాగా చూసుకుంటూ పరీక్షలకు దరఖాస్తు పెట్టించి విదుషీమణిని చెయ్యాలని సంకల్పించాడు.

౪

కళాశాలాధికారి స్నేహితు లొకాయన కాంతకు దుస్తులకు పైఖర్చులకు ఆర్థికంగా సహాయం చేద్దామని తన కూతురు ప్రమీలకు సంస్కృతం పాఠం చెప్పేందుకు జీతంమీద నియమించాడు. రోజూ తోచినంతకాలం పాఠం చెపుతూ ప్రమీలని ఆత్మీయంగా చూచుకొని కాలంగడుపుతోంది కాంత.

ఎప్పుడూ తన జీవితాన్ని గురించి తలపోస్తుంది. ఈ పదునెనిమిది సంవత్సరాలు ఇట్లా గడచినై, ఇకముందు జీవిత మెట్లాగని! దుఃఖిస్తుంది. వివాహ బంధం దిక్కుమాలిం దని తిట్టుకుంటుంది. సంఘం కసాయివాళ్లకూటమని అనుకుంటుంది. జీవితం చాలిస్తే బాగుండు ననుకుంటుంది,

ఒక్కొక్కప్పుడు ఆశ పెల్లుబ్బగా వచ్చి తాను విద్యల సరస్వతి ననుకుంటుంది. శిష్యురాల్ని దగ్గర కూర్చోబెట్టుకుని అష్టపదులు పాడి అర్థం చెపుతుంది. పూలతోటలో విహరిస్తుంది.

ఒంటరిగా ఉన్నప్పుడు తన జీవితాన్ని గురించి ప్రశ్నపరంపరలు పుట్టి సమాధాన మిచ్చుకోలేక కటకట పడుతుంది. సంఘం వివాహంద్వారా తనకు జరిపిన పరాభవానికి కోపించుకుని జీవితంలో పురుష ప్రసంగాని తలచ కూడ దనుకుంటుంది.

ఇంద్రియజయం చేయాలని మితాహారం, ఉద్రేక పదార్థాలను తినటం మానింది. ఉదయం శీతలోదక స్నానం ప్రారంభించింది. మనసు కలవర పాటుపడని మార్గమే నని పరిశీలిస్తుంది. కాని ఆరోజూ ఈరోజూ యౌవనం మీదకు తోసుకు వచ్చి శాంత హృదయానికి శాంతిలేకుండా చేస్తోంది. దానికితోడు పక్కింటి దంపతుల సయ్యాటలు కర్ణరంధ్రముల ద్వారా లోనికి ప్రవేశించి శాంత హృదయాన్ని ఉయ్యాల లూగిస్తాయి. అప్పుడప్పుడు శాంత అర్ధరాత్రులందు ఎవరూ చూడకుండా కన్నీరు కాల్వలు కట్టేట్టు ఏడుస్తుంది.

దుర్గశిథిలాలు చిత్రలేఖకుడికి సంతోషం కలిగించినట్టు నా వ్యర్థజీవితం సంఘానికి మర్యాద తెచ్చిందా, నే నెందుకు ఆ సంఘాన్ని ఆమోదించా! అనుకుంటుంది. తన సుఖాన్ని, దుఃఖాన్ని గుర్తించని ఆ సంఘం నాది కాదు, ఈ వ్యర్థజీవితం నే నెందుకు గడపా అనుకుంటుంది శాంత. పరీక్షకు కాదంబరి (పూర్వభాగం) ఒక పఠనీయ గ్రంథం. ప్రమీలని కన్నెట్లో కూర్చోపెట్టుకుని చంద్రాపీడుడు మహాశ్వేతను దర్శించటం, ఆమె తలచిన పుండరీకుడు తనకు దక్కక పోవుటచే దేహమును విడువ నిచ్చగించక విరాగిణిగా నున్న కథ చెప్పి గద్గదకంఠంతో చెప్పలేక అసంపూర్తిగా ఆపింది శాంత.

తరువాత కథేమిటని? ప్రమీల అడిగింది. శాంత ఒక్క నవ్వు నవ్వి "మహాశ్వేత తాను స్వయంగా సంసారంచేసి సుఖించలేకపోయినా తన చెలి కాదంబరిని చంద్రాపీడునికి వివాహసంబంధ మేర్పరచి వారి సాహచర్యంతో ఆనందించిం"దని కథ పూర్తిచేసింది.

౩

శ్రీధరుడు ప్రమీల అన్నగారు. బి. ఏ. ప్యాసయి యం. బి. బి. యస్. చదువుతు సెలవులకింటికి వచ్చాడు. శాంత ప్రమీలకు పాఠం చెపుతోంది. ప్రమీల తన చేతిలో నుంచి ఫవుంటెన్ కలం తీసి "చూడారా!

అని వాదించి విరమించాడు. తండ్రి వాస్తవ మన్నాడు. శాంత శ్రీధరుని వాగ్ధోరణిని స్తంభించింది. తనకు తెలియకుండానే తన మనస్సు శ్రీధరం చేతుల్లో ఆడుతున్నట్టు తోచింది. ఆ మాటలతో తనకు తాపోపశమనం అయినట్టు తోచింది. తెల్లవార్లు అదే కలతతో గడిపింది శాంత.

శాంత- శ్రీధరంతో చనువుగా మాట్లాడా లనుకుంటుంది. మళ్లీ అంతలో మగవాడికి చనువివ్వ కూడ దని తన ఆత్మగౌరవానికి లోటని అనుకుంటుంది. శ్రీధరం చాలా విశాలహృదయుడని, అటువంటివాడిని ముభావంగా చూట్టం అన్యాయం అనుకుంటుంది.

ఒకరోజున శ్రీధరం, శాంతా, ప్రమీలా కూర్చుని చదువుకుంటుండగా ఒక చైనావాడు రెండు చిలకలు "ఈ బొమ్మమీద కూర్చుని వాటి అనందాన్ని కళ్ళద్వారా చూపుకుంటున్నై" ఆన్ని బొమ్మల్ని చూపి కొంటారా? అని అడిగాడు. శాంత "చాలా బాగా ఉన్నై బొమ్మ" లంది. "అవి ప్రకృతి అనుగుణంగా ఉన్నవి. కాబట్టి చిత్రం చాల రమ్యంగా ఉంటుంద న్నాడు" శ్రీధరం. "అట్లా ఉంటేనే అందంగా ఉంటుం దంది" శాంత. "తప్పక అట్లాగే ఉండా లన్నాను" శ్రీధరం.

ఒకరి విడిచి యింకొకరు ఉండలేనట్టు గడుపుతున్నారు. శాంత "పురుషుడు ఎట్లాగైనా చెల్లుబడి ఔతాడు. నేనూ చదువుకున్నదాన్నే; నా గొప్పతనం నాది. పురుషుడికి నే నెందుకు లొంగాలి?" అనుకుంటుంది. వెంటనే శ్రీధరుడు చాలా ఉదారుడని, అందరి పురుషులతో లెక్కకట్టదగినవాడు కాడని సమాధానం పడుతుంది.

తనకు తెలియకుండానే తన మనస్సు అతనిని గుర్తించి కలలు కంటుంది. తనకు తెలియకుండానే అది అతని వశమయిం దని తెలుసుకొని దుఃఖించింది.

ఒకరోజు రాత్రి వెన్నెల్లో శ్రీధరం, ప్రమీలా, శాంతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ప్రమీల నిద్రపోయింది. శ్రీధరం తన హృదయ కమలాన్ని శాంత అంజలిలో ఉంచాడు.

౬

శెలవు లయిపోయినై, శ్రీధరం వెళ్లిపోయాడు. శాంతా విరహబాధతో కుమిలించింది. 8 మాసాలు గడచినై. ఆ బాధకంటె పెద్దబాధ - గర్భం ధరించింది. తన్ను ఆదరించే తల్లి దగ్గర లేదు. తనదిక్కు చూచేవాళ్లు లేరు.

రోజులు గడచినకొద్దీ దుఃఖం పెరిగిపోతోంది. మానత్యాగం కంటే ప్రాణ త్యాగం మేలనుకుంది. సుఖ దుఃఖాల్లో తనతో భాగస్వామి నన్న శ్రీధరం ఈ దుఃఖాన్ని ఏవిధంగా పంచుకుంటాడో అడగా లనుకుంది. అందుకని ప్రాణాలు నిలపా లనుకుంది.

మనస్సు పరిపరివిధాలపోతుంది. గర్భపాతం కావించుకోవాలని నిశ్చయించింది బుజ్జగించేవాళ్లు లేకపోయారు తాను మహాసముద్ర మధ్యంలో ఉన్నట్టు కనపడింది. మనస్సు ఘోరంగా బాధ పడుతోంది.

తనపరీక్షలుదగ్గరకు వస్తున్నై.

సాయం సంధ్యవేళ తోటలో మల్లెపందిరి నీడలో పడుకొంది. ప్రమీలని వెళ్ళిపొమ్మంది. కొంగునుంచి 3 మాత్రలు తీసింది. దీనితో తన జీవితం కూడా ఆఖరు కావచ్చునుకుంది. మనస్సు రాయి అయింది. అనేక ఊహా పరంపరలు మీదికొచ్చినై. కన్ను మూసి స్వప్నావస్థ పొందింది. మాత్రలు చేతిలోనే ఉన్నాయి.

ఒక చిన్ని వెలుగు తోచింది. ఆ వెలుగులో ముద్దులు మూటకట్టే శిశువు తన చిన్ని మెత్తని చేతులు చాచి సన్నని వేళ్ళతో గడ్డంపట్టుకుని "అమ్మా! నన్ను చంపుతావుటే, అల్లరి చెయ్యకుండా కడుపులో దాక్కుంటానే, చంపకే అమ్మా! అని కంఠం రెండుచేతులతో బిగించినట్టు ఒక దృశ్యం తోచింది. "తండ్రీ! నేను చంపలేనురా! నాయనా!" అని వెక్కి వెక్కి ఏడుస్తూ గుండె చెరువు చేసుకుని "రా! నాయనా" అని చేతులు చాచి ఏడుస్తూ కళ్లువిప్పి జాగ్రత్తలోకి వచ్చేటప్పటికి ఎదురుగా-ప్రమీలతండ్రి, పక్కన ప్రమీల నిలబడి ఉన్నారు. శాంతి తల వంచింది. ప్రమీల తండ్రి శాంతని తన రెండుచేతుల్లోకి తీసుకుని "శాంతా! నా కన్నివిషయాలు తెలుసును. ఇదిగో శ్రీధరుడు వ్రాసినజాబు, భయపడవలసిన కారణము లేదు. ఈ సంతోష సమయాన్ని, సంశయమువలన దుఃఖమయముగా భావిస్తున్నావు లాగుంది. శ్రీధరుడు దుర్మార్గుడు కాడు!" అన్నాడు.

౩

శ్రీధరం తన వైద్యవృత్తి బెజవాడలో స్థాపించుకొన్నాడు. తన వైద్యవృత్తి ఏ పంథాలో నడపాలో అని విచారిస్తుండగా శాంత మంచి సలహాలిచ్చింది. శాంత సహకారం తనకు పల్లెల్లో మంచి అనుకూలత ఏర్పడినందుకు శాంతకు

మనస్ఫూర్తిగానే గాకుండా పైకిగూడా బాగాప్రశంసించాడు. తనకన్న మెండుకంటె ఆ మెకున్న హృదయమే జగదాదరణీయమని విశ్వసించాడు. “గృహవిషయాల్లో మంత్రిలాగా సలహాయిస్తుంది. అనారోగ్యం ఎక్కడ కలుగుతుందో అను భయంతో తల్లిలాగా కాపిస్తుంది. క్షణంలో చూపు మార్చి రంభను మరిపించి స్వర్గంచూపిస్తుంది. నా మనోభావాన్ని కనిపెట్టి నడుచుకుంటుంది. ఈ శాంతి తానైవరించిన భాగ్యదేవతా ఏమి చెప్మా” అని శ్రీధరం ఆలోచిస్తాడు.

శాంతి శుభలగ్నంలో ఒక మగశిశువుకంది. వీడు శ్రీరామచంద్రుడని శ్రీధరుడు పేరుపెట్టుకున్నాడు. తనకేది యిష్టమో అది నాకు పరమానంద మన్నది శాంతి. నీ ఔదార్యానికి లొంగిపోయానన్నాడు శ్రీధరం.

శాంత విద్వాన్ పరీక్ష ప్యాసయి విదుషీపట్టాను పొంది యుండుటచేతనూ, మంచి వివేకం గలిగి సర్వమాన్యురాలై యుండుటచేతనూ, తన పుత్రికగా చూచుకుని సంస్కృతవిద్య నేర్పించిన సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు తన పలుకుబడిని గవర్నమెంటులో వినియోగించి శాంతకు ఆడపిల్లల రేంజి యినస్పెక్ట్రెస్సుగా ఉద్యోగం వేయించుకుని ఆర్డరు తీసుకు వచ్చాడు. గురువుగారియందు శాంత, తండ్రికంటె ఎక్కువ ప్రియత్వంచూపి - తమ మాట నే కాదనలేనుగాని - నా అధికారి ఎల్లానియమిస్తే అట్లా ఆ అజ్ఞను పాలిస్తాను. గనుక డాక్టరుగారితో ఈ విషయం మనవిచేసి నిర్ణయించం డంది శాంత. శ్రీధరం నవ్వుతూ నీకిప్పించిన ఉద్యోగం నీ జీవనోపాధి కంటె నీ విద్యావ్యాసంగానికీ, విద్యాసేవకూ నీతోటి స్త్రీలోకానికి సేవచేయటానికి ఉపకరిస్తుందికదా - నాసలహా తీసుకొమ్మనటం గన్నక మానించడమేమో! అన్నాడు.

శాంత నవ్వుతూ తమను అవమానించాననే వ్యాజంలో మీమృదుహృదయం అందరికీ వినిపించాలని తలంచానంటూ ఉద్యోగం స్వీకరించి స్త్రీ విద్యకు పాటుపడుతోంది.

౮

శ్రీధరం ప్రాక్టీసు దినదినాభివృద్ధి అయి జిల్లా అంతా వ్యాప్తమయింది. శాంత మహిళామండలిలో కీర్తి గడించింది. శాంత తనకు వచ్చిన జీతం శ్రీధరం చేతుల్లో పెట్టి [illegible] [illegible]. “నీకెక్కడ కావాలోనే ని

దరిద్ర్యం నీ కొడుక్కిచ్చుకో" అన్నాడు శ్రీధరం, అట్లాగాదు. మీరు నాకు అధికారులు. సాకృతంగా వచ్చిన ప్రతిలాభ నష్టాలకీ మీరే కర్తలు. నేను వాడికోడుకియ్యాలి! "పరిమిటెడ్ రాజ్యం అసర్ రాజ్యం — బిడ్డల రాజ్యం పర రాజ్యం" నా పోషకులు మీరు. మీకు నేను దాసీనండి. ఇట్లా అంటే తనకు అవమానమన్నాడు శ్రీధరం. నాది హిందూమహిళల హృదయం. దానిని మీరంగీకరించకపోతే స్త్రీలోకాన్నే అన్యాయం చేసినట్లవుతుందంది. ఇద్దరూ నవ్వుకున్నారు.

శ్రీధరం ఒక మేడ తీసుకుని ఇంకొక దాంట్లో హాస్టల్ తెరిచాడు. బంధువులూ స్నేహితులూ పైవారూ నిధీ విరామం లేకుండా తమ యింటికి అతిథులవుతున్నారు. భోజనాల విషయంలో వంట బ్రాహ్మడు శివరామయ్యే చూసుకుంటున్నాడు. ఆయన పెద్దరికానికి సాక్ష్యాలు. ఆయన పాకం నలభీమపాకం. వయస్సు మళ్ళినవాడు. ఆయన కూతురు కందిపల్లిలో కాపురం చేస్తోంది. ఆయన డాక్టరు కుటుంబంతో మమేకంగా ఉన్నాడు. డాక్టరుని నాయనా! అనీ శాంతను అమ్మాయీ! అని పిలుస్తాడు.

ఎవరో ఒకసారి పాతబియ్యమని ముక్కిన బియ్యం పంపితే శివరామయ్య డాక్టరుని పిలిచి, నాయనా! చూడకుండా యిట్లా తెప్పిస్తే ఎట్లా? తినేది కదా నలుగురూ! తిని సంతోషించక్కర్లా! అని మందలించాడు. డాక్టరు సంతోషించాడు.



ఒకరోజు ఉదయం శివరామయ్య కూతురు ప్రసవించినట్లూ ఏదో అస్వస్థతగా నున్నందున వెంటనే రావలసిందిగాను డాక్టరు పేర శివరామయ్యకు జాబు వచ్చింది — శాంత వెంటనే వెళ్ళి పిల్లను తీసుకురమ్మంది. శ్రీధరం వెళ్ళిన వెంటనే ఎట్లా ఉందో ఉత్తరం వ్రాయి. అవసరమైతే నేను వస్తానన్నాడు. శివరామయ్య సంతోషించి మనకు ఇబ్బంది లేకుండా యింట్లో వంటాతడిని ఒప్పగించి వెళతానన్నాడు.

శ్రీధరం మధ్యహాల్లో పేపరు చదువుతూ కూర్చున్నాడు. శివరామయ్య ఒక వంటమనిషిని తీసుకొచ్చి యితను మంచివాడు, నేను చెప్పేటప్పుడు అంతా చెప్పి సెలవు తీసుకొని వెళ్ళాడు. శ్రీధరం వచ్చిన బ్రాహ్మణుడిని కూర్చోపెట్టి "మీదేవూరు, ఇంతకుముందు ఎక్కడ పనిచేశారని" అడిగాడు. "అయ్యా! మాది నైజాం —

ముద్దు పెట్టుకుంటున్నాడు. పనిమనిషి పిల్లవాడిని లేపవద్దని అడ్డు పెట్టుతోంది. కాంత వరండాలోకి వచ్చి పనిమనిషిని అదమాయించి నీ పని నువ్వు పొమ్మని గదిమింది. సూర్యం నవ్వుతూ "నేనెందుకు పిల్లవాడిని లేపుతాను - లేచే వున్నాడు. ఎవరి పిల్లాడైతేనేం? ముద్దాడితే తప్పా! సత్యం భయపడకు. నేనేమీ బుజాన వేసుకుపోనులే" అని పనిమనిషితో అంటున్నాడు. కాంత నవ్వుకుంటూ లోపలికి వెళ్లింది. శ్రీధరం కాంతను పిలిచి - "ఆ వంటమనిషిని నా మీదకు తోలుతావేమిటి? - ప్రతిదానికి వచ్చి అడుగుతున్నాడు. అయన పని బాగులేకపోతే యింకొకర్ని పిలిపిస్తా - కాకపోయినా నువ్వేమీ చెప్పకపోతే అతనేం చేస్తాడన్నాడు.

సూర్యం నవ్వుతూ లోపలికి వచ్చి "కాంతమ్మగారూ! నేనంటే మీకెందుకు అయిష్టముండాలండీ? నేనప్పుడు బాధపెట్టాను గనుకనా? యిప్పుడు బాధ కలిగించటానికి? నా అపరాధాన్ని నేను గ్రహించుకుని నేను తొలగిపోయినట్లు మీరు గ్రహించుకునే యుంటారనుకొంటున్నా నన్నాడు. కాంత దీనంగా; సుబ్బన్న తాతా మంగమ్మత్తా క్షేమమేనా! అని అడిగింది. సూర్యం కళ్లల్లో నీళ్లు నిలిచినై. ఇద్దరూ గతించారన్నాడు. కాంత నిట్టూర్పు విడిచింది.

శ్రీధరం కాంతను తనవైపు తిప్పి, సుబ్బయ్యతాతా వారూ మీ వానుకు కొండ బంధుగులేగాదూ - పాపం...ఇద్దరూ! గతించారూ! "వారు మీకు బంధుగులేనా? ఏమిటి? సూర్యం!" అని డాక్టరడిగాడు. సూర్యం తలవంచుకొని "చిత్తం నా తలిదండ్రులేనండి" అని చెప్పుకున్నాడు.

కాంత వినయంతో "ఇంకాదేం దైవయోగం ఇట్లా సంఘటనయింది. మా యిద్దరి సేవా మీరు చేయించుకోండి. నేను మీకు గృహిణిని. ఈయన మీకు అనుచరులుగా యుంటాం" - అంది డాక్టరుతో.

సూర్యం డాక్టరు ముఖము చూచి "ఇంగా కాంతమ్మను నేను మొదటి నుంచి దౌర్భాగ్యురాలుగానే చూచుకొన్నాను. కాని ఆ సంబంధాన్ని మా తల్లిదండ్రులు అట్లా చేశారు" అని యేడ్చుకొన్నాడు.

అంతట శివరామయ్య వచ్చి వంటచేసి పెట్టుచున్నాడు.

తరువాత సూర్యం, కాంత, డాక్టరు కలిసి మెలిసి సుఖంగా ఉంటున్నారు.

